# చతుర ప్రపంచం

## రెండో కైలాసం

పచ్మఢి అనే పేరుగల పర్వత ప్రాంతం ఇండియాలోని ఓ అతి చక్కటి వేసవి విడిది. మధ్యప్రదేశ్‌లో సముద్రమట్టానికి 1067 మీటర్ల ఎత్తున ఉందీ ప్రదేశం. మే, జూన్ మాసాలలో ఇక్కడి ఉష్ణోగ్రత 39 నుంచి 27 డిగ్రీలవరకూ మారుతూ ఉంటుంది. ఈ ప్రాంతం 60 చదరపు కి.మీ. దూరం విస్తరించి ఉంది. ఢిల్లీకి ఇది 931 కి.మీ. దూరంలో ఉంది. బొంబాయికి 864 కి.మీ, అల్హాబాద్‌కి 599 కి.మీ, నాగపూర్‌కి 270 కి.మీ, భోపాల్‌కి 211 కి.మీ. దూరంలోనూ ఉంది. 53 కి.మీ. దూరంలో ఉన్న పిపారియా దీనికి అతి సమీప రైల్వేస్టేషన్. అల్హాబాద్, ఇటార్సీ రూట్‌లో వుంది ఈ వేసవి విడిది. పిపారియానుంచి పచ్మఢి చేరడానికి బస్‌లో రెండు గంటలు పడుతుంది. పిపారియానుంచి 25 కి.మీ. దాటినప్పటినుంచి ఘాట్‌రోడ్ ప్రారంభమవుతుంది. పాము మెలికలా దట్టమైన అడవిగుండా పోయే ఆ దారిలో పచ్చని వృక్షాలు వేలాదిగా కనిపిస్తాయి. వింతవింత ఆకుల ఆకార నిర్మాణంతో ఎప్పుడూ మనం చూడని వృక్ష సంపద అక్కడ దర్శనమిస్తుంది.

ఈ పర్వత ప్రాంతంలో 5 గుహలు కనిపిస్తాయి. ఇవి పాండవులు తమ అరణ్యా అజ్ఞాతవాస సమయంలో నిర్మించుకు అక్కడివాళ్లు చెబుతారు. 1862లో ఆర్మీ చీఫ్ కెప్టెన్ ఫోర్‌సిత్ అనే ంన మొట్టమొదట ఈ పచ్మఢిని వేసవి విడిదిగా మార్చాడంటారు. ఈయన అప్పటి ఆ ప్రాంతపు గౌడరాజునుంచి 660 ఎకరాల భూమిని బహుమతిగా పొందాడు. అటుపైన 1872 నాటికి బ్రిటిష్ సైనికులు ఆ భూమిని 15000 ఎకరాలకు పెంచారు. అటుతర్వాత బ్రిటిష్ సైనికులకు అది వేసవి విడిది అయింది. అప్పటి ఆంగ్లేయ ఇంజనీర్లు అక్కడ చక్కని రోడ్డువేసి ఆ ప్రాంతాన్ని వాసయోగ్యంగా తీర్చిదిద్దారు.

అక్కడి గుహల గోడలపై 8, 9 శతాబ్దాలకి చెందిన చిత్రాలు దర్శనమిస్తాయి. ఇవి అప్పటి ఆ ప్రాంతాల్లో నివశించిన గిరిజన సంస్కృతిని ప్రతిబింబిస్తున్నాయంటారు పరిశీలకులు. చుట్టూ ఎత్తయిన పర్వతాలమధ్య ఓ లోతైన పళ్లెంలా కనిపిస్తుంది పచ్మఢి.




అక్కడి గుహల్లో చిన్నచిన్న గుడులు,

చతుర ... 3

దేవతా విగ్రహాలు, శివలింగాలు అనేకం కనిపిస్తాయి. భస్మాసురుడి హస్తంనుంచి దూరంగా పరుగెత్తిన శివుడు ఈ గుహలో తలదాచుకున్నాడంటారు, అక్కడి ఓ గుడి లోని శివలింగాన్ని గూర్చి. అక్కడి నీటి చలమల్లోని నీరు స్వచ్ఛంగా, తియ్యగా ఎలాంటి కాలుష్యం లేకుండా తాగడానికి యోగ్యంగా ఉంటుంది.

అక్కడ మహాదేవ పర్వతం చాలా ప్రసిద్ధి గాంచిన పర్వతం. ఆ పర్వతాన్నే ఈశ్వరుడిగా అర్చిస్తారు భక్తులు. అక్కడొక గుహ ఉంది. ఆ గుహలో సంవత్సరం మొత్తంమీద ప్రతిరోజు చుక్కలు, చుక్కలుగా నీరు కారుతూనే ఉంటుంది గోడనుంచి. ఆ నీరు గుహలో ఉన్న ఈశ్వర లింగానికి అభిషేకం చేసినట్టుగా చుట్టూ చేరుతుంది. శివరాత్రినాడు ఈ గుహలోని ఈశ్వరుణ్ణి దర్శించుకుందుకు వేలాదిమంది ప్రజలు వస్తారు. ఇది భూమట్టానికి 50 అడుగుల లోతున ఉంది.

పచ్మఢీలో అన్నిటికన్న ఎత్తయిన పర్వతం ధూప్‌గఢ్ అటు తర్వాత చౌరాగఢి. ఇది భూమట్టానికి 4317 అడుగుల ఎత్తున ఉంది. ఈ పర్వతాన్ని అధిరోహించడం చాలా కష్టమంటారు. ఈ పర్వతాగ్రాన్ని చేరాలంటే 1000 మెట్లు ఎక్కాలి. ఇక్కడ వెలసివున్న శివుడికి త్రిశూలాలు సమర్పిస్తారు భక్తులు. ధూప్‌గఢ్ శిఖరం 4500 అడుగుల ఎత్తున ఉంది. అక్కడినుంచి చూస్తే చుట్టూ విశాలంగా విస్తరించిన అడవి అందంగా దర్శనమిస్తుంది.

నిజానికి ఈ పచ్మఢిని కూడా మరో కైలాసం అంటారు. హిమాలయాల్లో మంచు ఉంటే ఇక్కడ చెట్లు ఉన్నాయంటారు. మధ్య తరగతి, దిగువ మధ్య తరగతి ప్రజలు కూడా వేల సంఖ్యలో ఈ వేసవి విడిదిని ఏటా సందర్శిస్తూ ఉంటారు.

## జంతువుల భవిష్యద్దర్శనం

ఇప్పటివరకు తేలిన లెక్కల ప్రకారం దాదాపు అయిదు లక్షలసార్లు భూకంపంవచ్చి ప్రజల ప్రాణాలకి, సంపదలకి నష్టం కలిగించిందంటున్నారు శాస్త్రజ్ఞులు.

1906 ఏప్రిల్ 18వ తేదీన అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో ఓ పెద్ద భూకంపం వచ్చింది. దాని కారణంగా ఎన్నో అంతస్థులతో నిర్మించబడిన భవనాలు, వృక్షాలు సమూలంగా పెకలింపబడి నేలమీద పడ్డాయి. నదులు, సముద్రాలు ప్రవాహపు దిక్కునే మార్చుకుని జనావాసాలపై ప్రవహించి ఎంతో మంది ప్రజల ప్రాణాలు తీసింది. భూకంప కారణంగా అడవుల్లో ప్రజ్వరిల్లిన దావాగ్నికి కూడా చాలామంది ఆహుతయ్యారు.

భూకంపాలు రావడానికి అనేక కారణాలున్నాయంటారు శాస్త్రజ్ఞులు. భూమి అట్టడుగు పొరల్లోని గ్రానైట్ రాళ్ళు కలగజేసే ఒరిపిడి కారణంగా భూమి కంపిస్తుంది. డ్యాములు, హైడల్ ప్రాజెక్టులు కట్టకూడని ప్రదేశాల్లో నిర్మించడంవలన అవి భూమ్యాకర్షణ శక్తిని చెదరగొట్టడం వల్ల భూకంపాలు ఏర్పడుతాయంటున్నారు శాస్త్రజ్ఞులు. భూమిలోనే అప్పుడప్పుడు ఏర్పడు అణుచలనంవల్ల కూడా భూమి కంపిస్తుంది. ఈ మధ్యనే రష్యాలో భూమ్యాంతర్భాగంలో జరిపిన అణువిస్ఫోట ప్రయోగాల కారణంగా ఇరాన్‌లో భూకంపం వచ్చి 21 వేల మంది చనిపోయారని తెలుస్తోంది.

ఈ భూకంపాలను వివిధ రకాలుగా వర్గీకరింపవచ్చును. భూమి అంతర్భాగంలో ఎక్కడో లోతున ఏర్పడే భూకంపాలను




ప్లూటోనిక్ ఎర్త్ క్వేక్ అంటారు. అలాకాకుండా వాల్కనోలవద్ద ఏర్పడే కంపాలను వాల్కానిక్ భూకంపాలంటారు. ప్రస్తుతం ప్రపంచం మొత్తంమీద 455 వాల్కనోలు భూకంపాలను కలిగించడానికి తయారుగా వున్నట్టు చెబుతున్నారు శాస్త్రజ్ఞులు. టెక్టానిక్ భూకంపాలు ఆయాప్రాంతాల్లోని లాండ్‌స్లైడ్స్ వల్ల ఏర్పడుతాయంటున్నారు. పంపారిన్ భూకంపాలు సముద్రాంతర్భాగాల్లో ఏర్పడుతాయి.

ఏది ఏమయినా ఎక్కువ భూకంపాలు ఆ భూమి గుణాన్నిబట్టి ఆ ప్రాంతంలో ఏర్పడుతూవుంటాయి. ఇండియాలో గుజరాత్, బెంగాల్, అస్సామ్ రాష్ట్రాలు ఈ భూకంపానికి అనువైన భూమిని కలిగివున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు.

హిమాచల్ ప్రదేశ్ ప్రాంతం కూడా అటువంటిదే. 1974 డిసెంబర్ 28వ తేదీన అక్కడ వచ్చిన భూకంపం పదివేల మంది ప్రాణాలు తీసి, 20 వేల మందిని గాయాలతో మిగిల్చింది. భూగోళ శాస్త్రజ్ఞుల కథనం ప్రకారం హిమాలయాలనానుకుని వున్న కాశ్మీరు భూభాగం కూడా భూకంపానికి అనువుగా వుంది. హిమాలయాలకి దగ్గరగా వున్న చైనా కూడా అలాంటి ప్రాంతమే. అన్నిటి కన్నా అతిదారుణమైన భూకంపం చైనాలోని సెన్‌నిసి ప్రాంతంలో వచ్చింది. ఆ సంఘటనలో 8 లక్షల ముప్ఫయివేల మంది ఒక్క నిముషంలో ప్రాణాలు కోల్పోయారు. ప్రాచీన చరిత్ర తిరగేస్తే భూకంపాల కారణంగా ఎన్నో నగరాలు, నాగరికతలూ భూగర్భంలో కలిసిపోయినట్లు తెలుస్తోంది. ఎన్నో పర్వతాలు, భూప్రాంతాలు సముద్రగర్భంలో కలిసిపోయాయి. క్రీ. పూ. 1500లో వచ్చిన భూకంపం కారణంగా లెమూరియా అనే ఓ దేశం మొత్తం సముద్రంలో కూరుకుపోయింది.

ఇప్పుడు భూకంపాగమనాన్ని ముందుగా సూచించే ఎన్నో వైజ్ఞానిక ప్రక్రియలు కనిపెట్టబడ్డాయి. కుక్క, పిల్లి, ఎలుక, గుర్రం మొదలైన కొన్ని జంతువులు కూడా భూకంప ఆగమనాన్ని కొన్ని సంకేతాలద్వారా ముందుగా సూచిస్తున్నాయి.

1976లో చైనాలో భూకంపం వచ్చింది. అది రావడానికి కొన్ని గంటలముందు గుర్రాలు వాటి శాలలు విడిచి బలవంతంగా పారిపోవడానికి ప్రయత్నించాయి. ఆవులు, కోళ్లు, ఎలుకలు, పిల్లులు, పందులు పిచ్చెక్కి




నట్టు అటూ ఇటూ పరుగులు పెట్టాయి. ఇది గ్రహించిన కొంతమంది ప్రజలు ముందుగానే సురక్షిత ప్రాంతాలకు చేరుకున్నారు. ఆ విధంగా నష్టాన్ని తగ్గించుకోగలిగారు ప్రజలు.

ప్రస్తుతం శాస్త్రవేత్తలు జంతువులకి ఈ భూకంపాగమనాన్ని ముందుగానే జోస్యం చెప్పే శక్తి ఎలా వస్తోందన్న విషయంపై పరిశోధనలు జరపడం ప్రారంభించారు.






# శీర్షాసనం

చాలా ఠీవిగా, నిట్టనిలువుగా తలక్రిందులుగా దర్శనమిస్తున్న ఈ బౌద్ధబిక్షువు చైనాలోని షావోలిన్ బౌద్ధమఠంముందు వేశాడీ శీర్షాసనం. ఇలా నిలబడగలిగితే ఆత్మ పరిశుద్ధంగా ఉంటుందనే నమ్మకంతో చాలా శ్రమపడి, ప్రాక్టీస్‌చేసి, ఏకధాటిగా రెండు గంటలసేపిలా నిలబడే స్థితిని సాధించాడీ బిక్షువు.

# 'లాకప్'పై సమీక్షలు

**మార్చి 'చతుర'లో ప్రచురితమైన మొలకలపల్లి కోటేశ్వరరావు రచన 'లాకప్'పై మాకందిన ఉత్తమ సమీక్షలు...**

## 'రాబందులు'

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**'ఖాకీ** దుస్తుల్లో వుండే రాబందులు పోలీసులని' రచయిత చక్కగా చెప్పారు. ట్రీట్‌మెంట్స్ పేరుతో అమాయకుల మాన ప్రాణాలమీద వారు జరిపే రాక్షసక్రీడలు జుగుప్సాకరంగా, ఎంతటి రాతిగుండెనైనా చలింపచేసే విధంగా వున్నాయి.

అధికారబలం, అంగబలం, రాజకీయ బలం తమకున్నాయని పైశాచికత్వంతో వీగిపోతున్నారు వీరు. దోపిడీలు, లూటీలు, మాన భంగాలు వీళ్ల జీవితధ్యేయాలు. గూండాలకి, రాజకీయనాయకులకి తొత్తులు. అసలు వీళ్లంతా తోడుదొంగలు. ఒకరి అవసరాలు ఒకరు తీర్చుకోవటానికే వారిలో వారు లింక్స్ ఏర్పరుచుకుంటారు. ఎవరి స్వప్రయోజనాలు వాళ్లవి. వాటికోసం తీపితీపి మాటలు, కల్లబొల్లి కబుర్లు, లాలూచీలు, దౌర్జన్యాలు వాళ్లలోవాళ్లే చేసుకుంటారు. వీళ్ల కిరాతకత్వానికి ఫలితంగా మానం, ప్రాణం కోల్పోయేది మాత్రం సామాన్యజీవులు. వారికి ఎర అయ్యేది పేద, బడుగు, దళితవర్గాలు.

కిషోర్‌లాంటి పోలీసురాబందులు, నిరంజన్‌లాంటి అవకాశవాదులు, గుర్నాథంలాంటి గూండాలు సమాజానికి పట్టిన చీడపురుగులు. ఈ చీడను వదిలించాలంటే ఒక్క విలేకరి కళాధర్‌కి సాధ్యమేనా? మానవహక్కుల సంఘంవాళ్లు ఒక్కసారి అలా కనిపించి తమ నిస్సహాయతను చూపటం ఏం బాగాలేదు.

ఈ నవల ద్వారా పాఠకులు పోలీసు దురాగతాల్ని తెలుసుకుంటారుగానీ ఆ దురాగతాల్ని ఎలా అణచాలో, ఎలా ఎదుర్కోవాలో అమాయక ప్రజానీకానికి తెలియదు. ఈ నవలలో కనుపించే ఒక ఆశాదీపం కళాధర్. అతని చావుతో 'అమ్మో పోలీసులకి, గూండాలకి, రాజకీయనాయకులకి ఎదురు తిరిగితే సామాన్య ప్రజలకి ఇక బ్రతుకులేదనేది' ఈ నవలలో అంతర్గతంగా కనిపిస్తున్న వాస్తవం. రచయిత తనకు తెలియకుండానే ఈ పంథాలోకి వెళ్లినట్లున్నారు.

ఒక్క కళాధర్ మరణంతో పోరాటం ఆగిపోదన్న సందేశముండాలి. హక్కుల్ని వదులుకోరాదనీ స్వేచ్ఛని బంధించనివ్వకూడదనీ, బలవంతమైన సర్పము చలిచీమలచేత చచ్చినట్టు జనం ప్రభంజనమై కదిలి ఎదురుతిరిగితే ఏ పోలీసూ, ఏ గూండా ఎవ్వడూ ఏం చెయ్యలేడన్న నగ్నసత్యాన్ని రచయిత అంతర్గతంగానైనా సూచించాల్సింది.

ఏ సమస్యకైనా ఓ పరిష్కారం చూపాలి. సమస్యను సమస్యగానే మిగల్చటంవల్ల ప్రయోజనమేమిటి?

-బి. రత్నకుమారి
ఎమ్మిగనూరు-518 360

## 'సామాజిక ప్రయోజనానికి విరుద్ధం'

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

**అ**ధికార వ్యవస్థను ఇరుసుగా చేసుకొని

సాగిన 'లాకప్' పేలవంగా ముగిసింది.

కథ నాటికీ, నేటికీ కొనసాగుతున్న బర్నింగ్ టాపిక్. అధికార బలంతో సాగుతున్న దౌర్జన్యాలకు, దౌష్ట్యాలకు అంతు ఎక్కడా? ఆరంభం ఎక్కడా? రచయిత పోలీసులు చేసిన చేస్తున్న అన్యాయాలను నివేదికలాగా చూపించారు. కాని సన్నివేశ సమన్వయాన్ని సాధించలేకపోయారు. లాకప్ మరణాలు, అమాయకుల చిత్రహింసలు, అక్రమ నిర్బంధాలు, ఎన్‌కౌంటర్లు వీటినన్నిటిని కలగాపులగంగా రాసి నవల అయిందనిపించుకున్నారు రచయిత.

ఎస్సై కిశోర్‌పై వేశ్యల తిరుగుబాటు మాత్రం పాఠకుడి మనస్సుని పట్టుకునే సన్నివేశం. ఈ నవల్లో ఇదే హైలైట్.

రాష్ట్రంలో గతంలో జరిగిన ఒక సంఘటనను ప్రతిఫలిస్తూ ఒక విలేకరీ, అతని స్నేహితుడూ ఎన్‌కౌంటర్లో మరణించటాన్ని పోలీస్ ప్రకటనతో చెప్పించి నవలను ముగించటం 'సామాజిక ప్రయోజనానికి విరుద్ధం' అంటే అధికారబలం విజయం సాధించింది. సామాన్యజనం ఆ బలం ముందు లొంగిపోవాల్సిందేనని సందేశమా? అందుకే ఈ నవల ముగింపు అభ్యుదయవాదులకు అశనిపాతం అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

-ఎనగందుల వెంకటేశ్వర్లు,
రాజపల్లి-505 122

## నిజాయితీని చంపేశారు

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

నవల చదువుతున్నంతసేపూ ఎటువంటి ముగింపునిస్తారోనని భయపడుతూ చదివానో అటువంటి ముగింపునే ఇచ్చారు రచయిత. పాత్ర తాను సృష్టించినదేకదా అని దానికి ఒక సామాజిక ప్రయోజనం లేకుండా చేశారు. కళాధర్ పాత్రకు అటువంటి ముగింపును అందించి ఉండగూడదు. ఇంతకీ కళాధర్ వంటి ఉత్తమ జర్నలిస్ట్ పాత్రను ఎందుకు సృష్టించినట్లు? ఎందుకు అంత మొందించినట్లు? అతని ద్వారా లాభం పొందిన పత్రికా యాజమాన్యం అతనికి ఎటువంటి భద్రతా కలిగించలేకపోయిందా?

విషయ ప్రాధాన్యతకి వస్తే సమాజంలో నేడు లోపభూయిష్టం కాని వ్యవస్థ ఒక్కటీ లేదు. ఏ రంగాన్ని చూసినా అంతా చక్కగా వున్నదనిగానీ, అన్నీ తప్పులే అనిగానీ చెప్పలేము. పోలీసువారిలో కూడా ఎన్నతగినవారూ, మంచికి మారుపేరైనవారూ వున్నారు. రచయిత ఒక మానవత్వంలేని పోలీసాఫీసరుని ఎన్నుకొని, అతని ద్వారా పోలీసుస్టేషన్లలో జరిగే దారుణాలను, విషయ సేకరణ కోసం వారు పెట్టే చిత్రహింసలను చిత్రీకరించారు.

ఇంట్లో చెంచా కనిపించకపోయినా, పనివాళ్లను అనుమానించేవాళ్లు మాత్రం ప్రభావతి, ఆండాళ్లమ్మలు అనుభవించిన కష్టాలు చదివిన తరువాతయినా, కొంచెం బద్ధకం వదిలించుకుని, ఎక్కడివక్కడ సర్దుకునే అలవాటు నేర్చుకుంటే, మన ఇంట్లో పనికి కుదిరిన నేరానికి పనివాళ్లు బలి అవకుండా వుంటారు.

మంచి కథకు మంచి ముగింపు అందాన్నీ, ఆహ్లాదాన్ని, తెస్తుంది. 'చతుర'లో ఇటువంటి ముగింపుతో నవల చదువుతామని అనుకోలేదు! నిజాయితీని చంపకండి! ఆ కాస్త నీతినీ, నిజాయితీని చంపేస్తే ఇక ఈ సంఘంలో బతకలేము.

-చంద్రపాటి సరస్వతి,
తెనాలి-522 201

## రక్షకుల హక్కు

*(నాల్గవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

పోలీసు వ్యవస్థలో అత్యున్నతస్థాయి అధికా




రులనుండి కానిస్టేబుళ్లవరకూ పోలీసు అన్న ప్రతివాడూ లంచగొండియై రాజకీయ నాయకులు, బడా వ్యాపారవేత్తలూ, ఆసాములతో లాలూచీపడి రక్షకభటులు కాస్తా భక్షకభటులై, యమభటులై యమలోకపు నరకాన్ని పోలీసుస్టేషన్లలో సృష్టించిన ఘనత దక్కించుకున్న యధార్థాన్ని యస్సై కిషోర్, అతని అనుచరవర్గపు ఆగడాల ద్వారా నవల ఆద్యంతం కళ్లకుగట్టినట్లు చూపడంలో రచయిత కృతకృత్యులయ్యారు.

కరడు గట్టిన తీవ్రవాదుల స్థాయి నేరస్థులనుండి సమాచారం రాబట్టడానికి తప్పని పరిస్థితులలో మాత్రమే ఉపయోగించే థర్డ్‌డిగ్రీ మెథడ్స్‌ను ఇచ్చవచ్చిన రీతిని సామన్య నేరస్థులు, ఆఖరుకి అనుమానితులపై కూడా ప్రయోగించడంలో పోలీసులు ఎంతటి దిట్టలో దొంగతనం నేరంపై అనుమానించబడి, క్రూరంగా హింసించబడిన ప్రభావతి, ఆమె తల్లి పాత్రల ద్వారా స్పష్టమయ్యింది.

కుంభకోణాలు, లాకప్‌డెత్‌లులాంటి రహస్యాలను ఛేదించి ప్రజల దృష్టికి తేవడంలో పత్రికలపాత్ర, ప్రాముఖ్యతను జర్నలిస్ట్ కళాధర్ పాత్ర ద్వారా తెలియజేసి పత్రికల చిత్తశుద్ధిని, ప్రజాస్వామ్యదేశంలో ప్రజాశ్రేయస్సుకై వాటి అంకితభావాన్ని చక్కగా తెలియజేశారు.

సభ్యసమాజంలో వేశ్యలకు చట్టబద్ధత కల్పించడంగాని లేదా పూర్తిగా నిషేధించి సమగ్రమైన పునరావాసాన్ని వారికి కల్పించడంగాని చేయని ప్రస్తుత ప్రభుత్వాలవల్ల వేశ్యలపాట్లు, భారమైన వారి బతుకులు, అపరకీచకుల్లాంటి పోలీసుల చేతుల్లో వారి అవస్థను సుబ్బమ్మ కంపెనీ వారి పాత్రలు తెలియజేస్తున్నాయి.

మొత్తంమీద పోలీసుల దుష్టకృత్యాలను ఎండగట్టడానికే ఉద్దేశించినట్లు కన్పిస్తున్న ఈ నవలలో సరైన కథాలోపం ఒక మచ్చ. అయినా సాంఘికచైతన్యం కల్గించడంలో సాహిత్య ప్రపంచంలో ఇలాంటి నవలలెన్నయినా అవసరం. "ఎన్‌కౌంటర్ పోలీసుల రక్షణ హక్కు'' అని తెల్పిన రచయిత అభినందనీయులు.

-యు. భోజరాజు
నూతిమడుగు-515 787

## అడ్డుకట్ట లేదా?

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'**లాకప్**' నవలలో రచయిత నేటి సాంఘిక, రాజకీయ పరిస్థితులను చూపెట్టుటకు ప్రయత్నించారుగానీ, దానికి పూర్తి న్యాయం చేకూర్చలేకపోయారు. ఈ కథ పూర్తిగా ఎస్.ఐ. కిషోర్, అతని పోలీస్‌స్టేషన్ చుట్టూ తిరిగింది. రచయిత నేటి రాజకీయాలలోని కుంభకోణాలపై దృష్టి నిలిపి అమాయకులు ఎలా అన్యాయాల పాలౌతున్నారో వివరించి దానిని అడ్డుకోవాలని చెప్పడానికి ప్రయత్నించారు. ఇందులో గురునాథం పాత్ర కొంతమంది రాజకీయనాయకుల జీవితాలకు పూర్తిగా సరిపోతుంది. కుళ్లు పట్టిన రాజకీయాలను, పోలీసువ్యవస్థను వివరించినంతగా దానికి విరుగుడు చూపించలేకపోయారు. ఇందులో హీరోయిజాన్ని చూపించిన జర్నలిస్ట్ కళాధర్ పాత్రకు రచయిత ఏమాత్రం న్యాయం చేకూర్చకుండానే ముగించారు. కొంతమంది పోలీసులు తమ అధికారాన్ని ఎలా దుర్వినియోగం చేస్తున్నారో వివరిస్తూ లాకప్‌డెత్‌లను, పోలీసు శిక్షలను ప్రస్తావించారు. ఒక ముఖ్యమైన ఉద్దేశంతో ప్రారంభించినప్పటికీ కథ నడిచిన కొద్దీ దానిలో పట్టుకోల్పోయారు. చివరికి అన్యాయాన్ని విజేతగా నిలిపి రచయిత చాలా పెద్ద తప్పుచేశారు. అలాకాక కిషోర్ గురునాథంలాంటివాళ్ల ఆగడాలకు అడ్డుకట్ట వేసే మార్గం ప్రభోదిస్తే నవల చాలా బాగుండేది.

-కల్యకుంట్ల ప్రవీణ్‌కుమార్,
హైదరాబాద్-500 029

# చతుర

సంపుటి: 19 సంచిక: 4 మే 1996

పెద్దమ్మ, పెదనాన్నల వద్ద ఆడిoది ఆటగా, పాడింది పాటగా పెరుగుతున్న ఆ పసిపాప చెడిపోతుందనుకుని తమతో పట్నం తీసుకువచ్చారు తల్లిదండ్రులు. పాపను బడి వాతావరణానికి, పట్నవా సపు జీవితానికి అలవాటు చెయ్యాలని అహరహం శ్రమించారు వారు.

కానీ... తన మొండిపట్టుదలతో, తనని చెప్పకుండా పల్లెకి, తనని పెంచినవారికి దూరం చేశారన్న కోపంతో... ఆ పసిపాప చేసే చర్యలు... తల్లిదండ్రుల పాలిట పరిష్కారంలేని భయంకర సమస్యల్లా తయారయ్యాయి.

తనదైన ఓ చిన్న ప్రపంచంలో తనకు తానై ఒదిగిపోతూ... పసితనపు ఆటపాటలకు దూరమైపోతున్న ఆ పాప... చివరికి మరో పాపను చంపడానికి దోహదంచేసిన పరిస్థితులేమిటి?

అతి గారాబం, లేదా అతి నిర్లక్ష్యం... పసిహృదయాలను ఎలా మలుస్తున్నాయి?

చిన్నపిల్లల స్వభావాల్ని, పెద్దల పెంపకాల్ని సాక్షరీకరిస్తూ చంద్రలత రాసిన 'వర్ధని' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

"వానా... వానా... వల్లప్పా"

"బుడుక్... బుడుక్... డుబుక్... డుబుక్..."

"అరరె... నా పడవ మునిగిపోతోందే!"

"పోతే పోయిందిలే... ఇంకోటి చేద్దాంలే!'

బిగ్గరగా, కలగాపులగంగా వినిపిస్తున్న మాటలవైపు వర్ధని చెవులు రిక్కించింది. పిల్లలంతా అప్పటికే లేచి చూరుకింది గట్ల మీదికి చేరినట్లున్నారు.

వర్ధని బద్ధకంగా ఆవులించింది. దుప్పటి లోంచి కళ్లు మాత్రం బయటకు పెట్టి, అటూ ఇటూ చూసింది. పై కప్పులో పిచ్చుకలు గూళ్లల్లోకి ఒదిగివున్నాయి.

తడిసిన మట్టిగోడల వాసనా వేడి వేడి చపాతీల వాసనా ఒకదాన్ని మించి ఒకటి పోటీపడుతూ వర్ధనిని చేరాయి. వర్ధనికి ఒక్కసారిగా ఆకలేసింది.

"కురుపా... ఆ దూడ నట్టా కట్టేయరా!" వంటింటి దగ్గర కోటయ్య గొంతు గంభీరంగా పలికింది, "ఇయిగో పాలు!"

అల్యూమినియం పాలక్యాన్లు కిందపెట్టిన శబ్దం వినబడింది. వర్ధని చెవులు రిక్కించింది.

"వర్ధనమ్మ ఇంకా లేవలేదూ? " కోటయ్య అడుగుతున్నాడు.

"ఇందాక నే వెళ్లి లేపితే కదల్లా. మంచి నిద్రలో ఉన్నట్లుంది" జయమ్మ సమాధానమిచ్చింది.

వర్ధని దుప్పటిని గబుక్కున పైకిలాగి, గట్టిగా ముసుగుపెట్టుకొంది. అడుగుల సవ్వడినిబట్టి వచ్చేవారిని అంచనావేస్తోంది.

పెదనాన్న రెండంగల్లో వంటింటి నుంచి పెద్దింటివైపు రాగలడు. అదే పెద్దమ్మ అయితే ఆయన వచ్చిన కాసేపటికి కానీ రాలేదు.

వంటిల్లు రెండు నిట్టాళ్ల పూరిల్లు. ద్దిల్లు నాలుగు నిట్టాళ్లది. వాటినే మట్టిగోడలతో గదులుగా విభజించుకున్నారు.

కోటయ్య పెద్దింటి గడప దగ్గరే నిలబడి, తలకి చుట్టుకున్న కండువాని తీసి, విదిల్చి జయమ్మ చేతికి అందించాడు. కాళ్లని వాకిట్లో వేసిన గోనెపట్టాకి తుడుచుకున్నాడు. చూరుకిందకి జారుతోన్న నీళ్లల్లో తడుస్తూ ఆడుతోన్న పిల్లల్ని చూసి కేకేశాడు.

"ఏంర్రా ఆ గొడవ? బడికి వేళవట్లా? అయినా తిన్నగా బడికెళ్లక ఇట్లా వచ్చారేం? ఆలస్యంగా వస్తే నాలుగు అంటించమని పంతులుతో చెప్పేనా ఎట్టా? "

పిల్లలు గబుక్కున పైకి లేచారు. గట్టుమీదున్న ఖాగితం పడవలని చేతుల్లోకి తీసుకొని వీధిలోకి పరుగుతీశారు.

వాణి తన పడవలను తీసుకొని వంటింట్లోకి పరిగెత్తింది.

"ఈ వాణెమ్మ ఒకటి! ఎక్కడెక్కడి పిల్లల్ని పోగేసుద్ది" గొణిగినట్లుగా అంటూ ఇంట్లోకి నడిచింది జయమ్మ.

కోటయ్య ఆమె వెనకే ఇంట్లోకి వెళ్లాడు. తిన్నగా వర్ధని దగ్గరికి వెళ్లాడు.

జయమ్మ కండువా విదిల్చి, దండెంమీద ఆరేసి వచ్చింది.

వర్ధని నిద్రపోతున్నట్లుగా కళ్లు గట్టిగా మూసుకుంది. కోటయ్య మంచంమీద కూర్చుని, దుప్పటిని పక్కకు తీశాడు.

"ఏంటమ్మా... ఇంకా లేవలేదూ? వంట్లో బావుండ్లా? " కోటయ్య ఆప్యాయంగా అడిగాడు.

"ఊ!" వర్ధని కళ్లు తెరవకుండానే బద్ధకంగా మూలిగింది.

జయమ్మ కంగారుగా వర్ధని నుదుటిమీద చేయిపెట్టి చూసింది.

"వళ్లు వెచ్చగా లేదే! తల నొప్పేవయినా ఉందా? " ఆందోళన వ్యక్తం చేస్తూ అంది.

వర్ధనికి బడి, పంతులు, పాఠాలు మనసులో మెదిలాయి. ఇంకోసారి ఇంకాస్త





గట్టిగా మూలిగింది.

"అసలు దూడను వదిలేసరికే... పాల క్యాన్లు పట్టుకొని నా వెనకమాలే నిల్చునేది! ఇవ్వాళేంటీ ఇట్టా పడుకొందీ? " కోటయ్య దిగాలుగా అడిగాడు జయమ్మని.

"పిదపకాలం దాపురించింది! లేకపోతే ఇప్పుడీ వర్షం ఏంటీ? ఇక పిల్లల ఆరోగ్యాలు ఎట్టా ఉంటయ్యి? "

జయమ్మ వర్థని నుదుటిమీద చేయివేసి, సుతారంగా వత్తింది.

"పెద్దమ్మా... వర్థనక్కని అమ్మ పిలుచుకు రమ్మంటోంది. బడికి వెళ్లాలంట" వాణి గడపదగ్గరే నిల్చుని చెప్పింది.

వర్థని మెల్లిగా కళ్లెత్తి, జయమ్మవైపు నీరసంగా చూసింది.

"అసలే దానికి వంట్లో బావులేకపోతే మధ్యలో నీ గొడవేమిటే? మీ అమ్మకు బడి రంధే తప్ప పిల్లకు ఎట్టావుందీ ఏవిటీ అన్న ఇవరం అక్కర్లా!" జయమ్మ లలితమీద కోపం వ్యక్తంచేసింది.

వాణి ఏదో అర్థమైనట్లు తలాడించి, అక్కణ్ణుంచి తుర్రుమంది.

వర్థనికి తన ఆరోగ్యంమీద తనకే అనుమానం వేసింది.

తనకు నిజంగా వంట్లో బాలేదా! వుత్తిదే! ఈరోజు పెద్దమ్మని, పెదనాన్నని పల్టీ వేయించేసింది. రోజూ అదే బడి! అదే పంతులు! అవే పాఠాలు! చదివిందే చదవాలంటే విసుగేయదూ? ఆ వాణి, సరళ వాళ్లంటే ఇంకా మూడో పాఠం దాకా కూడా రాలేదు. వాళ్లు పుస్తకమంతా నేర్చుకొనే దాకా, తను మళ్లీ అదే చదవాలంట! పన్లేకపోతే సరి!

వర్థని జయమ్మ చేతిని పట్టుకొని మెల్లిగా గొణిగింది, "పెద్దమ్మా... పెద్దమ్మా... మరే... నేను బడికి వెళ్లను పెద్దమ్మా!"

"ఏమ్మా...? ఎందుకని...? "

"వర్థనమ్మకి ఇష్టం లేకపోతే ఎందుకులే! అయినా, ఒక్కరోజు బడికి పోకపోతే కొంప లంటుకుపోతాయా? " కోటయ్య తేలిగ్గా అన్నాడు.

"పెదనాన్నా... వేణన్నాయి వస్తే? " నసిగింది వర్థని.

"నే చెప్తాగా! ముందు నువ్వు లేచి మొహం కడుక్కో. కళ్లేపిల్లారు జున్ను పంపించారు. ఎవరికీ పెట్టకుండా భోషాణంలో నీకోసం దాచిపెట్టాను. నా తల్లివి కదూ... లేమ్మా..." జయమ్మ బతిమిలాడుతూ అంది.

వర్థని గారాలుపోతూ జయమ్మ మెడ చుట్టూ చేతులు వేసి, పైకి లేచింది.

"ఏంటే అమ్మా... కూతుర్ని సాగదీస్తున్నావ్? " వేణు వెటకారంగా అంటూ లోపలికి వచ్చాడు.

"కర్నూల్‌నుంచి నువ్వెప్పుడు వచ్చావ్‌రా అబ్బాయ్? "

"ఇప్పుడే వస్తున్నా! బొంకూరు దగ్గర వాగు పొంగితేనూ తగ్గేదాకా ఆగాల్సివచ్చింది"

"చిన్నాన రాలేదే? "

"బ్యాంక్ పనులవీ చూసుకొని రేపొస్తానన్నారు. ఏంటీ రాణీగారు బడికి వెళ్లలేదా? " వేణు వర్థనిని చూస్తూ అన్నాడు.

"చూడు పెదనాన్నా..." గారాలుపోతూ... రాగాలు తీస్తూ... అంది వర్థని.

"ఇదుగో అబ్బాయ్... వర్థనమ్మని ఒక్కమాటన్నా ఊరుకొనేది లేదు! ఆ...! వర్థనమ్మని ఏమైనా అంటే మా అమ్మను అన్నట్లే! మా అమ్మను అంటే నన్ను అన్నట్లే! తెలిసిందా? " మందలిస్తున్నట్లుగా అన్నాడు కోటయ్య.

"ఆ... ఇక ఈవిడగారు బాగుపడ్డట్లే!" గొణుక్కుంటూ బయటకెళ్లాడు వేణు. వర్థని వెళుతోన్న వేణుని బొటనవేలాడిస్తూ వెక్కిరించింది.

★ ★ ★

"ఏయ్! ఆ గోరింటాకు ముందు నాకు పెట్టండి!" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది వర్థని.

రోట్లో గోరింటాకు వేసి రుబ్బుతున్న లలిత, పక్కింటి సుమతి ఎవరిని ఉద్దేశించి అన్నదోనన్నట్లు వర్ధనివంక చూశారు. వాణి వారిద్దరివైపు ఆందోళనగా చూసింది.

"మీకే చెప్పేది! ముందు నాకే పెట్టాలి!" వర్ధని చేతులు చాచి రోటిపక్కనే చతికిలపడింది.

"మరీ అంత తొందరయితే ఎలా? రుబ్బేదాకా ఆగలేవూ?" లలిత అసహనంగా అంది.

ఇంతలో వాణి నెమ్మదిగా కూడదీసుకొని, గునుస్తూ అంది, "అమ్మా, మరే... ఆకు కోసుకు రావడానికి కోసూరు చిట్టెమ్మత్త వాళ్లింటికి వెళ్లామా... వేణన్నాయ్ ఎదురొచ్చాడు. ఈవేళప్పుడు చెరువు కట్టంట ఎందుకు వచ్చారని కోప్పడ్డాడు. ఈ పక్క నుంచి అన్నయ్యకు తెలీకుండా వెళ్లి గబగబా కోసుకొచ్చా కోస్తుంటే... చూడు... చేతులు ఎలా గీరుకుపోయాయో!"

వర్ధని నిర్లక్ష్యంగా కనుబొమలెగరేసింది.

"నేను బంతాకు కూడా తెచ్చుకున్నాను. అమ్మా... అమ్మా... ముందు నాకు ఈ చేతిలో ఆకుమీద ఓ చంద్రుడు పెట్టి... తరువాత అక్కకి పెట్టవే" వాణి బతిమిలాడుతూ అంది.

"ముందు నాకు పెడతారా లేదా?" విసురుగా అంది వర్ధని.

"నెమ్మదిగా అడగలేవూ?" లలిత కసిరింది.

"పెడుతున్నారా? లేదా?" వర్ధని చిరాకు పడింది.

వాణి ఆందోళనగా లలితవంక చూసింది.

"ఏంటి చిన్నమ్మా! మరీ ఇలా తయారవుతోంది వర్ధని? నిన్ను అమ్మా అని పిలవడం మాట అటుంచి, కాస్త మర్యాదగానైనా మాట్లాడటంలేదూ!" సుమతి విడ్డూరం చూస్తున్నట్లుగా అంది.

లలితకి తల కొట్టేసినట్లయింది. గోరింటాకు గిన్నెలోకి తీస్తూ, వర్ధనిని తీక్షణంగా చూస్తూ అంది లలిత, "ఇదుగో వర్ధనీ! చివరిసారిగా చెపుతున్నాను. నాక్కోపం తెప్పించమాకు. గోరింటాకు పెట్టినప్పుడు పెట్టించుకో! తెలిసిందా!"

వర్ధని చావిడివైపు చూసింది. కోటయ్యా ఎద్దులకి జనపకట్ట వేస్తున్నాడు.

"పెదనాన్నా! పెదనాన్నా!" గట్టిగా కేకేసింది వర్ధని. కోటయ్యా పనాపి వారివైపు చూశాడు.

లలితకు చిర్రెత్తుకొచ్చింది. "ఏంటే బెదిరిస్తున్నావా?" కోపంగా అరిచింది.

"నువ్వు పెట్టకపోతేనేం? పెద్దమ్మ పెడుతుంది. ఇలా ఇవ్వు!" వర్ధని ఉక్రోషంగా అంటూ విసురుగా లలిత చేతిలోని గోరింటాకు గిన్నె లాక్కుంది.

ఆ విసురుకి గిన్నెలోని గోరింటాకంతా నేలమీద ముద్దలా పడింది.

వర్ధని ఒక్కసారిగా బిగ్గరగా ఏడుస్తూ కోటయ్యా దగ్గరకి పరుగెత్తింది.

వాణి గునుస్తూంటే లలిత, సుమతి పైపైని గోరింటాకును గిన్నెలోకి తీయడానికి ప్రయత్నిస్తున్నారు. కోటయ్యా వర్ధని చేయి పట్టుకొని రెండంగల్లో వారి దగ్గిరికి వచ్చాడు. లలిత, సుమతి గబుక్కున లేచి ఓపక్కగా నిల్చున్నారు.

"బుద్ధి లేకపోతే సరి! ఏళ్లొచ్చినా ఏం లాభం! పిల్లల్ని ఇట్టా బెదరగొట్టుకుంటారా ఎవరైనా? ఎదవ్వేషాలు! ఎదవ్వేషాలని!" కోటయ్యా ఎవరివంకా సూటిగా చూడకుండా అన్నాడు.

"అదికాదు..." లలిత ఏదో చెప్పబోయింది.

వర్ధని మళ్లీ రాగంతీసింది.

"చేసిన నిర్వాకం చాలుకానీ ఆ ఆకు తీసి అవతల పారేయండి"

లలిత మౌనంగా వాణి చేయి పట్టుకొని, లోపలికి తీసుకెళ్లింది. సుమతి ఎప్పుడెళ్లిందో తెలియకుండానే వెళ్లింది.






"దూడలు వదలాల్సిన ఏళవుతోంది. ఈ కురుపగాడు ఎక్కడ సచ్చాడో ఇంకా గొడ్లని తోలుకు రాలేదు. పోయినాడు అటే పోయి సస్తాడు" జయమ్మ చీర కొంగుకు చేతులు తుడుచుకొంటూ వంటింట్లోంచి బయటకు వచ్చింది.

వర్ధని జయమ్మని చూసి ఆరున్నొక్క రాగం అందుకుంది.

"ఏంటీ మీ కూతురు రాగాలు తీస్తంది?"

జయమ్మ కొంగు దులిపి, నడుంచుట్టూ తిప్పి దోపుకుంది.

"ఏంలేదు. పాలతాకులు కావాలంట. వండిపెడ్తావా?" కోటయ్య వర్ధనికి సైగ చేస్తూ అన్నాడు.

"దూడనొదిలే మనిషి లేదు కానీ ఈ ఎళ ప్పుడు పాలతాకులు ఎవడు దూస్తాడూ?" దీర్ఘం తీస్తూ అంది జయమ్మ.

"ఇంకెవరూ? నువ్వే! కదమ్మా వర్ధ నమ్మా!" కోటయ్య నవ్వుతూ అన్నాడు.

"అవును పెదనాన్నా" వర్ధని కళ్లు తుడు చుకొని, హుషారుగా అంది.

"చాల్లే సంబడం!" జయమ్మ మూతి మూడు వంకర్లు తిప్పింది.

"అబ్బా కూతుళ్ల యవ్వారం బాగానే ఉందే! ఇంతకీ ఏవిళ్లకోరికలు ఎవరికంటా?

అబ్బుకా? కూతురికా? "

"పెద్దమ్మకి కోపమొచ్చింది. పెద్దమ్మకి కోపమొచ్చింది" వర్ధని చప్పట్లు కొడుతూ జయమ్మచుట్టూ గెంతులేసింది.

కోటయ్య ముసిముసి నవ్వులు నవ్వుతూ, పైపంచ నోటికి అడ్డం పెట్టుకున్నాడు. జయమ్మ విసవిసా నడుచుకుంటూ, దడి దగ్గరకెళ్లి, బుడ్డాడ్ని కేకేసింది.

కోటయ్య చావిడి చూరుకింద మంచం వాల్చి, వర్ధనిని కూచోబెడుతూ అన్నాడు.

"గొడ్లొస్తన్నయ్‌గానీ నువ్విట్టా కూచోమ్మా. దాణా పెట్టి దూడొదిలి వస్తాను"

వర్ధని మంచం మధ్యలో బాసింపట్టు వేసుక్కూర్చుంది.

పాలతపేలాలు తీసుకొని వస్తున్న వాణిని చూసి, గర్వంగా తలెగరేసి నవ్వింది. వాణి మరోవైపుకు తిరిగి మూతి మూడువంకర్లు తిప్పింది.

★ ★ ★

వాణి పుస్తకాల సంచిని భుజానికి తగిలించుకొని, బడికి పరుగుతీసింది.

"పెదరెడ్డమ్మా... పెదరెడ్డమ్మా" కురప గాడు దడి కవతల నిలబడి కేకేశాడు.

"ఏంట్రా కురపా? ఇంకా పొలానికి ఎళ్లలేదంట్రా? " వేణు వంటింట్లోంచి కేకేశాడు.

"పొలానికి పొద్దుగాలే పోయినాను రెడ్డీ, సద్దికోసం వచ్చినాను. చిన్నరెడ్డమ్మను బడి కాడ దింపాల్నేమోనని ఇట్లొచ్చినాను"

"అమ్మా... వర్ధనింకా బడికెళ్లలా? " వేణు మళ్లీ కేకేశాడు.

"అబ్బబ్బా... అరవమాకురా... వస్తన్నాను" వర్ధనిని చంకనేసుకుని వచ్చింది జయమ్మ.

"కురపా... గభాల్న వచ్చేయ్. నేవెళ్తన్నానమ్మా" వేణు బయటికి వెళ్లాడు. కురప పుస్తకాల సంచి భుజానికేసుకుని, వర్ధని నెత్తుకొని బడివైపు నడిచాడు.

"పైటేళ నువ్వొచ్చేస్తావా? నన్ను రమ్మంటావా? " కోటయ్య చావిట్లోంచి కేకేశాడు.

"నేనే వస్తాలే పెదనాన్నా. నేనొచ్చేసరికి సీమచింతకాయలు చెట్టుమీంచి కోయించి ఉంచుతావుగా" గట్టిగా అరిచింది వర్ధని.

"అట్టాగే... అట్టాగే" కోటయ్య ఇంకా గట్టిగా అరిచాడు.

బడికి చెరువుగట్టుమీదే నడిచివెళ్లాలి. ఊళ్లో అందరూ మంచినీరు పెద్దకాలువలో తెచ్చుకొనేవారు. పైనీటికి అందరికీ ఈ చెరువే. కురప భుజాన సవారీ ఎక్కిన వర్ధని దారమ్మటి వారందరినీ ఏనుగెక్కిన యువరాణిలా ఠీవిగా చూస్తోంది. తెలిసిన వాళ్లు పలకరించగానే తలాడించి చిరునవ్వులు చిందిస్తోంది. కురప బడిలో వర్ధనిని దింపగానే పంతులు ఎదురొచ్చి సంచి అందుకొన్నాడు.

"ఏం వర్ధనీ? నిన్న బడికి రాలేదు? " అని పంతులు అడగలేదు. అడిగినా వర్ధని సమాధానం చెప్పాలనుకోదు. వర్ధని కోరినప్పుడే బడి.

అప్పటికే పిల్లలంతా అలికిన నేలమీద నాలుగు వరుసలుగా కూర్చుని ఉన్నారు. వర్ధనిని తన పక్కనే పీటమీద కూర్చోబెట్టాడు పంతులు.

"మూడో ఎక్కం చెప్పండి పిల్లలూ" వర్ధని వంక చూస్తూ అందర్నీ ఉద్దేశించి అన్నాడు పంతులు.

"నాకు మూడో ఎక్కం వచ్చు నేను చెప్పను!" నిర్లక్ష్యంగా అంది వర్ధని.

"మీరు చెప్పండిరా" పంతులు మిగిలినవాళ్లవంక చూసి అరిచాడు. వర్ధని సంచిలోంచి పలక తీసుకొని నాలుగో ఎక్కం వేసిచ్చాడు.

★ ★ ★

"వాణెమ్మా, మధ్యాహ్నం వస్తూ కాస్త మజ్జిగ తెస్తావ్? " వాణిని పక్కకు పిలిచి అడిగింది పంతులమ్మ.

పంతులమ్మంటే పాఠాలు చెప్పే పంతు




లమ్మ కాదు. పంతులు భార్య పంతులమ్మ. అప్పటికే పిల్లలంతా బయటికి పరుగులు తీశారు.

"మా అమ్మని అడుగుతా" అంటూ వాణి గబగబ బయటికి వెళ్లబోయింది.

"ఇదుగో వాణీ, వర్ధని సంచి కూడా తీసు కెళ్లు" పంతులు కేకేశాడు.

వాణి రెండు భుజాలకీ రెండు సంచులు తగిలించుకొని పరిగెత్తింది. వర్ధని తమ ఇంటికి నాలుగిళ్లవతల ఉన్న సరళతో పాటు నడుస్తోంది. వాణి రొప్పుతూ వచ్చి వీళ్లని కలిసింది. సరళ, వర్ధని వాణికన్నా వేగంగా ముందుకెళ్తున్నారు.

"జమ్మిచెట్టుకి ఉయ్యాల వేస్తానన్నాడు మా తాతయ్య. మీరూ వస్తారా? " అడిగింది సరళ.

"ఎప్పుడు? " కుతూహలంగా అడిగింది వర్ధని.

"తాతయ్య ఈపాటికి వేసే ఉంటాడు. నేను గభాల్న అన్నం తినేసి కాసేపు ఉయ్యాల ఊగి వస్తాను. బడయ్యాక నువ్వూ రాకూడదూ? "

"నేనడిగానంటే మా పెదనాన్న కూడా వేసిస్తాడు" బింకంగా అంది వర్ధని.

"పోనీ నే రానా? " వాణి వెనకనుంచి అడిగింది.

"నీ ఇష్టం!" సరళ గబగబ ముందుకు పరుగుతీసింది.

వర్ధని చెరువు గట్టంట నడుస్తూ, అప్రయత్నంగా నేలమీది గులకరాళ్లను చేతిలోకి తీసుకొంది. ఒక రాయిని నీళ్లల్లోకి విసిరేసింది. రాయి కేంద్రంగా పుట్టుకొస్తోన్న నీటి వలయాలను లెక్కిస్తూ నుల్చుంది. సరళా వాళ్ల జమ్మిచెట్టు, దానికి వెయ్యబోయే ఉయ్యాల మనసులో మెదిలాయి. పెదనాన్న తను అడగగానే ఉయ్యాల చావిట్లో వేసిస్తాడు. కానీ సరళా వాళ్లింటి ముందున్న జమ్మిచెట్టు చాలా పెద్దది. దానికి కట్టే ఉయ్యాలమీద చాలా ఎత్తుకు ఊగొచ్చు ఇళ్ల పైకప్పులు, వాటిమీదకు అల్లించిన తీగలకు విరగబూసిన పూలు... ఇంకా ఎన్నెన్నో ఎన్నెన్నో చూడొచ్చు. తమ చావిట్లో ఏం కనిపిస్తాయి? చూరూ, వాసాలు తప్ప. తనూ వాణీతోపాటు వెళితే...

"ఏంటక్కా ఇక్కడే ఆగిపోయావు? " వాణి ఆయాసపడుతూ అంది.

"ఏయ్! నన్ను అక్కా తొక్కా అనకు!" వర్ధని చిరాగ్గా అంది.

వర్ధనికి ఉదయం పెదనాన్న సీమచింత కాయలు కోసి ఉంచుతానన్నది జ్ఞాపకం వచ్చింది.

"అయితే నీ సంచి నువ్వే మోసుకో!" వాణి కోపంగా అంది.

వర్ధని వాణి మాటలు వినిపించనట్లు ఇంటివైపు పరుగుతీసింది.

"పెద్దమ్మా... పెద్దమ్మా..." వర్ధని జయమ్మను పిలుస్తూ పెద్దింట్లో చూసి, లేకపోవడంతో వంటింట్లోకి పరుగుతీసింది. ఆ వేగానికి ఎదురుగా వస్తున్న లలితను ఢీకొట్టింది. లలిత వర్ధనిని రెండుచేతుల్తో ఆపి, అంది, "వర్ధనీ, ఏంటా పరుగు? వాణీ ఏదీ? "

వర్ధని లలితను విసురుగా విదిలించుకుంటూ వంటింటి వెనక్కి పరుగెత్తింది.

"భోంచేసి వెళ్లరాదూ వర్ధనీ, మిట్ట మధ్యాహ్నం పూట ఎండలో ఆ గెంతులేంటీ? "

లలిత మాటలు పూర్తి అవ్వకముందే వర్ధని అక్కడినుండి మాయమయింది. వంటింటి చూరుకింద మంచం వాల్చుకొని నడుం వాల్చిన జయమ్మని వర్ధని రెండుచేతులా పట్టి లాగుతూ అరిచింది. "పెద్దమ్మా... పెద్దమ్మా... పెదనాన్నేడీ? "

"అబ్బబ్బ... ముందు చేయి వదలవే! మీ పెదనాన్న చావిట్లో లేడూ? "

"నేనా పక్కకి వెళ్లలా... పెదనాన్న సీమ

# ఇదో రకం గుర్రప్పందం

కెనడాలో ఏటా ఇలాంటి పోటీ ఒకటి జరుగుతుంది. గుర్రాన్ని ఇలా తాడుతో పట్టుకుని అది పరిగెత్తకుండా, ముందుకు పోకుండా ఆపగలగాలి. ''హార్స్ పవర్'' అధిక శక్తి గలవారికే అది సాధ్యం. డోన్ ఏష్‌బేచర్ అనే ఈ పెద్దమనిషి ఆ పందెంలో నెగ్గాడు ఇప్పుడు ఏకంగా రెండు గుర్రాల్ని ఆపే పోటీలో నెగ్గాలని ప్రయత్నిస్తున్నాడు.



చింత కాయలు కోశాడా? ""

"నేనెక్కడ చూశానూ? అయినా అన్నం తినేముందు అయ్యేందుకే నీకు? పద అన్నం పెడతాను"

"నాకిప్పుడే వద్దు. మళ్లీ వస్తా ఉండు" జయమ్మ చేతులు వదిలి, కోటయ్యను కేకేస్తూ చావిడి దగ్గరికి పరిగెత్తింది.

"పెదనాన్నా... పెదనాన్నా" రొప్పుతూ వచ్చి కోటయ్య పక్కనే మంచంమీద కూలబడింది. కోటయ్య పేనుతున్న తాడును మంచం కోడుకు చుట్టాడు.

"అన్నం తిన్నావా అమ్మా"

"ఊహూ! నువ్వు సీమచింతకాయలు కోసుంచుతానన్నావ్‌గా!"

"ఇయిగో!" మంచంమీదున్న పైపంచను చేతిలోకి తీసుకొని, ముడివిప్పి కాయలు తీసిచ్చాడు.

"అబ్బా! ఎంత బాగా పండాయో! పెద నాన్నా ఇంత ఎఱ్ఱటియ్యి నీకెట్టా అంది నయ్యి? "

"బీసిగాణ్ణి ఇంటి కప్పుమీధికి ఎక్కించాలే. ఏదీ నీ చెయ్యిట్టా పట్టు"

వర్ధని కుతూహలంగా చేయి చాచింది.

"కళ్లు మూసుకో" గబుక్కున కళ్లు మూసుకొంది.

కోటయ్య వంగి మంచంకింద వారలో దాచిన కోడిగుడ్డు తీసి వర్ధని చేతిలో పెట్టాడు. వర్ధని కళ్లు తెరిచి చూసి నవ్వింది. కోటయ్య వర్ధనిని మురిపెంగా చూస్తూ అన్నాడు.

"కోడి... అదుగో ఆ మొచ్చుమీద దూరి గుడ్డుపెట్టింది. పో! పోయి మీ పెద్దమ్మతో అట్టు వేయించుకుని తిను పో!"

వర్ధని తలెత్తి మొచ్చువైపు చూసింది. పాడయిన వ్యవసాయ పనిముట్లు మొచ్చు మీద చిందరవందరగా పడివున్నాయి.

"అక్కడికి ఎట్లా ఎక్కావ్ పెదనాన్నా? " ఆశ్చర్యంగా అడిగింది వర్ధని.

"నేనెక్కాలా ఏంటీ? నిల్చుంటే అందదూ? " కోటయ్య కనుబొమలెగరుస్తూ అన్నాడు.

"ఓయబ్బో! ఆజానుబావుడు! మీ పెదనాన్నేంటే అమ్మాయ్ అంటున్నాడు? " నడుం మీద చేతులు పెట్టుకొని చావిడి గుంజకు ఆనుకొని నిల్చుని ఉంది జయమ్మ.

"చూడమ్మా మీ పెద్దమ్మ! దొంగలా మన మాటలన్నీ ఎట్టా వింటందో!"

"అబ్బే! మేమే దొంగలం! పొదగేయాలని పోగుచేస్తన్న గుడ్లన్నీ మొచ్చుమీంచి మొచ్చు మీదే మాయంచేత్తన్నాం!" మూతి తిప్పుతూ అంది జయమ్మ.

"లేకపోతే? పిల్లలకి పెట్టకుండా గుడ్లన్నీ దాచిపెడతామనుకొన్నావా? "

"ఆ మరే! దాచి యాపారం చేద్దామనీ...!' కోపంగా అంది జయమ్మ.

వర్ధని జయమ్మ మొహం చూసి వచ్చే నవ్వు ఆపుకొంటూ అంది.

"పెద్దమ్మా, అదేదో మళ్లీ చేద్దువుగానీ ముందు నాకు ఆ గుడ్డుతో అట్టేసిపెట్టు" అంటూ జయమ్మ చేతిలో గుడ్డు ఉంచింది.

"ఆ వాణి తింటం కూడా అయిపోయింది. మీ పెదనాన్నతో యవ్వారం బడి నుంచి వచ్చాక చేద్దువులే గానీ పద"

"నువ్వు పద పెద్దమ్మా నేనొస్తాను. ఒక్క నిమిషంలో వస్తాను! నువ్వు పద!" వర్ధని జయమ్మని రెండు చేతులతో నెట్టింది.

"అబ్బబ్బ... వెళ్తన్నాను ఉండవే!" జయమ్మ విసవిసా వంటింటివైపెళ్లింది.

వర్ధని, కోటయ్య ఆమె వెళ్లినవైపే నవ్వుతూ చూశారు. కోటయ్య పైపంచె దులిపి తలచుట్టూ చుట్టుకున్నాడు. వర్ధని పాయలు పాయలుగా తీసిపెట్టుకున్న నార వైపు చూసింది.

"పెదనాన్నా... పెదనాన్నా... నీకు నేను నార అందియ్యనా? " హుషారుగా అడిగింది.

"బడికి వేళవట్లా?"

వర్ధనికి బడికన్నా ముందు సరళకి వాళ్ల తాతయ్య వేసిస్తానన్న ఉయ్యాల జ్ఞాపకం వచ్చింది. పెదనాన్న కూడా ఓ పెద్ద తాడు పేనితే బావుణ్ణు! వర్ధని మనసులో ఏదో మూల ఆశ కదలాడింది.

"పెదనాన్నా... ఈ తాళ్లు దేనికి?"

"పెద్దింటిముందు పందిరేద్దామని. వేణన్నాయి జమ్ము తోలిస్తానన్నాడు"

"ఓహో!" అర్థమయినట్టు తలాడించింది వర్ధని.

"నేవస్తా పెదనాన్నా" ఒక్కసారిగా పైకి లేచి వంటింటివైపు పరుగుతీసింది.

వాణి పుస్తకాల సంచి భుజానికి తగిలించుకొని చేతిలోని మజ్జిగ గిన్నెను తొణకకుండా జాగ్రత్తగా పట్టుకొని, నెమ్మదిగా నడుస్తూ ఎదురొచ్చింది.

"పెద్దమ్మా... పెద్దమ్మా... తొందరగా అన్నం పెట్టు!" వర్ధని జయమ్మని తొందర చేసింది.

"కాస్తాగు. కోడిగుడ్డు అట్టు ఏయమంటివిగా!"

"అట్టు మళ్లీ తింటాలే, ముందు అన్నం పెట్టు" హడావుడి చేసింది వర్ధని.

జయమ్మ కోడిగుడ్డును అటకమీది, డబ్బాలో జాగ్రత్తగా దాచింది.

★ ★ ★

"ప్రభవ... విభవ..."

వర్ధని బడి దగ్గరికి వెళ్లేసరికి పిల్లల చేత తెలుగు సంవత్సరాలు వల్లెవేయిస్తున్నాడు పంతులు. వర్ధని గబుక్కున వెళ్లి పీటమీద కూర్చుంది. వర్ధని వల్లెవేస్తున్న పిల్లలందర్నీ గమనించింది. పెదాలు కదులుతున్నా ఒక్కరి కళ్లూ ఎదురుగా వున్న పెద్దబాలశిక్ష మీద లేవు. సరళ, వాణి నింపాదిగా, నెమ్మదిగా చెపుతున్నారు.

ఈ పంతులు ఒక్కొక్కళ్లనీ అడగకూడదా? తొందరగా అప్పచెప్పేసి బయటకెళ్లొచ్చు వర్ధని విసుగ్గా అనుకొంది. పంతులు సరిగ్గా పలకడంలేదంటూ కొందరిని గోడకుర్చీ వేయించాడు.

ఇంతమందిలో ఎవరు తప్పు పలుకుతున్నారో పంతులు ఎలా గుర్తించడం?

ఒక్కొక్కళ్లనీ విడిగా అడిగినప్పుడు కదా ఎవరు తప్పు చెప్పారో తెలిసేది. వర్ధని పంతులు వైపు చిరాగ్గా చూసింది.

పంతులమ్మ ముక్కలు చేసిచ్చిన వక్కలు నములుతూ, మధ్య మధ్యలో ఆవులిస్తూ, పిల్లలు అప్పచెపుతోంది వింటున్నాడు. వర్ధనికి బళ్లోనుంచి పారిపోవాలనిపించింది. వాణి, సరళలకోసం ఉండిపోవాల్సి వచ్చింది.

బడి వదలగానే వర్ధని సరళతోపాటే బయటకు వచ్చింది. ఉయ్యాల సంగతి అడగడానికి అభిమానం అడ్డొచ్చింది.

"నువ్వు మాతో వస్తున్నావా?" సూటిగా అడిగింది సరళ.

వర్ధనికి ఉదయం తనన్నమాట జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు తను వీళ్లమ్మట వెళ్లితే పెదనాన్న తన మాట వినడేమోనని వీళ్లను కోరూ? అది అబద్ధం కాదూ? తను మరెందుకు ఉయ్యాల వేయించుకోవట్లేదు. తనడిగితే పెదనాన్న వేసియ్యడూ? తప్పక వేసిస్తాడు.

సరళ మళ్లీ అడగడంతో వర్ధని అడ్డదిడ్డంగా తలాడించింది. ముగ్గురూ కలిసి నడిచారు. వాణి, సరళ గలగల మాట్లాడుతూ ముందు నడుస్తున్నారు. వర్ధని చెరువు గట్టుమీదికి రాగానే ఆగి, అక్కడే నిల్చుంది. సాయంకాలం పనులకు నీళ్లు తీసుకెళుతున్నారు ఊళ్లోవాళ్లు.

"ఏంటమ్మాయ్! ఇక్కడ నిల్చున్నావ్?" వర్ధనిని తెలిసినవాళ్లెవరో పలకరించారు. వర్ధని మాట్లాడకుండా కిందికి వంగి గులక రాళ్లను ఏరి గుప్పిట్లో పట్టుకొంది. చెరువును ఈ పక్కనుంచి ఆ పక్కదాకా పరిశీలించి చూసింది. నాచులోంచి ఎగురుతోన్న




చిన్నచిన్న కప్ప పిల్లలు చెరువు గట్లవెంబడి పెరుగుతోన్న జమ్ములోకి మాయమవడం గమనించింది. చేతిలోని రాయిని శక్తికొద్దీ చెరువు మధ్యలోకి విసిరేసింది. నీటి వల యాల వెంబడి చూపు సారించింది. తళ తళ మెరుస్తోన్న నీళ్లమీద తేలుతున్న రాయి వర్ధని దృష్టిని ఆకర్షించింది. వర్ధని కళ్లు చిలికించి మళ్ళీ చూసింది. సందేహం లేదు. అది రాయే! నీళ్లమీద తేలే రాయి! గాబులో వదిలిన కాగితం పడవలా కదల కుండా రీవిగా నిల్చుంది!

వర్ధని అప్రయత్నంగా చేతిలోని గులక రాయి నీళ్లల్లోకి విసిరింది. అది బుడుంగున మునిగింది. వర్ధని సంతోషం పట్టలేకపో యింది. తను కనుగొన్న విషయం ఎవరికి చెప్పాలి? తనతోపాటు బయలుదేరిన వాణి, సరళ ఏరి? వర్ధని చుట్టూ చూసింది. వాళ్ళీపాటికే వుయ్యాల దగ్గరకి చేరుకొని వుంటారు. వర్ధని గిరుక్కున వెనక్కు తిరిగి, వారిదగ్గరికి పరుగుతీసింది.

సరళా వాళ్ళింటిదగ్గర మలుపు తిరగబో యిన వర్ధని కాలికి రాయితగిలి బోర్లాపడబో యింది. తమాయించుకొని కాలు సవరదీసు కొంటూ, పైకి లేచి నిల్చుంది.

ఓ చేత్తో బిందెను ఊపుతూ, మరోచేత్తో ఓణీని పైకేసుకొంటూ, రోడ్డు ఈ మూల నుంచి ఆ మూలదాకా తనదే రాజ్యమన్న ట్టుగా నిర్లక్ష్యంగా నడుస్తూ, తనలోతను గొణుక్కుంటూ వస్తున్న ఓ యువతి వర్ధ నిని చూసి ఆగింది.

"ఏంటే వొరదమ్మాయ్... అట్టా పడ్డావ్?"

వర్ధని ఆమె వైపు చూసింది. ఏమీలేద నట్టు వర్ధని అడ్డంగా తలూపింది.

ఆ అమ్మాయి కళ్ళు గిరగిరా తిప్పింది. గట్టిగా చప్పట్లు కొడుతూ పగలబడి నవ్వింది. అంతలోనే బిందెను గిరగిరా తిప్పి, "లలితక్కాయ్ లేదూ... ఇయిగో... ఈ గాజులిచ్చింది... హ... హ..." నవ్వుతూ చెరువువైపు వేగంగా కదిలింది.

"పెద్దక్కాయ్... ఎక్కడికెళ్తన్నావ్?" వర్ధని చేయిపట్టి వూపుతూ అంది.

"వొరదమ్మాయ్... ఎక్కడికెళ్తన్నావ్?" వర్ధని అడిగినట్లే అడిగింది. పెద్దమ్మాయి వర్ధని చేయి విడిపించుకొని, తనలోతను నవ్వుకొంటూ, గొణుక్కుంటూ చెరువువైపు వెళ్ళింది. వయస్సు పాతికేళ్లు దాటిపోయినా మూడేళ్ళయినా నిండని మనసు పెద్దమ్మా యిది. వర్ధని కాసేపు ఆమెవంకే చూస్తూ నిల్చుంది."

ఇంతలో వర్ధనికి వుయ్యాల జ్ఞాపకం వచ్చింది. ఒక్క పరుగులో సరళా వాళ్ళిల్లు చేరుకొంది.

వాణి వుయ్యాల వూగుతోంది. పుస్తకాల సంచులు చెట్టు మొదట్లో పెట్టున్నాయి. వర్ధని నడుంమీద చేతులు పెట్టుకొని, వాణి వంక తీక్షణంగా చూసింది. వాణి గబు క్కున ఉయ్యాల దూకినట్లుగా దిగింది. "నువ్వెక్కుతావా?" వాణి అడిగింది. వర్ధని ఏం మాట్లాడకుండా ఉయ్యాల తాళ్ళు పట్టు కొని, ఉయ్యాల ఎక్కి కూర్చుంది.

"నన్నూపమంటావా?" వాణి మళ్ళీ అడి గింది.

ఊపక ఏం చేస్తావ్ అన్నట్లు చూసింది వర్ధని.

వాణి వుయ్యాలను వెనక్కు తీసి కెళ్ళి, ఒక్కసారిగా వదిలింది. పైకి, పైపైకి వెళ్ళింది వర్ధని వుయ్యాలతోపాటు, వళ్ళంతా హాయిగా, తేలిపోతున్నట్లుగా వుంది. ఇంటి కప్పులమీద పచ్చగా అల్లుకొని వున్న తీగలు, విచ్చుకున్న నవరత్నాల పూలు ఒక్క క్షణం వర్ధని దృష్టిలో నిలిచాయి. అంతలోనే దృష్టి దూరాన ఎదురుగా నిల్చున్న సరళ తలమీ దుగా నేలమీదికి పడింది.

ఒకటోసారి... రెండోసారి.. నాలుగో సారి...

వాణివేగంగా వూపుతోంది. వర్ధని సంతో షంగా వూగుతోంది.

ఈసారి వర్ధని ఇళ్ల కప్పులకవతల పొలాల్లోకి ఒదిగిపోతున్న నారింజ సూర్యుణ్ణి చూసింది. కళ్ళు బైర్లు కమ్మినట్లయ్యాయ్. అరచేతులు చెమట్లు పట్టాయి. దృష్టి నేల మీదే నిలిచింది.

"అక్కా... పడిపోతున్నావ్... తాళ్ళు గట్టిగా పట్టుకో!" వాణి బిగ్గరగా అరిచింది. సరళ భయంతో వాళ్ళింట్లోకి పరుగుతీసింది. వాణి బిత్తరపోయి అటూ ఇటూ చూస్తూ నిల్చుంది. చెరువు దగ్గర్నించి నీళ్ళు తెస్తున్న పెద్దమ్మాయి ఒక్కసారిగా చేతిలోని బిందెను వదిలేసింది.

"వారదమ్మాయి... చచ్చిపోయింది! వారదమ్మాయి... చచ్చిపోయింది?" బిగ్గరగా ఏడుస్తున్నట్లుగా అరుస్తూ చెరువువైపు పరుగెత్తింది పెద్దమ్మాయి.

చెరువుగట్టుమీద నడుస్తూ వస్తున్న వేణుకు ఢీకొనబోయి ఆగి, వేణును ఎగాదిగా చూసింది. తల పక్కకు వాల్చి కళ్ళు గిరగిరా తిప్పుతూ రహస్యం చెపుతున్నట్టుగా అంది.

"వారదమ్మాయి చచ్చిపోయిందిగా!"

★ ★ ★

"కురుపా! పలుగు కాస్త బలంగా పడనియ్యిరా! ఒరే దానం నువ్వా గుంజనిట్టా అందియ్యి!" కోటయ్య బిగ్గరగా అరిచాడు.

కోటయ్య పలుగు చేతిలోకి తీసుకొని, నేల పైకి బలంగా దించాడు. మట్టిని పెళ్ళగిస్తూ పలుగు పైకొచ్చింది.

"బీసిగా! అట్టా నడుంమీద చేతులెట్టుకు చూడకపోతే పారతో ఆ మట్టిని సలికలోకి ఎత్తి పారేయ్యకూడదంట్రా?"

బీసిగాడు తలగోక్కుంటూ పార తీసుకొచ్చాడు. కోటయ్య గుంటను తవ్వితే, దానం గుంజను పాతేశాడు. "కదలకుండా జాగ్రత్తగా పట్టుకో!" కోటయ్య దానంను హెచ్చరించాడు.

కోటయ్య గుంటలో గులకరాళ్ళు పోసి, పలుగు తిరగేసి నేర్పుగా రాళ్ళను గుంటలోకి దిగేశాడు. పందిరి గుంజ బలంగా, నిటారుగా నిల్చుంది.

"కురుపా, ఈ తాళ్ళందుకొని నువ్విటు పక్కనుంచి వాసాలు బిగించుకురా, నేనిటు కడతాను. బీసిగా నువ్వు కురప దగ్గరకెళ్ళు. దానం నువ్విటొచ్చి తాళ్ళందియ్యి"

చూస్తుండగానే పందిరికి దాని రూపం వచ్చేసింది. లయాత్మకంగా సాగుతోన్న పని, పనిలో వారి నిమగ్నత వర్ధనిని ఆకర్షించాయి. కుతూహలంగా వారినే గమనిస్తోంది. వర్ధని పురి నీడలో మంచం వేసుకొని, ఉయ్యాలమీద నుంచి పడినపుడు గీరుకుపోయిన మోకాళ్ళను దిండుమీదకు బారచాపుకుని కూర్చుని వుంది.

"ఇయ్యాల పెద్దింటికప్పు క్కూడా జమ్ము ఏద్దాం. పొద్దెక్కేలోపల అయిపోవాల. తొందర తొందరగా కానివ్వండిరా" కోటయ్య చకచకా వాసాలకు తాళ్ళు బిగిస్తూ అన్నాడు.

వర్ధని కోటయ్యను నిశితంగా పరిశీలించింది. కోటయ్య పంచను పైకి ఎగకట్టి, పైపంచను తలకు చుట్టుకొన్నాడు. కోటయ్య చొక్కాలేని వంటిమీద చెమట బిందువులలో సూర్యుడు ప్రతిఫలిస్తున్నాడు. మెరిసే అద్దంలాగా వున్న కోటయ్య వంటిని వర్ధని అబ్బురంగా చూసింది.

కోటయ్య గబగబ ఇంటిపైకి ఎగబాకాడు. కురుప ఇంకోపక్క నుంచి వచ్చాడు. దానం, బీసి ముందే కట్టలుగా కట్టివున్న జమ్మును పైకి విసిరేస్తున్నారు. పైనున్న వాళ్ళు జమ్ముకట్టల్ని ఒడుపుగా పట్టుకొని, తిరిగి అందించేలోపలే పైన పరిచేస్తున్నారు.

"ఏదీ నీ కాళ్ళు చూడనీ"

వర్ధని చికాగ్గా తలెత్తింది.

"ఇంత చిన్నదానికే అంత రాద్ధాంతం చేసావా? తనేదో తప్పు చేసినట్లు వాణి చూడు ఎలా బాధపడుతోందో! ఈ ఆయింట్‌మెంట్ రాస్తాను. తగ్గిపోతుంది. కాలు







సరిగ్గా పెట్టు" అంది లలిత.

వర్ధనికి అంతకు ముందోసారి లలిత ఇలాగే చెప్పి, దెబ్బమీద పెట్టిన టింక్చర్ జ్ఞాపకం వచ్చింది. దాని వాసనా, అది పుట్టించిన మంట కూడా దానితోపాటే మనసులో మెదిలాయి. వర్ధని తన భయం కనపడనివ్వకుండా బింకంగా అంది, "అక్కర్లా! పెద్దమ్మ పసుపు పెట్టింది. పెదనాన్న తూతూ మంత్రం వేశాడు!"

"నీ ఇష్టం!" లలిత ఆయింట్‌మెంట్ వర్ధని పక్కనే మంచంమీద పడేసి లోపలికి వెళ్ళింది.

జయమ్మ వర్ధనిని వళ్ళోకి తీసుకొని, మెల్లిగా మాటల్లో పెట్టి, నెమ్మదిగా దెబ్బమీద ఆయింట్‌మెంట్ రాసింది. మందు చల్లగా, హాయిగా వుండడంతో వర్ధని జయమ్మ చేతుల మహత్యానికి ఆశ్చర్యపడింది. పాలు పిండడంతో కాయలు కాసిన అరచేతుల్ని ఆప్యాయంగా, మృదువుగా తడిమింది. "పెద్దమ్మ ఎంతో మంచిది!" వర్ధని ప్రేమగా అనుకొంది.

వర్ధనికి హఠాత్తుగా ఏదో గుర్తొచ్చింది. కోటయ్యను కేకేసింది, "పెదనాన్నా... పిచ్చుగ్గూడును ఏం చేసావ్?"

కొబ్బరాకుల నడుమ కుదురుగా ఒదిగి

వున్న పిచ్చికగూడువైపు సైగచేసాడు కోటయ్య.

గూడులో కువకువలాడుతోన్న పిచ్చిక పిల్లల్ని చూసి వర్ధని నిండుగా నవ్వింది.

వికసించిన వర్ధని మొహం చూసి, కోటయ్య కూడా నవ్వాడు.

★ ★ ★

పందిట్లో కూర్చుని పేపర్ చదువుతున్నాడు ముకుందం. ఆ పక్కనే వాల్చిన మంచంమీద కూర్చుని, కోటయ్య నార చిక్కులు తీస్తున్నాడు. వర్ధని కోటయ్య పక్కనే వుంది.

వేణు వచ్చి గట్టుమీద చతికిలబడ్డాడు. జయమ్మ అందరికీ కాఫీ తెచ్చిచ్చి వెళ్ళింది.

"ఆ... అన్నట్లు మర్చేపోయాను. మురళిది ట్రైనింగ్ పూర్తయింది. వచ్చేవారం వస్తానన్నాడు. వాడు రాగానే ట్రాక్టర్ తెచ్చుకుందాం" ముకుందం వేణును చూస్తూ అన్నాడు.

వర్ధని కూడా కుతూహలంగా చూసింది.

మురళి ట్రాక్టర్ ట్రైనింగ్‌కి వెళ్ళి మూడునెలలపైనే అయింది.

"ఎన్నాళ్ళుగా అనుకొన్నాం! ఈ దుక్కికి వచ్చేస్తుందన్న మాట!" వేణు ఉత్సాహంగా అన్నాడు. అందరి మొహాలు విప్పారాయి.

"సరోజను ఎప్పుడు తీసుకురావాలన్నయ్యా?" ముకుంధం కోటయ్యను. అడిగాడు.

"పాపకి ఐదో నెల రావద్దూ...!" కోటయ్య వేళ్ళు ముడిచి లెక్కలేస్తూ అన్నాడు.

"వదినా" ముకుందం కేకేసాడు.

జయమ్మ వచ్చి గడప అవతల నిలబడి, ఏమిటన్నట్లుగా చూసింది.

"సరోజని, పాపని తీసుకురావాలిగా వదినా?"

"తీసుకురావాలి. రేపు పౌర్ణానికి పాపకి అయిదో నెల వచ్చుద్ది కూడాను!" అంది జయమ్మ.

"ఏరా వేణూ? అత్తగారింటికి నువ్వెళ్తావా?" ముకుందం వేణుని అడిగాడు. వేణు మౌనంగా వుండిపోయాడు.

"అసలు పిల్లపుట్టిందో పిల్లాడు పుట్టాడో ఆడికి తెలుసేమో అడుగబ్బాయ్" జయమ్మ ముసిముసిగా నవ్వుతూ అంది.

ముకుందం నవ్వుతూ వేణుని ఏవంటావ్ అన్నట్లు తలాడించాడు.

"ఆ...! ఆ విషయాలన్నీ పట్టించుకోను ఇక్కడెవ్వడూ పనిపాటల్లేకుండా కూర్చోలేదు!" వేణు బింకంగా అన్నాడు.

కందగడ్డలా వున్న వేణు మొహం చూసి వర్ధనికి ఎందుకో నవ్వొచ్చింది.

కోటయ్యను చూస్తూ కిసుక్కున నవ్వింది.

కోటయ్య కూడా తనలో తను నవ్వుకున్నాడు.

"సరే వదినా... సరోజని, పాపని అక్కడే వుండనిద్దాం! అంతేనా వేణూ?" ముకుందం నవ్వుతూ అన్నాడు.

"అంతేలే అబ్బాయ్" జయమ్మ నవ్వాపుకుంటూ అంది.

"వుండనివ్వండి... నాకేంటంట?" వేణు బింకం సడలనివ్వకుండా అన్నాడు.

"సర్లేరా బడాయి! అన్నయ్యా... మురళికి మన రంగయ్యగారి రెండో అమ్మాయిని చూస్తే ఎలా వుంటుంది?" ముకుందం కోటయ్యనుద్దేశించి అన్నాడు.

"పిల్లని ఎప్పుడో చిన్నప్పుడు చూసాం. ఇప్పుడెట్టా వుందో ఏవో?" జయమ్మ సందేహాన్ని వ్యక్తం చేసింది.

"అన్నయ్యా! మీరిద్దరూ వెళ్ళి ఆ అమ్మాయిని చూసి, సరోజని తీసుకురండి. మళ్ళీ తొలకరి మొదలయితే పనులు తెమలవు"

వర్ధనికి ముకుందం ఇలా నిర్ణయాలు ప్రకటిస్తూ మాట్లాడడం, మిగిలిన వాళ్ళు చెప్పింది చెప్పినట్లుగా అంగీకరించడం అస్సలు నచ్చలేదు. పెదనాన్నా, అన్నయ్యా ఈయన ఏం చెప్పినా అవునంటారెందుకు? ఈయనేమయినా పెదనాన్న చేసే పను





లన్నీ చేయగలడా? వెణన్నాయిలా పొలానికి వెళ్ళగలడా? ఎక్కడి కెళ్తాడో ఏమో కానీ అప్పుడప్పుడూ తను నిద్రలేచేసరికి ప్రత్యక్షమై వుంటాడు. ఎప్పుడూ నలగని తెల్లటి పంచా, లాల్చీ వేసుకొని, అందరి తరుపునా ఆయనే మాట్లాడుతూ వుంటాడు. అప్పుడప్పుడూ ఆళ్ళమీదా ఈళ్ళమీదా కేకలేస్తుంటాడు. తెల్లారకముందే లేచి, ఆయన బ్యాగులోంచి పుస్తకాలు తీసి బిగ్గరగా చదువుతూ వుంటాడు! ఇదేనా ఆయన చేసే పని! వర్ధని చిరాగ్గా అనుకొంది.

"అమ్మాయిని కూడా మాతో తీసుకెళ్తాం అబ్బాయి" జయమ్మ ముకుందాన్ని నెమ్మదిగా అడిగింది.

వర్ధనికి కోపం ముంచుకొచ్చింది. పెద్దమ్మ ఆయన్ని ఎందుకడగాలి? తీసుకెళితే తనే తీసుకెళ్ళచ్చుగా! వర్ధని విసుగ్గా అనుకొంది.

ముకుందం తలెత్తి వర్ధని వైపు చూశాడు. వర్ధని తల గిరుక్కున తిప్పుకొంది.

"ఇలారా!" ముకుందం వర్ధనిని పిలిచాడు.

"ఇందాక నన్నంటిరిగా! ఇప్పుడు చిన్నాన్నను చెప్పమనండి అమ్మాయి పేరేంటో!" వేణు అల్లరిగా నవ్వుతూ అన్నాడు.

వర్ధని ముకుందం ఏమని పిలుస్తాడోనని చెవులు రిక్కించింది. ముకుందం గుంభనంగా నవ్వాడు.

"మా తమ్ముడికి అంత మరుపు అనుకున్నావేమిట్రా? మా అమ్మ వర్ధనమ్మే కదరా అమ్మాయి!" కోటయ్య తమ్ముడికి వర్ధని పేరు సూచిస్తూ అన్నాడు.

"వర్ధనీ... ఇలారా!" ముకుందం నవ్వుతూ పిలిచాడు ఈసారి.

"మీ నాన్న పిలవట్లా... ఎళ్ళు!" కోటయ్య వర్ధనితో అన్నాడు. వర్ధని కోటయ్య వంక తిరిగి, తిరిగి చూస్తూ వచ్చి, పందిరి గుంజను ఆనుకొని నిల్చుంది.

"ఏం చదువుతున్నావ్?"

నాలుగో ఎక్కం అన్నట్లుగా నాలుగు వేళ్లెత్తి చూపించింది వర్ధని.

"నోటితో చెప్పు" జయమ్మ లోపల్నించి అంది. వర్ధని ఏం మాట్లాడలేదు.

"మీ పంతులుగారు ఎలా చెపుతున్నారు?" మళ్ళీ మౌనమే సమాధానమయింది.

"ఇలారా, నీకు ఏం వచ్చో నాకు చెప్పు. వింటాను" ముకుందం చేయిచాచి, దగ్గరకి పిలిచాడు.

"నాకన్నీ వచ్చు! నేను చెప్పను!" వర్ధని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పింది. గిరుక్కున వెనక్కు తిరిగి, బయటకు పరిగెత్తింది.

ముకుందం వర్ధని వెళ్లినవైపే చూస్తూ వుండిపోయాడు. ముకుందం భ్రుకుటి ముడిపడింది.

★ ★ ★

అమ్మలక్కల కబుర్లజోరుకు రోకటిపోట్లు నేపథ్యంలోకి వొదిగిపోయాయి. వంటింట్లో ఉండ్రాళ్ళు, పూర్ణాలు తయారవుతోన్న వాసన ఆవరణంతా వ్యాపించింది. వాణి కాసేపటికి ఓసారి రోడ్డుదాకా వెళ్ళి, తిరిగి లోపలకి వార్తలు మోసుకెళ్తోంది.

కురుప ఎలుగుబంటి వెంట్రుకల్ని తాడులా పేనుతున్నాడు. కురుప రోడ్డుకవతల వున్న తుమ్మచెట్టుకింద నాపరాయిమీద కూర్చొని వున్నాడు. ఊళ్ళోని జీతగాళ్ళు ఒక్కొక్కళ్ళే వచ్చి కురుపను వివరాలడిగి పోతున్నారు. కురుప వాళ్ళందర్నీ వూరిస్తూ విషయాన్ని నాన్చి నాన్చి చెపుతున్నాడు.

వర్ధని కోటయ్య వళ్ళో కూర్చొని, జరగబోయే తతంగం గూర్చి చర్చిస్తోంది. వర్ధని ఒక్కోటి చెయ్యెత్తున్న గిత్తల వంక దృష్టి సారించింది. తనకు వాటి మెళ్ళోని చిరుగంటల శబ్దం అంటే ఎంతో ఇష్టం. ఆరుబయట మంచం వేసుకు పడుకొని, ఆకాశంలో నక్షత్రాలకు ఆకారాల్ని ఊహించుకొంటూ, పెదనాన్న చెప్పే కథలకీ, కబుర్లకీ ఊకొడుతూ ఉండేటప్పుడు ఆ సన్నని

సవ్వడి ఎంత చక్కటి నేపథ్యమని! వాటి నుండి చూపు మరల్చి వర్ధని హఠాత్తుగా అడిగింది.

"అయితే పెదనాన్నా, ఇక మన గిత్తల్ని ఆదివారం సంతకి పంపేస్తారా?" కోటయ్య వర్ధని భుజాల్ని గట్టిగా పట్టుకొని, గిరుక్కున తనవైపుకు తిప్పుకొన్నాడు.

"ఎవరు? ఎవరన్నారామాట?"

కోటయ్య కంఠం కోపంతో వణుకుతోంది. మొహం జేవురించింది. కళ్ళు వెడల్పుగా అయ్యాయి. దవడకండరాలు బిగుసుకున్నాయి. వర్ధనికి భయంతో సమాధానం ఏం చెప్పాలో తోచలేదు.

'పెదనాన్నేంటి వింతగా ప్రవర్తిస్తున్నాడు. తనతో ఎప్పుడైనా ఇలా మాట్లాడేడా? ఇంతకీ తనేం తప్పు మాట్లాడిందని? ప్రతాదివారం సంతకి పశువుల్ని మందలు మందలుగా తోలుకెళుతుంటే, ఏంటది పెదనాన్నా అంటే పనికిరాని వాటిని సంతకి తోలేస్తారని తనేగా అన్నాడు. ఆయన చెప్పిందే తనంటే అంత కోపమొచ్చిందే?' వర్ధని మూతి ముడుచుకొంది. కోటయ్య వళ్ళోంచి లేచి, పక్కన నిల్చుంది.

కోటయ్య అదే వేగంతో అన్నాడు. "అయ్యొ, అయ్యో ఇన్నాళ్ళూ మన నోట్లోకి ఐదేళ్ళూ పోడానికి వొళ్ళు విరుచుకున్నాయి" కోటయ్య అరచేతులవంక చూస్తూ అన్నాడు.

"ఈరోజు ట్రాక్టరు కొని తెస్తున్నామంటే ఆ డబ్బెక్కడినుంచి వచ్చింది? ఆటి రక్తాన్ని చెమటగా కార్పించిన చోటినుంచి వచ్చింది! ఆటి వంటిమీద ఆడిన కొరడా చివర్లనుంచి వచ్చింది! ఆటి మెడమీద పడ్డ కాడి వత్తిళ్ళ నుండి వచ్చింది!"

వర్ధని బిత్తరపోయి చూస్తూ వుండిపోయింది. కోటయ్య ఉద్వేగంగా చెప్పుకుపోతున్నాడు.

"గోచీ పెట్టుకోవడం రానప్పుడే ముక్కుతాళ్ళు పట్టుకోవడం నేర్పాడు మానాన్న! ఆటికి మేత ఎయ్యందే నేను కూడు నోట్లో పెట్టను. మేం పస్తున్న రోజుల్లో కూడా ఆటి కడుపు ఎత్తు తగ్గనియ్యలా. అయ్యో నాకు బందువులు, స్నేయితులు, అన్నీ అయ్యో... అయ్యో... అయి లేకపోతే నా యవసాయమే లేదు... నేనే లేను"

కోటయ్య శాంతించి, మొహాన పట్టిన చెమట తుడుచుకొన్నాడు. వర్ధని పెదాలు తడిచేసుకొని, నెమ్మదిగా కోటయ్య భుజం మీద చెయ్యేసింది. కోటయ్య ఊపిరి గట్టిగా పీల్చి వదిలాడు. బొంగురుపోయిన గొంతుతో అన్నాడు.

"ఆదివారం సంతంటే ఏంటో తెలుసా? ఆటి రక్తం, మాంసం మాత్రమే కాదు చివరకు తోలు... తోలు కూడా అమ్ముకుతినే చోటు!"

వర్ధని మనసుకూడా అదోలా అయిపోయింది. కోటయ్య చెయ్యిని గట్టిగా పట్టుక్కూర్చుంది.

"గిట్లనేనా రెడ్డీ కట్టాల్సిందీ?" కురుప అల్లిన ఎలుగుబంటి వెంట్రుకల తాడుకు చిల్లిగవ్వలు గుచ్చితెచ్చి, అడిగాడు.

వర్ధని దాన్ని చేతిలోకి తీసుకొని, పరీక్షగా చూసింది. "అబ్బ! ఎంత చక్కగా అల్లారో!" వర్ధని అప్రయత్నంగా అంది.

కురుప సిగ్గుగా నవ్వి, తలగోక్కున్నాడు. కోటయ్య కూడా చూశాడు.

"అలాగే అల్లాల్సింది! ఆ చేత్తోనే ఆ చెట్టు మీది నిమ్మకాయలు కూడా కోసి దండగా గుచ్చండి!" పురమాయించాడు కోటయ్య.

తలెత్తి రోడ్డువైపు చూసిన వర్ధని సంబరంతో బిగ్గరగా అరిచింది, "అదుగో పెదనాన్నా, వేణన్నాయ్! మురళన్నాయ్!"

అందరు గబగబ రోడ్డుమీదికి ఎదురెళ్ళారు. ట్రాక్టరు వీరిదగ్గరకి రాగానే మురళి గబుక్కున కిందికి దిగాడు.

"నాన్నా, చూడు! నేనూ ట్రాక్టరు నడిపేస్తున్నాను!" వేణు స్టీరింగ్ ముందునించి






అరిచాడు.

"ఆగండాగండి! అప్పుడే దొడ్లోకి రామా కండి!" జయమ్మ గబగబ ఎర్రనీళ్ళు తీసుకొచ్చింది. వేణు ట్రాక్టరును నెమ్మదిగా తీసుకొచ్చి ఆపాడు. ఎర్రగా, నున్నగా మెరుస్తోన్న దాని దేహం అందరి దృష్టిని ఇట్టే ఆకర్షించింది. పెద్దపెద్ద టైర్లు, ట్రక్కు, ఇనుప నాగళ్ళు గొర్రు ఒకటేమిటి అన్నీ వింతలోకం నుంచి తేబడ్డ అద్భుత వస్తువుల్లా అగుపడ్డాయి.

వూరివాళ్ళు ట్రాక్టరు గురించి వినడమే కానీ చూడడం ఇదే మొదలు.

తమ కొత్త ట్రాక్టరుకు ఉంగ్రాళ్ళు పోస్తున్నామంటూ వాణి ఎక్కడెక్కడి వాళ్ళనూ కేకేసి వస్తోంది. ఇరుగుపొరుగులతో ఆవరణంతా నిండిపోయింది. చిన్నపిల్లలు కాసేపటికొకసారి వెళ్ళి ముట్టుకొని చూస్తున్నారు.

అమ్మలక్కలు పూజాసామాగ్రి, ఉంగ్రాళ్ళు, చిక్కగా అల్లిన పూలమాలలు తీసుకొచ్చారు. జయమ్మ మొదట ఎర్రనీళ్ళు ట్రాక్టరు చుట్టూ తిప్పి, వార పోసింది. లలిత అక్కడక్కడ పసుపు రాసి బొట్లు పెట్టింది. కోటయ్య వర్ధనిచేత పూజచేయించాడు. వర్ధని కొబ్బరికాయ చేతిలోకి తీసుకొని, అందరివైపు ఠీవీగా చూసింది. కోటయ్య

చెప్పినట్లుగా కొబ్బరికాయను పగలగొట్టి, నీటిని ధారగా ట్రాక్టరు ముందు పోసింది. కోటయ్య వర్ధనిని దోసిట్లోకి ఉండ్రాళ్ళు తీసి కొని కొన్ని ట్రాక్టరు ముందు పోసి, కొన్నిం టిని ట్రాక్టరుపైకి విసరమన్నాడు. వర్ధని చెప్పినట్లుగానే చేసింది. వర్ధని తల కాస్త పైకెత్తి, కను చివరలనుండి అందరినీ ఠీవీగా, గంభీరంగా చూసింది.

"నేనూ అలాగే చెయ్యనా? " వాణి ఆశగా కోటయ్యవైపు చూస్తూ అడిగింది.

"నువ్వు మళ్ళీ చేద్దువులే! వర్ధనమ్మా నువ్వు ట్రాక్టరుకు ఎదురురా!" కోటయ్య వర్ధ నిని ముందుకు పంపుతూ అన్నాడు. వాణి అప్పటికే లలిత దగ్గరకెళ్ళి నిలబడింది. మురళి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు.

కురప పరుగెత్తుకుంటూ వచ్చి, చిల్లిగ వ్వల తాడును ట్రాక్టరు ముందున్న చువ్వకి కట్టాడు. టైర్లకింద నిమ్మకాయలు పెట్టాడు. వర్ధని ఎదురుగా నడిచొచ్చింది. మురళి ఒక్కసారిగా ట్రాక్టరును ముందుకు దూకించాడు. నిమ్మకాయల మీదుగా బండి నడిచింది. అందరి కేరింతల్లో ఆవరణ పుల కరించింది. అందరూ బండిని చుట్టుము ట్టారు. మురళిని సందేహాలతో ముంచెత్తుతు న్నారు.

కోటయ్య మౌనంగా గిత్తలవైపు నడి చాడు. వర్ధని కోటయ్యను అనుసరించింది. అప్పటికే వేణు వాటిదగ్గర నిల్చుని వున్నాడు. గిత్తల మెడమీద నిమురుతూ వేణు ఆప్యాయంగా అంటున్నాడు, "ఇన్నాళ్ళూ అలుపెరగకుండా, మా శ్రమలో భాగం పంచుకొన్నారు. మీకింక వత్తిడిమీద పనిచేయాల్సిన అవసరంలేదు. నవతరం సృష్టించిన ఈ యంత్రాలకి మీ బాధ్యతలు అప్పచెప్పండి. ధీమాగా, హాయిగా బత కండి"

కోటయ్య తృప్తిగా నిట్టూర్చాడు. వర్ధని కోటయ్యను చూసి చిరునవ్వు నవ్వింది.

ఆ నవ్వుతో ఆకాశంలోని మేఘాలకు, మేఘాలలోని వర్షధారలకు, మేఘాల చాటునున్న ఇంద్రధనస్సులకు ఆహ్వానం అందినట్లుంది.

సన్నని జల్లుతో తొలకరి ప్రారంభమైంది.

★ ★ ★

"నా పావు పండింది" వాణి సంతోషంగా అరిచింది.

"అయితే ఏంలే. ఇప్పుడు నాకుగానీ రెండు పడిందా... నీ ఆటకట్టు!" సరళ వాణి మాటల్ని తేలిగ్గా తీసిపారేస్తూ, గవ్వలు విసిరింది.

"వ్వె...వ్వె... గుడ్డి పడింది" వాణి వెక్కి రిస్తూ సంబరంగా అంది.

"నీవి ఇంకా రెండు పావులు వున్నా యిగా. చూద్దాంలే" సరళ బింకంగా అంది. ఇద్దరూ పట్టుదలతో గవ్వలు విసురుతు న్నారు.

వర్ధని నిశ్శబ్దంగా మునివేళ్ళమీద నడి చొచ్చి వాళ్ళ వెనకే నిల్చుంది. చటుక్కున వంగి పచ్చీసుపావుల్నీ, గవ్వల్నీ దొరకబు చ్చుకుని ఒక్క పరుగుతీసింది.

"వర్ధనీ... వర్ధనీ... ఇచ్చేయవా! ఈ ఆట నేనే గెలుస్తా... వర్ధనీ... వర్ధనీ" సరళ వర్ధ నిని బతిమిలాడుతూ తనవెనకే పరిగె త్తింది.

వర్ధని బొటనవేలు ఆడిస్తూ, పకపక నవ్వుతూ ఆవరణంతా పరుగులు పెట్టింది. ఇంకో పక్కనుంచి వాణి బతిమిలాడుతూ వెంబడించింది.

"మా అక్క మంచిది కదా. ఇచ్చేయవా? ఆ సరళ ఎట్లాగో ఓడిపోతుంది. అక్కా.... అక్కా..."

వర్ధని ఇద్దర్నీ నేర్పుగా తప్పించుకొంటూ చెరువు దగ్గరకి పరిగెత్తింది. సరళ, వాణి అదే వేగంతో వర్ధనిని వెంబడించారు. సరిగ్గా అప్పుడే పెద్దమ్మాయి బిందె తీసుకొని చెరువు దగ్గరకి వచ్చింది.

"ఇవిగో... అందుకోండి!" అంటూ వర్ధని




వారివైపు చేయిచాచి, పగలబడి నవ్వుతూ వెనక్కి వెనక్కి పరిగెత్తింది.

సరళ, వాణి పావులవైపే దృష్టి నిలిపి శక్తికొద్దీ పరిగెత్తారు. వర్ధని వారిని దగ్గరకి రానిచ్చి వాటిని గబుక్కున పెద్దమ్మాయి బిందెలో వదిలేసింది. ఇద్దరూ టక్కున ఆగిపోయి ఒకరి మొహాలు ఒకరు చూసుకొన్నారు. వీళ్ళిద్దరికే కాదు ఊళ్లో పిల్లలందరికీ పెద్దమ్మాయి అంటే చచ్చేంత భయం. వర్ధని ఒకర్తే పెద్దమ్మాయి దగ్గరకి వెళ్ళి చనువుగా మాట్లాడుతుంది.

పెద్దమ్మాయికి విషయం తెలియకపోయినా వర్ధనిని చూడగానే బిందెను కాళ్ళ దగ్గర పెట్టుకొని సంబరంగా చప్పట్లు కొట్టింది. వర్ధని పెద్దమ్మాయితో నవ్వుతూ ఏదో మాట్లాడి, వాణి వాళ్ళవైపు తిరిగింది.

"మీ పావులు, గవ్వలు నా దగ్గర లేవు బాబూ.... ఎలా తీసుకొంటారో మీ ఇష్టం" వర్ధని వస్తోన్న నవ్వును బిగబెట్టి, చేతులు రెండూ గాల్లోకి ఎత్తేసింది.

పెద్దమ్మాయి వారందరినీ విచిత్రంగా చూసింది. పెద్దగా నవ్వి, తలను రెండు చేతుల్తో బరబరా గోక్కుంది.

ఇద్దరి అడుగులు అంగుళం ముందుకు కూడా సాగలేదు.

మాంత్రికుడి పంచప్రాణాలు అక్కడెక్కడో ఏడు సముద్రాల అవతలి దీవిలో మర్రిచెట్టు తొర్రలో పంజరంలోని చిలుకలో వున్నట్టుగా పెద్దమ్మాయి పంచప్రాణాలు ఈ సొట్టలు పడ్డ బిందెలోనే వుంటాయనే విషయం వూరివారందరికీ తెలుసు. తెలిసి తెలిసి అంత సాహసం చేయడమే! సరళ, వాణి భయంతో గుటకలు మింగారు. కానీ చూస్తూ చూస్తూ పచ్చీసు పావుల్ని ఎలా వదులుకోవడం? ఇద్దరూ సందిగ్ధంలో పడ్డారు. పెద్దక్కాయి చెరువులో నీళ్ళ ముంచుకోబోతూ పావుల్ని చెరువులో గుమ్మరించేయదుకదా? ఇద్దరూ వర్ధని వంక దీనంగా చూశారు. వాళ్ళ ధోరణికి వర్ధని పొట్టచెక్కలయ్యేట్టు నవ్వింది.

"సరే... సరే! మీ పావులు మీకు ఇచ్చేస్తాను. మరి నేను చెప్పినట్లుగా చేస్తారా?" వర్ధని ఓ షరతు విధించింది.

మరింకేం ఆలోచించకుండా ఇద్దరూ ముక్తకంఠంతో అన్నారు- "అలాగే!"

"ఊ... అలా దారికి రండి!" వర్ధని ఠీవీగా నడుంమీద చేతులు పెట్టుకొని, కనుబొమలు ఎత్తింది

వర్ధని గిరుక్కున పెద్దమ్మాయివైపు తిరిగి గట్టిగా అంది, "పెద్దక్కాయ్... పెద్దక్కాయ్... అదుగో అటు చూడు!"

పెద్దమ్మాయితో పాటు సరళ, వాణి కూడా అక్కడ ఏం వుందోనని కుతూహలంగా చూశారు. అంతే! వర్ధని చటుక్కున బిందెలోంచి పావుల్ని తీసి, పెద్దమ్మాయి గమనించేలోపలే అక్కణ్ణించి దూరంగా పరుగుతీసింది. ఆ వెనకే వాణీ... సరళా!

వర్ధని వాళ్ళిద్దర్నీ తిన్నగా చావిడి దగ్గరకు తీసుకెళ్ళింది. కోటయ్య ఎక్కడో పనిచేసుకుంటున్నట్టుగా వున్నాడు. కోటయ్య నైపంచ మంచంమీదే వుంది. వర్ధని బుర్రలో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది. ఇద్దర్నీ దగ్గరకి పిలిచింది. పచ్చీసుపావులింకా వర్ధని దగ్గరే వున్నాయి.

"మీరిద్దరూ ఈ నైపంచను తలమీదుగా కప్పుకోవాలి. అట్లా... ఆ చావిడి వెనక నుంచి నెమ్మదిగా నక్కినక్కి రావాలి! అంటే... మీరేమో దొంగలు... నేనేమో రాజునన్నమాట!" వర్ధని వాళ్ళిద్దకీ ఆటాడే విధానం వివరిస్తోంది.

"దొంగల్ని పట్టుకోను రాజు వస్తాడా ఎక్కడైనా?" సరళ పెదవి విరిచింది.

"రాజభటుడు వస్తాడు!" వాణి బిగ్గరగా అంది.

"ఏయ్! ఆ విషయం నాకూ తెలుసు! ఇందాక నేనేం చెప్పాను? నేను చెప్పినట్లు మీరు వినాలనలా?" వర్ధని గద్దించింది. కాసేపాగి మళ్ళీ అంది, "సరే మీ ఇష్టం! మీ పావులు పెద్దక్కాయిని అడిగి తీసుకోండి!"

వర్ధని అక్కణ్ణించి వేగంగా కదలబోయింది.

"అబ్బెబ్బే... వుత్తుత్తినే అన్నాం! ఆ... వుత్తుత్తినే!" ఇద్దరూ ఒక్కసారి అరిచారు.

"సరే అయితే" వర్ధని రీవీగా తలాడించింది. "ఇదుగో అలా నక్కినక్కి వచ్చి తిన్నగా మొచ్చు దగ్గరకి వెళ్ళాలి. పైపంచ మాత్రం తలమీదనుంచి తీయనే తీయకూడదు! తెలిసిందా? ఊ... ఇక పదండి! పదండి" వర్ధని హడావుడి చేసింది. సరళ, వాణి బుద్ధిగా పైపంచను తీసుకొని చావిడి వెనక్కు వెళ్ళారు. వాళ్ళనటుపోనిచ్చి వర్ధని నేరుగా జయమ్మ దగ్గరకి పరుగుతీసింది.

జయమ్మ చేటలో బియ్యం పోసుకొని చెరుగుతోంది. వర్ధని జయమ్మని చేయిపట్టి లాగి, పైకి లేవదీసింది.

"అబ్బబ్బ వుండవే..." అంటోన్న జయమ్మను మాట్లాడనీయకుండా రెండు చేతులతో లాగుతూ బయటకు రమ్మని హడావుడి చేసింది. జయమ్మ చేటలో బియ్యాన్ని బియ్యం డబ్బాలో పోసేదాకా కూడా నిలవనీయలేదు. ఎట్లాగో ఆ బియ్యాన్ని డబ్బాలో గుమ్మరించి, చేట చేతిలో పట్టుకొనే వర్ధని తోపాటు బయటకు నడిచింది జయమ్మ.

వర్ధని జయమ్మను చావడివైపు తీసుకెళుతూ రహస్యం చెపుతున్నట్లుగా అంది. "పెద్దమ్మా... మన చావిట్లో మొచ్చుమీది కోడిగుడ్లు మొచ్చుమీదే మాయమవుతున్నాయని అన్నావ్‌గా! అవి ఎవరు తీస్తున్నారో నేను చూపిస్తా... రా!"

జయమ్మ ఆశ్చర్యపోతూ వర్ధనితోపాటే గబగబ వెళ్ళింది.

చావిడి దగ్గరకు రాగానే వర్ధని తన పెదవులకి చూపుడువేలు ఆన్చి "ఉష్!" అంటూ జయమ్మని శబ్దం చేయవద్దని హెచ్చరించింది. జయమ్మ నెమ్మదిగా వర్ధని అడుగులో అడుగువేస్తూ చావిట్లోకి వచ్చింది.

వర్ధని అక్కడే ఆగమన్నట్లు సైగ చేసింది.

సరిగ్గా అప్పుడే వాణి, సరళ తలవంచుకొని, పైపంచను నిండా కప్పుకొని చావిడి వెనకనుంచి నక్కినక్కి చావిట్లోకి వచ్చారు. చావిట్లోని కట్టుగొయ్యలను జాగ్రత్తగా తప్పించుకొంటూ మొచ్చువైపు నడుస్తున్నారు.

జయమ్మ పళ్లు పటపట కొరుకుతూ, కొంగు దులిపి నడుంచుట్టు బిగించింది. చేతిలో చేటను సరిగ్గా పట్టుకొని, వాళ్ళ వెనకే మెత్తగా నడిచింది.

వాళ్ళిద్దరూ సరిగ్గా మొచ్చు కిందికి రాగానే చేటను తిరగేసి దబదబ వాయించేసింది.

అదీ ఆటలోని అంశమే అనుకున్నారో ఏమో సరళ, వాణి కిక్కురుమనలేదు.

వర్ధని వున్నచోటే గెంతుతూ, చప్పట్లు కొడుతూ, విరగబడి నవ్వింది.

"చావండి! దొంగపీనుగుల్లారా!" జయమ్మ కొడుతూనే అంది.

జయమ్మ గొంతు వినగానే సరళ, వాణి పైపంచను మొహాల మీదనుంచి తీశారు. జయమ్మ వాళ్లనాస్థితిలో చూసేసరికి నివ్వెరపోయింది.

వాళ్ళిద్దరూ జయమ్మ మొహంలోకి అయోమయంగా చూశారు.

"అరే... అదేంటే! మీరిద్దరూనా! అయినా మీకిదేం పొయ్యేకాలమే? కోడిగుడ్డు అట్టు వేసియ్యమంటే నేను వేసియ్యనా? అయినా అట్టా నోరు మూసుకొని దెబ్బలు తినకపోతే... మేమే పెద్దమ్మా అని చెప్పెడవ్వచ్చుగా!" జయమ్మ బాధ, పశ్చాత్తాపం మిళితమైన కంఠంతో అంది.

చేతిలోని చేటను పక్కకు విసిరేసింది.

సరళ, వాణి తెల్లబోయి, వర్ధని వంక చూశారు.

వర్ధని పెదవులు బిగపెట్టి వున్నా అల్లరి నవ్వు కళ్ళల్లోంచి తొంగిచూస్తోంది. వాళ్ళ మొహాలు చూడగానే జయమ్మకు ఒక్కసారిగా విషయమంతా అర్థమైంది.

"అసలు నీకు మీ పెదనాన్న గారాం ఎక్కువయిందే! వుండు... అక్కడే వుండు





రోజురోజుకీ మరీ గడుగ్గాయిలా తయారవుతున్నావ్! పూటకొకళ్లని ఆటలు పట్టిస్తావ్! నీ చిలిపిపనులతో ఇంటిమీదికి తెస్తావ్ ఎప్పుడో! వుండు... నీ పని చెపుతా" అంటూ జయమ్మ కింద పడేసిన చేటను అందుకొని వర్ధనివైపు వేగంగా వచ్చింది.

"మా పెద్దమ్మ మంచిదంట! నన్నేం చేయదంట!" వర్ధని నవ్వుతూ జయమ్మకు దొరకకుండా ఆవరణంతా పరుగులు పెట్టింది.

జయమ్మ వర్ధనిని పట్టుకోలేక రొప్పుతూ రోజుతూ వచ్చి గట్టుమీద కూలబడింది.

"వర్ధనమ్మా... నా చిట్టితల్లివికదూ... రావే! పరమాణ్ణం చేశాను తినైనా వెళుదువు!" జయమ్మ ఆయాసం అణుచుకొంటూ నీరసంగా అంది.

"వర్ధనమ్మేవన్నా తెలివితక్కువదనుకున్నావా? నీ దగ్గరకి వచ్చి మరీ చెవి మెలి పెట్టించుకోను" కోటయ్య ముసిముసి నవ్వులు నవ్వాడు.

సరిగ్గా అప్పుడే గుమ్మంలోకి వచ్చిన లలిత నొసలు చిట్లించింది.

★ ★ ★

వర్ధని కారప్పూస నములుతూ, సీమచింత చెట్టులో కొత్తగా కనిపిస్తున్న తేనెతుట్టెను, దాని చుట్టూ జుయ్‌మంటోన్న తేనెటీగల్ని ఆశ్చర్యంగా గమనిస్తోంది.

ఇంతలో ఈతాకులదడి అవతలనుండి- సరళ వాణిని కేకేయడం వినిపించింది.

వాణి లోపల ఏం చేస్తోందో ఏమో చప్పున బయటకి రాలేదు.

వర్ధని తేనెపట్టునుండి చూపు మరల్చి ఇంట్లోకి దృష్టి సారించింది. వాణి కనబడ లేదు.

దడి దగ్గరకి వెళ్ళి ఈతాకుల తడికను లోపలికి లాగింది వర్ధని.

సరళ లోపలికి రాకుండానే చెప్పింది, "వర్ధనీ... ఇవ్వాళ బడిలేదు. వాణికి కూడా చెప్పు" వర్ధనికి ఎంతో ప్రియమైన వార్త ఇది. సంతోషాన్ని అణుచుకొంటూ ఆశ్చర్యంగా అడిగింది,

"ఎందుకని? "

"పంతులాళ్లింటికి చుట్టాలొచ్చారుగా! అందుకు!" సరళ కళ్లు గిరగిరా తిప్పుతూ అంది.

"చుట్టాలంటే...? "

"ఏమో మరి! వాళ్ళల్లో ఒకావిడ భలే తమాషా చేస్తుందిలే! ఎప్పుడూ చేతిలో ఓ చెంబునిండా నీళ్లు పట్టుకు తిరుగుతుంది. ఆ నీళ్ళలోకి వేళ్లు ముంచి గాల్లోకి చల్లుతూ, ఏదో గొణుగుతూ వుంటుంది. నువ్వూ చూసి రాకూడదూ? " సరళ గలగలమంటూ అంది.

వర్ధని ఏమీ మాట్లాడలేదు.

"ఏమో బాబూ... నీ ఇష్టం. వాణితో కూడా చెప్పు. నేవెళ్తున్నా" సరళ వాళ్ళింటి వైపు వెళ్లింది.

వర్ధని ఈతాకు తడికను సరిగ్గా లాగి, పురికొస బిగించింది. కారప్పూస నములుతూ చావిడిదాకా వెళ్ళింది. అప్పటికే పశువులు మేతకు వెళ్ళాయి. కోటయ్య చావిడి శుభ్రం చేస్తున్నాడు. వర్ధని చావిడి చూరు కింద వాల్చివున్న నులకమంచంమీద చతికిలబడింది.

ఇంతలో సరళ వచ్చింది. వర్ధని చప్పున లేచి- సరళతోపాటు పంతులింటికి పరుగు తీసింది.

పంతులమ్మ లోపల వున్నట్లుంది. పంతులు అసలక్కడ లేనేలేడు.

పంతులు కుటుంబాన్ని పక్కవూరినుంచి వేణునే పిలుచుకువచ్చాడు. పిల్లలకి నాలుగు అక్షరం ముక్కలు నేర్పి బతకమని, ఇల్లు కూడా ఇచ్చింది వేణుయే. ఊళ్లో పిల్లలు అల్లరి చిల్లరిగా తిరక్కుండా కుదురుగా కూర్చోబెట్టినా చాలన్నాడు.

పంతులు కుటుంబం అంటే వర్ధనికి మొదటినుండీ ఆసక్తే. వాళ్ళ అలవాట్లు,

పద్ధతులు వేరుగా వుంటాయి. పెదనాన్నలా గొడ్డుగోదా అనుకోరు. పోనీ వేణన్నాయిలా పొలమూపుత్రా అనుకోరు. ఏదో ఈ పూటకి అయిదువేళ్లూ నోట్లోకి పోతే చాలదూ అన్నట్లు వుంటుంది వ్యవహారం.

పంతులమ్మ పిల్లలకి ఏదో ఒకటి తెమ్మని పురమాయిస్తుంది. వర్ధనికి ఆవిడ పద్ధతి నచ్చదు. వాణి మారుమాట్లాడకుండా ఆవిడ చెప్పినట్లు చేస్తుంది.

వర్ధని గడపలో నిలబడి లోపలకి చూసింది. సరళ పక్కనే నిల్చుంది. లోపల ఎవరో పెద్దావిడ పీటమీద కూర్చుని అన్నం కంచం ముందుపెట్టుకొని వుంది.

ఆవిడేనా? అన్నట్లు కళ్లతో సైగ చేసింది వర్ధని.

ఔనన్నట్లుగా సరళ తలాడించింది. ఇద్దరూ మౌనంగా, కుతూహలంగా ఆవిడ వంకే చూస్తూ నిల్చున్నారు.

ఆమె పళ్లెం పక్కనున్న రాగిచెంబు లోంచి అరచేతిలోకి కొన్ని నీళ్లు వంపుకొంది తల వెనక్కువంచి, కళ్లు మూసుకొని, ఏదో గొణిగినట్లుగా పెదవులాడించింది.

నేచెప్పలా అన్నట్లు సరళ కనుబొమలెగరే సింది.

ఆవిడ తల కిందికి వంచి, కళ్ళు తెరి చింది. అరచేతిలోని నీటిని పళ్ళెం చుట్టూ తిప్పి, పళ్ళెం పక్కనే ధారగా వదిలింది.

ఆ తరువాత ఎన్నాళ్ళగానో ఆకలిగొన్నదా నిలా పళ్ళెంలోని పదార్థాలన్నింటినీ, పెద్ద పెద్ద ముద్దలుగా చేసి, ఎత్తి గొంతులో వేసు కుంటోంది. ఆ వేగానికి పొలమారింది. ఎడంచేత్తో చెంబులోని నీళ్ళు గొంతులో పోసుకుంటూనే, నోట్లో ముద్ద కుక్కుకుం టోంది.

ఆవిడ ధోరణికి వర్ధనికి నవ్వాగలేదు. సర ళని చూస్తూ కిసుక్కున నవ్వింది.

"ఎవర్రా అది? " ఆమె చివ్వున వారివైపు చూసి గర్జించింది. ఆవిడ గొంతువిని పంతులమ్మ లోపలినుంచి వచ్చింది.

"ఇవ్వాళ బడిలేదు కదండీ!" సరళ ఏమీ తెలీనట్లు వినయంగా అడిగింది. పెద్దావిడ గొణుగుతూ పళ్ళెం పక్కనేవున్న రాగిచెంబు లోని నీటిని గబుక్కున పళ్ళెంలో గుమ్మ రించి, దిగ్గున లేచి నిల్చుంది.

వర్ధని మనస్సు చివుక్కుమంది. తినేతినే అన్నంలో నీళ్ల పోసిందేం ఈవిడ?

"అప్రాచ్య పీనుగుల్లారా! కంచంలో కూడు పెట్టుకున్నానో లేదో శనిలా దాపురించారు. పిల్లపిశాచుల్లారా! పోండి! బడీలేదు! గిడీ లేదు!" పెద్దావిడ నోరంతా తెరిచి వికృ తంగా అరిచింది.

ఈ ఊహించని పిడుగుపాటుకు ఇద్దరూ బిత్తరపోయారు. ముందుగా వర్ధనీయే తేరు కుంది. పంతులమ్మవైపు చూసింది. దాదాపు ఆవిడ మొహంలో కూడా అదే భావం కదలాడుతోంది. వర్ధని గొంతు పెగ ల్చుకొని నెమ్మదిగా అంది,

"మేం వెళ్తున్నాం. మీరు భోంచేయండి"

"ఇక తిన్నట్లే నా పిండాకూడు" పెద్దావిడ విసురుగా అంది.

ఇంట్లో కూడా చిన్నమాట పడి ఎరగని వర్ధనికి ఆవిడ విసురుకి కోపం ముంచుకొ చ్చింది. పంతులమ్మ వంక చూసింది. పంతులమ్మ ఏమీ మాట్లాడకుండా బెల్లం కొట్టినరాయిలా నిల్చుంది. ఆమెను తీక్ష ణంగా చూస్తూ వర్ధని ఏదో అనబోయేలో పల, సరళ వర్ధని చేయి పట్టుకొని గబగబ బయటకు లాక్కొచ్చింది.

★ ★ ★

పొద్దు గూకకముందే... జయమ్మ వర్ధనికి వళ్లంతా మీగడ పట్టించి, సున్నిపిండితో స్నానం చేయించింది. నూనె రాసిన జుట్టును నున్నగా దువ్వి, రెండు జడలే సింది. దొడ్లో పూసిన నాలుగు దొంతర మల్లెల్ని... మరువంతో, కనకాంబరాలతో కలిపి కట్టి, జడలో తురిమింది.




# ఏరిన ముత్యాలు

☆ విప్లవానికి, నేరానికి జన్మనిచ్చేది దారిద్ర్యమే

-అరిస్టాటిల్

☆ రోజూ చూస్తూన్న పొరుగువాడినే ప్రేమించలేని నీవు, ఎప్పుడూ కనిపించని ఆ దేవుణ్ణి మాత్రం ఎలా ప్రేమించగలవు.

-జీసస్

☆ గెలుపు లక్ష తప్పులను కప్పుతుంది.

-జార్జి బెర్నార్డ్‌షా

☆ జన్మనుబట్టి ఏ మానవుడు బ్రాహ్మణుడుగాని, చండాలుడుగాని కాజాలడు. గుణములను, పనినిబట్టియే కుల వ్యవస్థ ఏర్పడుతుంది.

-మహావీరుడు

☆ మన నూతన నిర్మాణాలే మన తీర్థప్రదేశాలు

-నెహ్రూ

☆ సహనం వహించడం చేదైన అనుభవమే కాని, దాని ఫలితాలు మాత్రం తియ్యగా వుంటాయి.

-రూసో

☆ ఓర్పుని మించిన గొప్ప ప్రార్థన మరొకటి లేదు

-బుద్ధుడు

☆ మనం కులీన వంశస్తులమని గర్వపడరాదు. మన రక్తం, సామాన్యులనబడే వారి రక్తం మార్కెట్‌కు పంపితే మన రక్తం ఆధిక్యత ఏమిటో తెలుస్తుంది.

-థామస్ ఫుల్లర్

☆ నేరం చేసిన వాడిని శిక్షించడమే ప్రధానం కాదు. నేరం చేయటానికి ఏ పరిస్థితులు పురికొల్పుతున్నాయో వాటిని తొలిగించడం ముఖ్యం.

-యం.యన్.రాయ్

☆ శాస్త్రీయ దృక్పధం లేని మతం గుడ్డిది

-ఐన్‌స్టీన్

☆ కోటీశ్వరులు, పెట్టుబడిదారులు లేకుండా దేశం మనగలుగుతుంది. కాని, శ్రామికులు లేకుండా మనలేదు

-గాంధీజీ

☆ హృదయాంతర్గత సంగీతం బాహ్య సంగీతం కన్నా ఎంతో మధురమైనది.

-జాన్‌రస్కిన్

**సేకరణ: ఆముదాల అజయ్‌బాబు**

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల వర్ధని

.....................................................

**సమీక్షకుని పేరు :** .....................................................

**చిరునామా :** .....................................................

.....................................................

.....................................................

.....................................................

వేడివేడి అన్నంలోకి పప్పుచారు, నెయ్యి వేసి కలిపి, వర్ధనికి కబుర్లు చెపుతూ తినిపిస్తోంది. వర్ధని మంచం మధ్యలో కూర్చుంది. జయమ్మ చిన్ననాటి సంగతులు అడిగి అడిగి చెప్పించుకుంటోంది.

లలిత మసిపట్టిన బుడ్లు, లాంతర్ల గ్లాసులపై వేలితో ముగ్గు రాసి, ఆ తరువాత బట్టతో శుభ్రం చేస్తోంది.

వాణి వెలిగించిన లాంతర్లను ఒక్కోటి భద్రంగా తీసుకెళ్లి... ఒక్కో గడప దగ్గర పెట్టివస్తోంది.

ఇంతలో దడి దగ్గరనుంచి ఎవరో పిలిచినట్లుయి, లలిత లేచి ఆవైపు వెళ్లింది.

జయమ్మ, వర్ధని కుతూహలంగా చూశారు.

"లలితక్కాయ్! ఓ చుక్క మజ్జిగవుంటే ఇస్తావూ? "

ఆ కంఠం పంతులమ్మగి.

వర్ధనికి ముద్ద మింగుడు పడలేదు. మధ్యాహ్నం తనకు జరిగిన అవమానం గుర్తుకు వచ్చింది.

"దాందేవుందీ! గిన్నె తెస్తే ఇటియ్యి" లలిత అంటోంది.

వర్ధనికి చురచురమనింది. లలితమీద ఎక్కడ్లేని కోపం వచ్చింది.

పంతులమ్మ లోపలికి వచ్చి లలితకు గిన్నె అందించింది. లలిత మజ్జిగ తేవడానికి లోపలికి వెళ్లింది. అప్పుడే పెరుగన్నం కలుపుకురాను. లోపలికి వెళ్లిన జయమ్మ, పళ్లెంతో బయటకు వచ్చింది. పంతులమ్మని చూసి జయమ్మ ఆరా తీసింది.

"ఏవమ్మా... పంతులమ్మా... మా వర్ధనమ్మ ఎట్టా చదూతోంది? "

"మీ అమ్మాయికేవమ్మా.... ఫస్టుగా చదూతోంది" పంతులమ్మ నవ్వుతూ వారి దగ్గరకు వచ్చింది.

పంతులమ్మ తమ ముందుకు రాగానే వర్ధని గబుక్కున మంచం దిగింది. నీళ్ళచెంబును అందుకుని అమాంతం అన్నం పళ్ళెంలో గుమ్మరించింది.

"అదేంటే అమ్మాయ్...? " జయమ్మ ఆశ్చర్యంగా అడిగింది. "నేనన్నం తింటుంటే ఆవిడ చూసిందిగా అందుకని" వర్ధని పంతులమ్మని వేలెత్తి చూపించింది.

"చూస్తే ఏమైందే? " జయమ్మ దీర్ఘం తీసింది.

"మరి నేను చూశానని వాళ్ళ చుట్టమావిడ పళ్ళెంలో నీళ్ళెందుకు గుమ్మరించింది? నేనూ అందుకే గుమ్మరించా" వర్ధని తలెగరేసి పెంకిగా సమాధానమిచ్చింది.

"ఏంటే మరీ పెద్దంతరం, చిన్నంతరం లేకుండా వాగుతున్నావ్? పెద్దవాళ్ళతో పోటీయా నీకు? " కోపంగా అంది... అప్పుడే మజ్జిగ గిన్నె తీసుకొచ్చిన లలిత.

"పెద్దాళ్ళయితే... ఏమయినా చేయొచ్చేం? " వర్ధని తగ్గకుండా ఎదురు ప్రశ్నించింది.

"అదంతా నీకనవసరం"

"అయితే, మన మజ్జిగ కావాలేం? " వర్ధని మొండిగా అరిచింది.

పంతులమ్మ మజ్జిగ గిన్నె తీసుకొని, ఎప్పుడో చల్లగా జారుకుంది.

లలితకి వర్ధనిమీద కోపం ముంచుకు వచ్చింది. గట్టిగా అరిచింది. "రోజురోజుకీ పొగరుమోతులా తయారవుతున్నావ్! నోటికి ఎంతొస్తే అంత వాగేయడమే! నాలుగు అంటిస్తే కానీ దారికి రావు"

అప్పుడే జయమ్మ పళ్ళెంలోని అన్నాన్ని కుడితిగాబులో పోసివచ్చింది.

"ఏంటమ్మాయ్ లలితా! చిన్నపిల్లేదో మాట్లాడితే నువ్వు అంతలేసి మాటలు అంటున్నావ్? "

"అది కాదక్కాయ్..." లలిత కోపం దిగమింగుకుంది.

"సరిసర్లే... పిల్లచూసిందే అనుకో! అంత మాత్రానికే ఆ మహాతల్లి అట్టా చెయ్యాలా?

నేనెక్కడా ఇన్లేదమ్మా ఇట్టాంటి ఇద్దూరం! అయినా మా బంగారుతల్లి చూపు పడితేనే అదృష్టం కాదూ...?" జయమ్మ వర్ధనిని మెటికలు విరిచి, ముద్దు పెట్టుకుంది.

వర్ధని గారాలుపోతూ జయమ్మను వాటేసుకుంది. లలితవైపు కనుబొమలెత్తి ధీమాగా చూసింది. ఉదయంనుంచి మండిపడుతోన్న వర్ధని అప్పుడు శాంతించింది.

లలిత కోపంగా గొణుక్కుంటూ, విసవిసా లోపలికి వెళ్లింది.

జయమ్మ మళ్ళీ పెరుగన్నం కలుపుకు వచ్చింది.

వర్ధని ఉత్సాహంగా కబుర్లు చెబుతూ భోంచేసింది.

జయమ్మకు, కోటయ్యకు మధ్యగా వున్న మంచంలో పడుకుంది.

ఇద్దరితో కబుర్లాడుతూ, ఆకాశంలో నక్షత్రాలు లెక్కిస్తూ ఎప్పటికో నిద్రపోయింది.

★ ★ ★

వర్ధని నిద్రలేచేసరికి బాగా పొద్దెక్కిపోయింది.

వర్ధని పడుకున్న మంచం తప్ప అన్నీ తీసేసివున్నాయి.

వర్ధని గబుక్కున మంచందిగి, జయమ్మని పిలుస్తూ ఇంట్లోకి పరుగుతీసింది.

జయమ్మ రోటి దగ్గర వుంది. బీసీ, మాణిక్యం రోకలి పోటేస్తుంటే, జయమ్మ చేత్తో పిండిని అటూ ఇటూ నెడుతోంది.

'పెద్దమ్మా... జాగ్రత్త! రోకలి నీ చేతిమీద పడేనూ..." వర్ధని కంగారుగా అరిచింది.

"అరవమాకే... నీ అరుపులకే నా చెయ్యి నలిగేట్టుంది" జయమ్మ నవ్వుతూ అంది.

మాణిక్యం కిసుక్కున నవ్వింది.

"పెద్దమ్మా... నువ్వు అప్పచ్చులు చేస్తున్నావ్ కదూ? నాకు తెలిసిపోయిందిలే!" వర్ధని తలాడిస్తూ అంది.

"ముందుపోయి మొహం కడుక్కురా. తరువాత అప్పచ్చుల సంగతి! ఇదుగో మొన్న మురళన్నాయి కర్నూలునుంచి తెచ్చాడే కొత్తపల్లపోడి... దాన్ని బియ్యపు డబ్బా ఎనకమాల పెట్టాను. గభాల్న వెళ్ళి తెచ్చుకో పో!"

వర్ధని గబగబ వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది.

"ఏం అప్పచ్చులు చేస్తావ్... పెద్దమ్మా?' ' వర్ధని ఆరా తీసింది.

"నీకేం కావాలో చెప్పు. అవే చేస్తాను" వర్ధని వంక మురిపెంగా చూస్తూ అంది జయమ్మ.

జయమ్మ పిండిని రోట్లోంచి తీసి, పెద్ద పళ్ళెంలో పోసి జల్లిస్తోంది.

" వెన్నుండలు సున్నుండలు, అరిసెలు, బూరెలు... ఊ... ఇంకా... ఆ! కారప్పూస''

వర్ధని ముడిచిన వేళ్ళని ఒక్కోటి తెరుస్తూ చెపుతోంది.

మాణిక్యం మళ్ళీ నవ్వింది- వర్ధని ధోరణికి.

"చూడు పెద్దమ్మా... ఆ మాణిక్యం ఎలా నవ్వుతోందో" వర్ధని ఫిర్యాదు చేసినట్లుగా అంది.

"ఏంటే అదీ...? ముందెళ్ళి ఆ బియ్యం ఇలా తీసుకురా" జయమ్మ మాణిక్యంని మందలించి, ఆరపోసిన బియ్యాన్ని చూపించింది.

మాణిక్యం నవ్వుతూనే అక్కడికి వెళ్ళింది.

వర్ధని మాణిక్యంని వెక్కిరించి, చావడి వైపు పరుగుతీసింది.

కోటయ్య ఎద్దుల్ని శుభ్రం చేస్తున్నాడు.

"ఏంటి పెదనాన్నా, వీటికి పొద్దుటే స్నానం చేయిస్తున్నావ్?" వర్ధని ఆశ్చర్యంగా అడిగింది. కోటయ్య మాట్లాడకుండా చావిడి చూరువైపు చూపించాడు. అక్కడున్న వెదురుబొంగుకి రంగురంగుల తాళ్లతో గంటలు కలిపి పేనిన దండల్లాంటివి వేలాడుతున్నాయి.

వర్ధని ఒక్కపరుగున వాటి దగ్గరకి వెళ్ళింది. "ఏంటియ్యి పెదనాన్నా?"




"మన ఎద్దులమెళ్లో కట్టడానికి! అయిగో... ఆ కుచ్చులేమో వాటి కొమ్ము లకి!"

"అబ్బ! ఎంత బావున్నాయో" వర్ధని వాటి వంక ముచ్చటగా చూస్తూ అంది.

"ఇంక మన ఎడ్లు సవారి ఎడ్లు. మన టైరుబండికి కట్టామా... చూసుకో ఇక! ఏ వూర్రికైనా, ఏ చేన్కుకైనా రాజుల్లా ఇట్టే పోవచ్చు" ఉత్సాహంగా చెప్పాడు కోటయ్య.

"నేను కూడా ఎక్కొచ్చా?"

"ఓ...!"

"పెదనాన్నా... పెదనాన్నా... వాటి మెళ్ళో గంటలు నేనే కడతా.... పెదనాన్నా" వర్ధని కోటయ్యను బతిమిలాడింది.

"బాగా పాలుతాగి, పెరుగుతిని వీటంత ఎత్తు అవు. అలాగే కడుదువు" కోటయ్య ఎద్దు మూపురం కడుగుతూ, నవ్వుతూ అన్నాడు.

"అమ్మో, అంత ఎత్తే!" వర్ధని కళ్లు పెద్దవి చేసి అంది. కాసేపాగి మళ్ళీ అంది. "పెద నాన్నా అప్పచ్చులు కూడా తింటే అంతెత్తు అవుతానా?"

"ముందీపాలు తాగవే!" జయమ్మ పాల గ్లాసు తెచ్చిచ్చి అంది. వర్ధని గబగబ పాలు తాగి, ముంజేతికి మూతి తుడుచుకొంది. కాళ్ళ మునివేళ్ళమీద నిలబడి, కోటయ్యకేసి చూస్తూ గట్టిగా అరిచింది.

"ఇదుగో పెదనాన్నా... పాలుతాగగానే చూడు నేను ఎంత ఎత్తు అయిపోయానో"

జయమ్మ ముక్కు ఎగబీల్చి కోటయ్యతో అంది, "రేపుణ్ణించీ ఇది ఎట్టా వుండుద్దో? ఏం చేసుద్దో?"

"ఎట్లా వుంటానూ? ఇట్లాగే వుంటాను. ఇలాగే చేస్తాను" వర్ధని జయమ్మవైపు ఆశ్చ ర్యంగా చూస్తూ అంది.

కోటయ్య కాళ్లు, చేతులు కడుక్కొని, పైపంచతో మొహం తుడుచుకొంటున్నాడు. వర్ధని మాటలు వినగానే, గబగబ వచ్చి వర్ధనిని గబుక్కున ఎత్తుకున్నాడు.

"ఇదుగో అమ్మా... నువ్వామాటమీదే వుండు. ఎక్కడున్నా, ఎప్పుడైనా నువ్వు వర్ధ నమ్మవి! వర్ధనమ్మలాగానే వుండాలి. తెలి సిందా?" ఆవేశంగా అంటున్న కోటయ్య మొహంలోకి వర్ధని అయోమయంగా చూసింది.

"ఆళ్లూ ఈళ్లూ ఒసేయ్ గిసేయ్ అన్నా రంటే ఊరుకోమాక!" జయమ్మ చేతులు తిప్పుతూ అంది.

"ఎవరితో గొడవ పెట్టుకోమాకు! అయిం దానికి, కానిదానికి మనసు కష్టపెట్టుకో మాకు" కోటయ్య చెపుతూవుంటే వర్ధని అడ్డొస్తూ అంది, "ఇయ్యన్నీ ఎందుకు చెపు తున్నావ్, పెదనాన్నా?"

జయమ్మ గబుక్కున వెనక్కు తిరిగి, కొంగుతో కళ్లొత్తుకొంటూ, ఏదో గొణు క్కుంటూ వంటింటివైపు వెళ్లింది.

కోటయ్య కాసేపు ఏమీ మాట్లాడలేదు. వర్ధని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది. కోటయ్య తడుముకొన్నట్లుగా అన్నాడు, "సరేగానీ, ఇందాక ఏం చెప్పానో చెప్పు!"

"నేను వర్ధనమ్మని! వర్ధనమ్మ లాగానే వుంటాను!" వర్ధని తలెగరేస్తూ అంది "ఎప్ప టికీ!"

కోటయ్య వర్ధనిని ముద్దాడాడు. వర్ధని ఆశ్చర్యపోతూ కోటయ్య మొహంలో కదలా డుతోన్న భావాల్ని అంచనా వేయడానికి ప్రయత్నించసాగింది.

★ ★ ★

జయమ్మ, కోటయ్య వింతగా ప్రవర్తించ డానికి కారణమేమిటో వర్ధనికి ఆ మర్నాడు కానీ అర్థమవలేదు. తనకు ఆపద అంద మైన కారు రూపంలో వస్తుందని వర్ధని ఊహించలేదు.

ఆ రోజు పది గంటలప్పుడు ఎప్పుడూ బస్సులో వచ్చే ముకుందం కారులో వచ్చాడు. వాణి ఆ కారులోకి ఎక్కి దానిసీ ట్లను, హారన్‌ను, స్టీరింగ్‌ను పరీక్షించి

వచ్చింది. వాణి వాటి గొప్పతనాన్ని అదేప నిగా ఊదరకొట్టేస్తుంటే, వర్ధని తనూ చూద్దామని లోపలికి ఎక్కింది.

చాన్నాళ్లక్రితం తనెక్కిన బస్సు సీట్లకన్నా, తన ప్రియమైన ట్రాక్టరు సీటుకన్నా ఈ సీట్లు చాలా బావున్నాయి. కారులోని చిన్న అద్దం, దాన్ని పట్టుకుని వేళ్లాడుతోన్న చిన్న కోతిబొమ్మ వర్ధనికి ఎంతో నచ్చాయి. చాలా సేపు ఆ బొమ్మను అటూఇటూ ఊగిస్తూ, హారన్ కొడుతూ గడిపింది.

వాణి కారెక్కి రోడ్డుమీద వెళుతుంటే ఎంతో బావుంటుందని ఊరించి ఊరించి చెబుతోంది. అంతకుముందెప్పుడో ముకుందం వాణినీ, లలితనీ కారులో తీసుకొని వెళ్లాడట. అదీ వాణి బడాయి!

వర్ధనికి తనూ కారులో ప్రయాణం చేయాలన్న కోరిక వాణిమీద కోపంలా మొదలయ్యి, దృఢ నిశ్చయంగా మారింది.

మధ్యాహ్నం భోజనం కూడా జయమ్మ దగ్గర మారాం చేసి కారులోనే తింది. వెనుక సీట్లోనే పడుకొని నిద్రపోతే ఎవరో తీసుకొచ్చి యింట్లో పడుకోబెట్టారు.

వర్ధనికి మెలుకువ రాగానే ఒక్క ఉదుటున లేచి కారు దగ్గరకి పరిగెత్తింది.

కారు డిక్కీ తెరిచి సామాన్లు సర్దుతున్నారు. వాణి కొత్త గౌను వేసుకొని అటూ ఇటూ హడావుడిగా తిరుగుతోంది. జయమ్మ వంటింట్లో పచ్చళ్లు, పప్పులు, పిండివంటలు సర్దుతోంది. వర్ధనికి పెదనాన్న ఎక్కడ వున్నాడో కనిపించలేదు.

వీళ్లంతా కారులో ఎక్కడికో బయలుదేరుతున్నారన్నది వర్ధనికి అర్థమయింది. చప్పున వెళ్లి వెనకసీటుకీ, ముందు సీటుకీ మధ్యనున్న ఖాళీ స్థలంలో ముడుచుకొని కూర్చుంది.

"వర్ధనమ్మా! వర్ధనీ!" అంటూ జయమ్మ, వేణు పిలుస్తూ అటూఇటూ తిరగడం వర్ధనికి తెలుస్తూనే వుంది. కదలకుండా అలాగే కూర్చుంది. వర్ధనికి తెలియకుండానే నిద్రపట్టేసింది.

కాసేపటి తరువాత ఒక్కసారిగా కుదిపినట్లయ్యి, వర్ధని గబుక్కున లేచి కూర్చుంది. కారు తమ ఇంటిముందున్న వేపచెట్టు కింద ఆగిలేదు. కదులుతూ వుంది.

లలిత, వాణి వెనుకసీట్లోనే కూర్చుని వున్నారు. వాణి దర్జాగా కూర్చోని, కిటికీలోంచి వెనక్కి పోతోన్న స్తంభాల్ని లెక్కపెడుతోంది. ముకుందం ముందు సీట్లో కూర్చుని వున్నాడు. వర్ధని గబుక్కున అద్దం లోంచి వెనక్కి చూసింది.

దూరంగా జయమ్మ, కోటయ్య, వేణు, మురళి కనిపించారు. అందరూ కారువంకే చూస్తూ, చేతులు ఊపుతూ వున్నారు. వర్ధనికి హఠాత్తుగా మనసుకు ఏదో తట్టింది. గబుక్కున మోకాళ్ల మీదలేచి, కిటికీలోంచి చేతులు వెనక్కు చాచి, "పెదనాన్నా... పెద్దమ్మా" అంటూ కేకలు పెట్టింది.

లలిత, ముకుందం ఒక్కసారిగా ఆజ్ఞాపించినట్లుగా అన్నారు, "సరిగ్గా కూర్చో! చేతులు లోపలికి పెట్టు!"

వర్ధని వాళ్ల మాటలను ఏమాత్రం పట్టించుకోకుండా, కిటికీలోంచి నడుంవరకు బయటకు పెట్టి, గట్టిగా ఏడుస్తూ వారిని పిలుస్తూనే వుంది.

లలిత బలవంతంగా లాగి లోపల కూర్చోబెట్టపోయింది. వర్ధని అంతకన్నా బలంగా లలితను విదిలించుకొని, కిటికీలోంచి బయటకు చూస్తూ, హృదయవిదారకంగా అరవసాగింది.

దూరాన చేతులు ఊపుతున్న ఆకారాలు క్రమంగా చిన్నవయ్యి, ఒక్కసారిగా మాయమయ్యాయి. వర్ధనికి తన శరీరంలోంచి ప్రాణాలు తోడేసినట్లయింది. గుండెలు పగిలేలా ఏడుస్తోంది. గొంతు నాళాలు తెగేలా వాళ్లను పిలుస్తూనే వుంది.

లలిత వర్ధనిని బలంగా వెనక్కు లాగి, వీపున రెండంటించింది. కిటికీ అద్దం పైకి




వేసేసింది.

ఎన్నడూ తనను ఎవరూ గట్టిగా గదిమి ఎరగని వర్ధని వంటిమీద దెబ్బపడడంతో బిత్తరపోయింది. లలిత కోపంగా గద్దిస్తూ ఏదో అంటూన్నా వర్ధని చెవికెక్కలేదు.

ఒంటరితనం, ఉక్రోషం, కోపం, భయం, అవమానం అన్నీ ఒక్కసారిగా వర్ధనిమీద విరుచుకుపడ్డాయి. నిస్సహాయంగా సీటు మూలకు ఒదిగి వెక్కివెక్కి ఏడుస్తూ కూర్చుంది.

తనను వీళ్లతో ఎక్కడికి తీసుకెళుతున్నారు? పెదనాన్న, పెద్దమ్మ ఎందుకు రావట్లేదు? తన్నొక్క దాన్నే ఎందుకు పంపారు? ఈ దరిద్రపు కారుని ఒక్కసారంటే ఒక్కసారి ఆపితే బావుణ్ణు. పెదనాన్న దగ్గరకి ఒక్క పరుగున వెళ్లచ్చు వర్ధని ఆలోచిస్తూనే ఆశగా అందరి వంకా చూసింది.

మొట్టమొదటిసారిగా ఏదో తెలీని పిరికితనం వర్ధనిని ఆవహించింది. వర్ధని తనలో తాను ముడుచుకొని, కుమిలికుమిలి ఏడవ సాగింది. ఏడుస్తూనే లలిత గదమాయింపుకు, ముకుందం సముదాయింపుకు ఒకేలాగా తీవ్రంగా ప్రతిఘటించింది. వాణివైపు కన్నెత్తైనా చూడలేదు.

ఇంకో సందర్భంలోనైతే వర్ధని ఈ కారు ప్రయాణాన్ని, కారు దాటుతోన్న ప్రదేశాల్ని, పక్కన సాగిపోతోన్న రమ్యమైన దృశ్యాల్ని ఎంతటి మధురమైన జ్ఞాపకాలుగా మలచుకొనేదో!



వర్ధనికి కొత్త ఊరు నచ్చిందో నచ్చలేదో తనకే అర్థం కాలేదు.

వీళ్లు వుంటోన్న యిల్లు ఊరికి చివరగా వున్న కాలనీలో వుంది. యింటికి కొంచెం ముందుకు పోతే విశాలమైన మైదానం, దానినానుకొని వున్న చిన్న రైసుమిల్లు. ఆ పక్కనే రైల్వేట్రాకు. యింటికి వెనకవైపుగా చిన్న గుట్టల వరుస. వాటిమీద గువ్వలా ఒదిగిన యిళ్లు. అన్నింటిలో ఎత్తైన గుట్టమీద చిన్న ఆంజనేయస్వామి గుడి.

అప్పుడప్పుడే వర్షాలు పడుతుండడంతో గుట్టలన్నీ పచ్చని రంగుతో ఎంతో శ్రద్ధగా మలిచిన వర్ణచిత్రంలాగున్నాయి. మైదానం చిన్నచిన్న తుప్పలతో, గడ్డిలో కాలిబాట తప్ప మిగిలినదంతా పచ్చని తివాచీ పరిచినట్లుంది.

వర్ధని వీటన్నిటినీ కారు దిగిన కాసేపటికే తిరిగి పెదనాన్న దగ్గరికి వెళ్లాలన్న ప్రయత్నంలో లలితను తప్పించుకొని పరిగెత్తుకొచ్చినపుడు గమనించింది. ఆ తరువాత వర్ధనికి అంత స్వేచ్ఛగా ఏనాడూ బయటకి వచ్చే అవకాశం పెద్దవాళ్లు యివ్వలేదు.

వాణి, లలిత హడావుడిగా యిల్లు సర్దుతోంటే తనూ సాయం చేస్తోంది.

వర్ధని ముందు గదిలోనే ఒకమూల ముడుచుకు కూర్చుంది. వర్ధనికి తన పనులేవీ తను చేసుకోవడం చేతకాదు. లలితను దగ్గరకు రానివ్వలేదు. ఏడ్చిఏడ్చి కళ్లు వుబ్బిపోయాయి. ముక్కు, చెంపలు ఎర్రబడిపోయాయి. జుట్టు చిందరవందరగా మొహం మీదపడుతోంది. ఆ మూలే ఏడుస్తూనే ఎప్పుడో నిద్రపోయింది.

ముకుందం ఇంటికి వచ్చేసరికి ఇంటికి యిల్లు రూపం వచ్చేసింది. లలిత స్టవ్ వెలిగించి, ఊరినుంచి తెచ్చుకొన్న పాలను పొంగించి, వంట కూడా మొదలుపెట్టేసింది.

ముకుందం ముందు గదిలో వర్ధనిని

చూసి అక్కడే ఆగిపోయాడు. లలిత వర్ధని పారిపోవాలని ఎలా ప్రయత్నించిందో వర్ణించి చెప్పింది. తను లోపల పనిలో వున్నపుడు వర్ధని రివ్వున దూసుకుపోతుంటే పక్కింటి కుర్రాడు ఎంత వేగంగా వెంబ డించి యింటికి తిరిగి తీసుకువచ్చిందీ, ఆవి ధంగా పక్కింటివారితో పరిచయం ఎలా అయ్యిందీ కూడా చెప్పింది.

ముకుందం మౌనంగా వింటూ వుండిపో యాడు. వర్ధనిని మెల్లిగా ఎత్తుకొని మంచం మీద పడుకోబెట్టాడు.

వర్ధని నిద్రలో కూడా వెక్కుతూనే వుంది. ముకుందానికి వర్ధని మొహంలో అభద్రతా భావం కొట్టొచ్చినట్లు కనబడుతోంది. మౌనంగా వెళ్ళి దుప్పటి తెచ్చి వర్ధనికి కప్పాడు. లలిత గుమ్మానికి ఆనుకొని, ముకుందం వంకే దీక్షగా చూస్తోంది.

★ ★ ★

ఆ రోజు కొత్తబడిలో చేరాల్సి వుంటుం దని వర్ధనికి ముకుందం ముందురోజు సాయంత్రమే చెప్పాడు.

వర్ధని రాత్రంతా ఆలోచించి ఓ నిర్ణయా నికి వచ్చింది. బడిలో చేరకపోతే తను తిరిగి పెదనాన్న దగ్గరకు వెళ్ళిపోవచ్చుకదా! ఏ విధంగానైనా బడిలో చేరకుండా వుండ డానికి ప్రయత్నించాలి.

వర్ధని అప్పుడప్పుడూ తమ ఊర్లో బడి ఎగ్గొట్టడానికి వేసే పథకమే ఇప్పుడూ వేసింది. దుప్పటిని గట్టిగా ముసుగుపెట్టు కొని, మూలుగుతూ పడుకొంది.

లలిత వాణిని తయారు చేస్తూనే, వర్ధని దగ్గరకి వచ్చింది. వర్ధని కప్పుకున్న దుప్ప టిని గభాల్న లాగేసింది. వర్ధని రెక్కపట్టి, పైకిలేపి కూర్చోబెట్టింది. ఊహించని ఈ ప్రవర్తనకు వర్ధని బిత్తరపోయింది. మొహం కడుక్కోవడానికి, స్నానం చేయడానికి తన శాయశక్తులా ప్రతిఘటించింది.

లలిత ఏకధాటిగా నోరూ చెయ్యీ ఆడిస్తూ ఎలాగోలా వర్ధనిని సిద్ధం చేసింది. వాణికి ప్లేటులో ఇడ్లీలు పెట్టిచ్చి, వర్ధనికి కూడా తీసుకొచ్చింది.

లలిత వచ్చే లోపల వర్ధని చక్కగా దువ్విన జడలకున్న రిబ్బన్లని పీకేసి, జుట్టును చిందరవందర చేసుకొంది. లలిత ప్లేటు అందించగానే చేత్తో విసిరికొట్టింది. కొబ్బరి పచ్చడంతా లలిత మొహాన పడింది. ఇడ్లీలు నేలమీద చెల్లాచెదురుగా పడ్డాయి.

లలితకు విపరీతమైన కోపం వచ్చింది. కోపంతో బిగుసుకుపోయిన లలిత మొహం చూడగానే వర్ధనికి భయం వేసింది. కాళ్లను నేలమీద తపాతపా కొడుతూ, బిగ్గరగా ఏడ వడం మొదలెట్టింది "పెద్దమ్మా... పెద నాన్నా" అంటూ.

లలితకు సహనం చచ్చిపోయింది. ఒక్క సారిగా అరిచింది. "ఏంటే ఆ ఏడుపు? ఏదో చిన్నపిల్లవి కదా అని ఊరుకొంటుంటే మరీ సాగిస్తున్నావ్! ఎవరు అడ్డొస్తారో చూస్తానుండు" లలిత వర్ధని చేతులు గట్టిగా పట్టుకుని, ఆ చెంపా ఈ చెంపా వాయించేసింది.

వర్ధని బుగ్గలమీద వాతలు తేలాయి. ఏడుపు దిగమింగి, కళ్లు పెద్దవి చేసి లలి తను చూస్తూ వుండిపోయింది.

వాణి బిక్కుబిక్కుమంటూ ఇడ్లీలు నోట్లో కుక్కుకుంది. వాణి కింద బోర్లాపడిన ప్లేటును సరిచేసి, వర్ధని విసిరేసిన ఇడ్లీలని గబగబ దాంట్లోకి ఎత్తింది.

లలిత వర్ధని రెక్క పట్టుకు లాగుతూ, వాణిని చూపిస్తూ గట్టిగా అంది.

"చూడవే! దాన్ని చూడు! నీకన్నా చిన్నది! దాన్ని చూసైనా నేర్చుకు చావచ్చుగా! నన్నెం దుకిట్లా వేయించుకు తింటున్నావ్?"

వర్ధనికి మౌనమే సమాధానమైంది.

లలిత మీద పడిన పచ్చడిని శుభ్రం చేసు కోవడానికి లోపలికివెళ్లింది. వాణి సర్దిన ప్లేటును వంటింట్లోకి తీసుకెళ్లింది.





వర్ధనికి తనున్నచోటు శూన్యంలా మారి పోయినట్లనిపించింది. దూరాన ఎక్కడో వున్న పెదనాన్న తనను వళ్లోకి తీసుకొని ఊరడిస్తున్నట్లుగా తోచింది. పెద్దమ్మ చీర కొంగుతో తన బుగ్గలమీది కన్నీటిని అద్దిన ట్లుగా అనిపించింది. అంతలోనే ఆ అంద మైన అనుభూతి మాయమైంది.

లలిత వర్ధని రెక్క పుచ్చుకొని బాత్‌రూం లోకి బరబరా లాక్కెళ్లి సబ్బుతో మొహం కడిగింది. మరోసారి జడలువేసి, బట్టలు మార్చి తయారు చేసింది. కానీ వర్ధని నోరు తెరిపించి, ఓ చిన్న ఇడ్లీముక్క అయినా పెట్టలేకపోయింది. చూపుడు వేలు ఊపుతూ బెదిరించి, వర్ధనిని ఓ కుర్చీలో కూలేసింది.

వర్ధనికి పెద్దమ్మకీ, పెదనాన్నకీ తన మీదున్న అభిమానం మీద అనుమానం వేసింది మొదటిసారి! నిజంగా వాళ్లకి తనీ కష్టాలన్నీ పడాలని తెలీదూ? తనకి ఇష్టం లేనివాళ్లతో ఎలా వుండమని పంపించారు? ఇంక తను ఎప్పటికీ ఈ వాణీతో, ఈ లలి తతో, ఈ ముకుందంతో వుండిపోవాల్సిం దేనా? కొండంత దిగులు వర్ధనిని నీరసప రిచింది. ఉన్నచోటే కదలకుండా కూర్చుండి పోయింది.

ముకుందం బయటనుంచి రాగానే లలిత, వాణి అతనిని గబగబ లోపలికి తీసుకెళ్లి గుసగుసలాడడం వర్ధనికి వినిపిస్తూనే వుంది. అది తన గురించే! వాళ్లంతా ఒకే జట్టు! తనొక్కతే వేరు! వర్ధని మనసంతా అసంతృప్తితో నిండిపోయింది.

తన ప్రమేయం లేకుండానే వాళ్లతో కలిసి రిక్షాలో బయలుదేరింది.

లలిత ముకుందం చేయి తట్టింది. చూశారా... దెబ్బకు దయ్యం వదులు తుందన్నట్లు వర్ధని ఎలా దార్లోకి వచ్చిందో... అన్నట్లు కళ్లతో సైగ చేసింది.

ముకుందం గంభీరంగా వుండిపోయాడు. ఇంతలో వారి గమ్యం రానే వచ్చింది.

వాణి లలిత చేయిపట్టుకొని గబగబ ముందుకు నడిచింది.

వర్ధని రెండడుగులు వేసి మౌనంగా నిలు చుండిపోయింది.

అప్పటికే బడిలోవున్న అమ్మాయిలు ముదురాకుపచ్చ, తెలుపు దుస్తులలో ముచ్చ టగా అటుఇటు తిరుగుతున్నారు. అబ్బా యిలు కూడా అవే రంగుల లాగుచొక్కాలు వేసుకొన్నారు. వాళ్ల మెరిసే బూట్లు, టైలు వర్ధనిని ఆకర్షించాయి. ఎవరో ఇద్దరు అమ్మాయిలు గలగల మాట్లాడుకొంటూ వీరి ముందు నుండి వెళ్లారు. భుజాలదాకా కత్తి రించిన జుట్టు, తళతళలాడుతోన్న కళ్లు వర్ధ నికి నచ్చాయి. వర్ధని వారు వెళ్లినవైపే చూస్తూ వుండిపోయింది.

ముకుందం రిక్షావాడిని పంపేసి, వర్ధనిని లోపలకి తీసుకెళ్లాడు.

లలిత, వాణి ఓ గదిముందు నిలబడి, వీళ్లకోసం ఎదురు చూస్తున్నారు.

ముకుందం లోనికి దారితీశాడు. ఆ వెనకే లలితావాళ్లు.

లోపల కుర్చీలో కూర్చున్నావిడ ముకుం దాన్ని చూడగానే లేచి నిల్చుని లోనికి ఆహ్వానించింది. కూర్చోమన్నట్లు కుర్చీలు చూపించింది. ముకుందం ఆవిడ ముందే తెలిసినట్లు మాట్లాడుతున్నాడు. వర్ధని ఒక సారి ఆవిడని పరిశీలనగా చూసింది.

ఆవిడలో ఏదో ప్రత్యేకత ఉంది. ఠీవీగా, ధీమాగావుంది. ఆవిడ నెమ్మదిగా తలా డిస్తూ మాట్లాడుతూ వుంటే ఆవిడ చెవుల కున్న చిన్నచిన్న పోగులు తమాషాగా మెరు స్తున్నాయి.

వర్ధని కళ్లు వాల్చుకొని ఓ పక్కగా నిలబ డింది.

ఆవిడ వాణిని ఏదో ప్రశ్నలేసింది. వాణి టకటక సమాధానాలు చెప్పి కొన్నిటికి తెలీ

దని చెప్పేసింది. వర్ధనికి తను చెప్పేద్దామా అన్నంత ఉత్సాహం వచ్చింది.

మెల్లిగా కళ్లెత్తి ఆవిడవంక చూసింది వర్ధని. ఆవిడ మృదువుగా నవ్వింది. వర్ధని గబుక్కున కళ్లు వాల్చేసింది.

ఆవిడ నవ్వు వర్ధనికి ఎంతోనచ్చింది. అలాగే ఆవిడ పేరు కూడా. అలాంటి పేరు వర్ధని ఇంతకు మునుపెన్నడూ విని వుండ లేదు. ఎంత తమాషాగా... హుందాగా వుందా పేరు! ఆవిడలాగే! మేడం మేడం! వర్ధని మనసులోనే మళ్లీమళ్లీ ఉచ్చరించు కొంది.

మేడం అలానే నవ్వుతూ వర్ధనిని కూడా కొన్ని ప్రశ్నలు వేసింది.

వర్ధని నిలువుగుడ్లేసుకొని చూస్తూ వుండి పోయింది. లలిత జవాబు చెప్పమన్నట్లు సైగ చేసింది. వాణిని అడుగుతున్నపుడు సమాధానాలిద్దామన్న సరదా ఇప్పుడేం అయిందో కానీ పెదవి కదలలేదు.

ఆవిడ మళ్లీమళ్లీ రెట్టించి అవే ప్రశ్నలడి గింది. లలిత వర్ధనిని కళ్లురిమి చూసింది.

వర్ధని మాట్లాడలేదు. ఆవిడ ఇంకోసారి ప్రయత్నించి, ముకుందంతో ఇద్దరినీ ఒకే తరగతిలో చేర్చుకొంటానంది.

"వర్ధని వాణికన్నా సంవత్సరన్నర పెద్దది. అందులో తనే బాగా చురుకు. ఇప్పుడేదో బెరుకుగా వుందిగానీ లేకపోతే చాలా బాగా సమాధానాలిస్తుంది. తనని రెండో తరగతిలో చేరిస్తేనే బావుంటుం దనీ..." లలిత కాస్త నెమ్మదిగా కాస్త గట్టిగా అంది. లలిత మాట్లాడుతూనే ముకుందా నికి సైగ చేసింది మీరూ చెప్పండన్నట్లు.

"వర్ధనక్కకి అన్నీ బాగా వచ్చండి. ఒకటో తరగతి పుస్తకం, పెద్దబాలశిక్ష, ఎక్కాలు.. అన్నీ! మా పంతులుగారు మమ్మల్ని వర్ధని లాగా చదవరేం అని కోప్పడేవారు ఎప్పుడూ. అక్షరాలు కూడా తనవే





గుండ్రంగా వుంటాయట... నన్నూ తనలా రాయమనేవారు" వాణి కళ్లు తిప్పుతూ, తలాడిస్తూ చెప్పింది.

వర్ధని వాణివైపు చిరాగ్గా చూసింది.

"ఈ పాప చిట్టి ముత్యంలా ముచ్చటగా వుందే!" ఆవిడ మెచ్చుకోలుగా వాణి బుగ్గను తన చేత్తో తట్టింది. వాణి సిగ్గుపడుతూ లలిత వెనుక నక్కింది.

కాసేపు అవీఇవీ మాట్లాడాక ఆవిడ లలిత మాటే అంగీకరించింది. వర్ధనిని రెండో తర గతిలో, వాణిని ఒకటో తరగతిలో చేర్చుకొ న్నారు. వెంటనే ఫీజు వగైరాల తతంగం కూడా ముగించుకొన్నారు. బయటకు వెళ్ల డానికి కుర్చీలోంచి లేచి, వర్ధని కోసం ముకుందం పక్కకి చూశాడు. అక్కడ వర్ధ నిలేదు.

ముకుందం, లలిత బయటకు వచ్చి స్కూలు కాంపౌండ్ అంతా వెదికి చూశారు. వర్ధని ఎక్కడాలేదు. లలిత ఓ చేత్తో వాణిని గట్టిగా పట్టుకొని, తరగతి గదులన్నీ వెదకడా నికి వెళ్లింది. ముకుందం కాంపౌండ్ బయ టకు వచ్చి చుట్టూ చూశాడు. వర్ధని అక్కడా లేదు.

వర్ధని రిక్షాలో వచ్చేప్పుడు శ్రద్ధగా దారికి రువైపులా గమనిస్తూ రావడం ముకుందా నికి టక్కున జ్ఞాపకం వచ్చింది. పెద్దవాళ్లు గమనించనివెన్నో పిల్లలు ఇట్టే పట్టేస్తారు. ముకుందం లలిత దగ్గరకు వేగంగా వెళ్లి ఆమెను బడివద్దే వుండమని, తను అదే వేగంతో బయటకు వచ్చాడు.

వచ్చినదారిలోని షాపుల్లోను, దారిపక్కన చెట్లచుట్టూ పెట్టిన సిమెంటు బెంచీల వెనుకా, పక్క కాలనీల్లోకి దారితీస్తున్న మట్టి రోడ్డుమీదా జాగ్రత్తగా వెదుకుతూ ముందుకు నడుస్తున్నాడు. దారిలో కలిసిన వాళ్లను కూడా వర్ధని ఆనవాళ్లు చెప్పి ఆరా తీస్తున్నాడు. వర్ధని వివరాలు ఎవరూ చెప్ప లేకపోయారు.

ముకుందానికి కంగారు ఎక్కువయ్యింది. మొహానికి పట్టిన చెమటను తుడుచు

కుంటూ, పెద్దపెద్ద అంగలతో పరిగెత్తిన ట్లుగా ఇంటివైపు నడవసాగాడు. వర్ధని జాడేలేదు!!

★ ★ ★

వర్ధనికి ముకుందం వాళ్ల మాటలనుబట్టి తననీ బడిలో చేర్పించడం ఖాయమని తెలిసిపోయింది. తమ బడి, పంతులమ్మ, సరళ, చెరువుగట్టు, ఉయ్యాల అన్నీ ఒక్కొక్కటిగా జ్ఞాపకం వచ్చాయి.

వాటన్నిటికీ దూరంగా తను ఎప్పటికీ ఇక్కడే వుండిపోవాలన్న ఆలోచనకే వర్ధనికి భయం వేసింది. వాళ్లంతా మాటల్లో మునిగి వుండగానే తను నెమ్మదిగా ఆ గది లోంచి బయటకు వచ్చింది.

ఇందాక కనిపించిన అమ్మాయిలిద్దరూ మళ్లీ హడావుడిగా లోపలికి వస్తున్నారు.

ఈ బడిలో చేరితే తనూ ఇలానే వుంటుందా? వర్ధని వారినే చూస్తూ అనుకొంది.

వర్ధనికి పెదనాన్న బుజ్జగిస్తూ బడికి పంపడం, కురుపమీద సవారి, బడినుంచి ఇంటికి రాగానే పెద్దమ్మ సిద్ధం చేసి వుంచే తాయిలాలు జ్ఞాపకం వచ్చాయి. పెద్ద పెట్టున వస్తోన్న దుఃఖాన్ని అణుచుకొంటూ ఆ విశాలమైన తారురోడ్డు పక్కగా తన శక్తి కొద్దీ పరుగుతీసింది. ఆయాసం తీర్చుకోను రొప్పుతూ ఆగి, వెనక్కు చూసింది. ఆ బడి కానీ, ఆ బడిలోని పిల్లలు కానీ కన్పించ లేదు. గౌనుకి కళ్లు అద్దుకుంది.

రోడ్డు పక్కగా వున్న బోర్డులను చదవడానికి ప్రయత్నిస్తూ, సినిమా పోస్టర్లను ఆసక్తిగా చూస్తూ నడుస్తోంది.

వర్ధనికి ఆకస్మాత్తుగా ఆకలి గుర్తొచ్చింది. కడుపులో చురచుర మంటోంది. పెద్దమ్మ వాయి తీయగానే వేడివేడి ఇడ్లీలు వేరుశనగల పచ్చడి నెయ్యి వేసి తినిపిస్తుంటే పెదనాన్నతో పోటీపడుతూ తినేది. లలితను నోరు తెరిచి అడగాలంటే నామోషీగా వుంటోంది.

వర్ధనికి ఏం చేయాలో తోచలేదు.

పక్కనేవున్న పళ్లబళ్లవైపు ఆశగా చూసింది.

అరటిపళ్లు, జాంకాయలు... ఒకటేమిటీ.. అన్నీ వర్ధనిని ఊరిస్తున్నాయి.

సన్నని దారాలకు వేలాడగట్టిన యాపిల్ కాయలు తమాషాగా వూగుతున్నాయి.

వర్ధని మెల్లిగా లేచి నిల్చుంది. గౌను సరిచేసుకొని, అటువైపుగా నాలుగడుగులు వేసింది. అరటిపళ్ల బండి పక్కనే రాయి మీద ఒకతను కూర్చుని వున్నాడు. అతని చేతిలో చిన్న కత్తివుంది. అరటిపళ్ల గెలను ముందు పెట్టుకొని, లెక్క ప్రకారం పళ్లను వేరుచేసి, బండిమీద పెడుతున్నాడు. ఛక్ ఛక్ మంటోన్న కత్తి శబ్దానికి వర్ధని అడుగు ముందుకు పడలేదు.

ఒక్క పరుగున వచ్చి వంతెనమీద కూర్చుంది.

వచ్చేపోయే వాహనాల వాళ్లకి చెయ్యి వూపింది.

మళ్లీ అరటిపళ్ల బండివైపు చూసింది. అతనిప్పుడు నిల్చుని వున్నాడు.

వర్ధనిని చూసి సన్నగా నవ్వాడు. వర్ధనికి కత్తి ఛమక్‌మన్నట్లనిపించింది.

వర్ధని చప్పున అటు తిరిగి కూర్చుంది.

ఇంతలో ఓ గుంపు ఆడవాళ్లు కీసరబాసరమంటూ వచ్చి వర్ధని పక్కన చతికిలబడ్డారు. వర్ధని వారివంక భయంభయంగా చూసింది.

అటువంటి వాళ్లని వర్ధని అంతకు మునుపెన్నడూ చూడలేదు. అందరూ ఎర్రటి లంగాలు కట్టుకొని వున్నారు. ఎర్రటి జాకెట్లు వీపుమీద తాళ్లతో ముడివేసి వున్నాయి. తలమీద నుంచి ఎర్రటి ముతక వోణి వేలాడుతోంది. వాటినిండా రంగురంగుల దారాలతో పెద్దపెద్ద అద్దాలు చిన్న చిన్న అద్దాలు, పూసలు కుట్టి వున్నాయి. జుట్టంతా సన్నని జడలుగా అల్లుకున్నారు.

ఆ అల్లికలోనే తెల్లటి ఆభరణాలు అమర్చివున్నాయి. మెడలో రకరకాల పూసల దండలతోపాటు తెల్లటి చక్రంలాంటి దాన్ని వేసుకొన్నారు. చేతులు కనిపించనంతగా బోలెడన్ని వెడల్పాటి, తెల్లటి గాజులు వేసుకొన్నారు.

వాళ్లు తమతో తెచ్చుకున్న మూటలని విప్పి, ఏవేవో వస్తువుల్ని బయటకు తీశారు. కొందరు పసిపిల్లల్ని సముదాయించుతోంటే, ఇంకొందరు గలగలమంటూ మాట్లాడుతున్నారు. వర్ధని కాస్త కుతూహలంగా, కాస్త భయంగా వారిని గమనిస్తోంది.

ఓ చిన్న పాప దేనికోసమో మారాం చేస్తోంది. ఒకావిడ లేచి పాట పాడుతూ పాప చుట్టూ తిరుగుతూ నాట్యం చేసింది.

ఒక్కోళ్లు లేచి చేతులు ఆడిస్తూ ఆమెకి జత కలిపారు.

నాట్యం చేస్తూనే ఒకావిడ పాపని భుజాల మీద కెక్కించుకుంది. పాప కిలకిలమంటూ నవ్వింది.

అందరూ అలాగే కాసేపు గుండ్రంగా తిరుగుతూ నాట్యం చేశారు.

వాళ్లు అలా తిరుగుతూ వుంటే అద్దాల మెరుపుతో, గాజుల శబ్దంతో తమాషాగా వుంది. వర్ధని ఆకలి కూడా మర్చిపోయింది.

అంతలోనే అందరూ వచ్చి కూర్చున్నారు.

పాపను ముద్దాడి, గలగల మాట్లాడుకుంటున్నారు.

వర్ధనికి వాళ్లభాష ఏమాత్రం అర్థమవకపోయినా, ఎందుకోగానీ విపరీతమైన భయం వేసింది. మెల్లిగా లేచి పక్కకు వెళ్లబోయింది. జయమ్మంత వయస్సున్నావిడ గబుక్కున వర్ధని చేయి పట్టుకొంది. తన మూటలోంచి నల్లగా బొగ్గులా, కాయలాంటి దాన్ని వర్ధని చేతిలో పెట్టబోయింది.

ఆవిడ మొహంమీది పచ్చబొట్టులతో వర్ధనికి మరింత భయంకరంగా కనిపించింది. ఆవిడ పిల్లల్ని ఎత్తుకెళ్లే బూచి అని వర్ధనికి రూఢీ అయింది. బిక్కచచ్చిపోయి చేయి విదిలించుకొని పరిగెత్తుకుపోబోయింది.

ఆమె నవ్వుతూ వర్ధని చేయి వదలకుండా ఆ కాయలాంటిదాన్ని ఇవ్వాలని ప్రయత్నిస్తోంది. మిగిలిన వాళ్లంతా ఆమెను ప్రోత్సహిస్తున్నారు. వర్ధనికి ఆ నవ్వు చూస్తుంటే జిత్తులమారి మంత్రగత్తెలు ఖచ్చితంగా ఇలాగే నవ్వుతారానిపించింది. తన చేయి విడిపించుకోవడానికి బలంగా గింజుకోసాగింది. కళ్లు కూడా తడిగట్టాయి. గొంతు పెగల్లేదు.

"ఫరవాలేదులే వర్ధనీ! తీసుకో! అవి కాల్చిన సీతాఫలాలు! వాళ్లు లంబాడీలు... మనల్నేం చేయరు"

చిరపరిచితమైన కంఠం వినగానే వర్ధనికి ప్రాణంలేచి వచ్చింది. గబుక్కున తలెత్తి చూసింది. ముకుందం!

★ ★ ★

ఆ తరువాత రెండు రోజులూ బడికి వెళ్లాల్సిన అవసరమే లేకపోయింది. ఎందుకో సెలవులట.

పిల్లలందరూ ఇన్నాళ్లూ ఎక్కడున్నారో గానీ ఆ రోజు బిలబిలమంటూ వీధిలోకి వచ్చిపడ్డారు. వాణి, తనూ వాళ్ల దగ్గరకి వెళ్లారు. కొందరితో జట్టు కట్టేసింది. ఆటల మధ్యలో గెంతుతూ వచ్చి లలితతో "ప్రతీ ఆదివారం బడికి సెలవట!" అంటూ చెప్పి మళ్లీ అలాగే గెంతుతూ బయటకు వెళ్లింది.

వర్ధని బడిలో చేరిన రోజు జరిగిన సంఘటన మిగిల్చిన విషాదంనుంచి ఇంకా బయటకి రాలేదు. పైపెచ్చు, ముకుందం కూడా రెండు రోజులు ఇంట్లోనే వున్నాడు. లలిత గంభీరంగా వుంది. ముకుందం వర్ధనిని మాటలలోకి దించడానికి ఎంతగానో ప్రయత్నించాడు. మాట్లాడడం అటుంచి వర్ధని కనీసం పెదవి కదలించలేదు.

ఆ రెండు రోజులు స్నానం పానం లేకుండా ఊరి జ్ఞాపకాలే ఊపిరిగా గడిపింది. తన ఉల్లాసభరితమైన విశాల




ప్రపంచం ఇక్కడి ఇరుకుగదులవలె కుంచించుకుపోయినట్లుగా తోచింది. వర్ధని కళకళలాడే మొహంలో ఉత్సాహ స్థానాన్ని దిగులు ఆక్రమించేసింది.

వాణి ముకుందంతోపాటు వెళ్లి బడికి కావల్సిన గౌన్లు, సంచులు, పలకలు, పుస్తకాలు కొనుక్కొచ్చింది.

హడావుడి చేస్తూ పుస్తకాలకు లలితతో అట్టలు వేయించుకొంది. ముకుందం చక్కగా వాటన్నిటిమీదా పేర్లు రాశాడు.

వర్ధని తనకేం పట్టనట్లు తన లోకంలో తనుండిపోయింది.

వర్ధనికి సంబంధించిన సరంజామానంతా ఒక సంచిలో సర్ది, వర్ధని పక్కన తెచ్చిపెట్టింది వాణి.

వర్ధని వాటివైపు కన్నెత్తైనా చూడలేదు. అవి తన స్వేచ్ఛకు వేసే సంకెళ్ళుగా అనిపించాయి. తనకు తన ఊరికి, తనవారికి వున్న బంధాన్ని నిర్దాక్షిణ్యంగాతెంపే పరికరాలుగా తోచాయి.

వర్ధని ఎంతకీ వాటిని పట్టించుకోకపోవడంతో వాణి సంచిలోంచి ఒక్కో పుస్తకం తీసి వాటిలోని బొమ్మల గురించి వర్ణించి చెప్పసాగింది. నిజానికి వర్ధనికి బొమ్మల పుస్తకాలంటే ఎంతో ఇష్టం. ఇప్పుడు మాత్రం ఆ పుస్తకాలంటేనే ఏదో తెలీని భయం మొదలయ్యింది. అవి తనకు, పెదనాన్నకు మధ్య ప్రతిబంధకాలు.

వాణి మాట్లాడుతూనే ఓ పుస్తకం తెరిచి వర్ధని వళ్ళో పెట్టింది. ముకుందం వ్రాసిన అక్షరాలు గంభీరంగా సూటిగా వర్ధనిని చూసినట్లనిపించింది. వళ్లోని పుస్తకం చేతిలోకి తీసుకొని శక్తికొద్దీ విసిరికొట్టింది.

అది వెళ్ళి కరెంట్‌బల్బ్ మీద పడడంతో బల్బు ముక్కలు ముక్కలుగా కిందపడింది, భళ్ళుమన్న బల్బుమీదనుంచి ఆ పుస్తకం నూనెసీసాను దొర్లిస్తూ కిందపడింది. భయంతో వెనక్కు జరిగిన వాణి ఆ నూనె మీద కాలువేయడం, జర్రున జారగాంతో గాజు పెంకులమీద పోయిపడడం, కెవ్వెగిరేలా కేకలు వేయడం, అన్నీ క్షణాల్లో జరిగిపోయాయి.

అనుకోకుండా జరిగిన ఈ భీభత్సానికి వర్ధని బెదిరిపోయింది. లలిత ఒక్కపరుగున అక్కడికి వచ్చింది. వాణిని లేపి కూర్చోపెట్టి, కాలు సరిచేస్తూ... వర్ధని వంక తీక్షణంగా చూసింది

లలిత మొహం చూడగానే వర్ధని మనసులోకి పిరికితనం ప్రవేశించింది. గిరుక్కున వెనక్కు తిరిగి, పక్కగదిలోకి పరిగెత్తుకు వెళ్ళి, ధడాలున తలుపులు మూసింది. ఆ వేగానికి తలుపుకు వున్న గడిజారి తలుపులు గట్టిగా బిగుసుకుపోయాయి. వర్ధని ఈ సంగతి గమనించలేదు. లలిత తన వెనకే వస్తుందేమోనన్న భయంతో మూలకు నక్కి కూర్చుంది. ఆ గదికున్న ఒకేఒక్క కిటికీ రోడ్డువైపుకు వుండడంతో, లలిత గది శుభ్రం చేయగానే అటువైపు నుంచి దుమ్ము రాకుండా కిటికీని మూసి వుంచింది. దాని సందుల్లోంచి సన్నటి వెలుతురు గదిలో ఏటవాలుగా పడుతోంది.

కాస్త తేరుకొని చుట్టూ చూసిన వర్ధనికి చీకటి గుహలో వున్నట్లుగా అనిపించింది. భయంతో గట్టిగా కళ్ళు మూసుకొని, గజగజ వణుకుతూ కూర్చుంది. జరిగిన సంఘటనకన్నా ఒంటరితనం, నిస్సహాయత వర్ధనిని కుంగదీశాయి. దానికితోడు విపరీతమైన ఆకలి.

వాణి వెక్కిళ్లు, లలిత సముదాయింపు, లలిత చీపురుతో ఆ గదిని చిమ్మడం వర్ధనికి అన్నీ వినిపిస్తూనే వున్నాయి. తన ప్రస్తావన వస్తుందేమోనని వర్ధని చెవులు రిక్కించింది. అలాంటిదేమీ వినబడలేదు. నిరాశతో మళ్ళీ అలాగే కూర్చుండిపోయింది. ఇప్పుడు కళ్లు చీకటికి అలవాటుపడి, మసకమసకగా గదిలో వస్తువులు కనపడుతున్నాయి. పెదనాన్న, పెద్దమ్మల

జ్ఞాపకాలు అలలు అలలుగా వర్ధనిని వువ్వెత్తున ముంచెత్తాయి.

వర్ధని ఏడ్చి ఏడ్చి అలసిపోయి... ఎప్పటికో అలానే నిద్రపోయింది.

మెలుకువ వచ్చేసరికి... కిటికీలోంచి పడుతోన్న ఆ సన్నటి వెలుతురు కూడా మాయమైంది.

తన కథల్లోని నేపాళ మాంత్రికుడు, ఒంటికన్ను రాక్షసుడు, కోరపళ్ల పిశాచి ఆ చీకటి గోడలమీద ప్రత్యక్షమయ్యారు. మొహాన పచ్చబొట్లతో వికృతంగా నవ్వుతోన్న జిత్తులమారి మంత్రగత్తె కళ్లముందు కొచ్చింది.

వర్ధని వెన్నులో వొణుకు పుట్టి, జరజర వళ్ళంతా వ్యాపించింది.

అందరూ గరగరా నవ్వుతూ హీహీ మంటూ వర్ధని చుట్టూ గెంతులేసినట్లనిపించింది.

వర్ధని పిచ్చిదానిలా కేకలు పెట్టింది. "పెదనాన్నా... పెద్దమ్మా... అంటూ" అందినచోటల్లా గోళ్ళతో గీరింది. దబదబ బాదింది.

ఆ అరుపులు, శబ్దాలు ఎక్కడో దూరాన వున్న పెదనాన్నకు పెద్దమ్మకు చేరాయో లేదో కానీ... గదిలో ప్రతిధ్వనించి తిరిగి తన చెవులనే చేరుతున్నాయి.

ఇంతలో భళ్ళున తలుపులు తెరుచుకున్నాయి. వర్ధని ఉలిక్కిపడి తలెత్తి చూసింది. విపరీతమైన వెలుగుకు కళ్ళు మూసుకుపోయాయి.

ఉలి, సుత్తి, పట్టుకొని వున్న అతనొకడు ఆనందంతో అరిచాడు, "సాబ్ తలుపు వచ్చేసింది"

ముకుందం గబగబ లోపలికి వచ్చి లైటు, ఫ్యాన్ వేశాడు.

చెమట్లతో ముద్దయిపోయి, మూలను ఒదిగి నిల్చుని, బిత్తర బిత్తరగా చూస్తోన్న వర్ధనిని చూడగానే ముకుందం గుండె పిండినట్లయింది. దగ్గరకు రమ్మన్నట్లు సైగ చేశాడు, వర్ధని అక్కణ్ణించి కదల్లేదు.

తన పిలుపు విని పెదనాన్న కానీ, పెద్దమ్మకానీ రాకపోవడంతో వర్ధని మరోసారి నిరుత్సాహపడింది. నీరసంతో కింద కూలబడింది. కంగారుతో వడలిన లలిత మొహాన్ని కానీ, ముకుందం అభ్యర్థనలో తొణికిన ఆవేదనను కానీ వర్ధని గ్రహించలేదు. తలుపు తీసినతను కేకేయడంతో ముకుందం బయటకు వెళ్ళిపోయాడు.

లలిత పళ్ళెంలో అన్నం కలుపుకు వచ్చి వర్ధని ముందు పెట్టింది.

వర్ధని బింకంగా గోడవైపు తిరిగి కూర్చుంది.

లలిత మంచినీళ్ళగ్లాసు కూడా తెచ్చి, పళ్ళెం పక్కనే పెట్టి మౌనంగా బయటకు వెళ్ళిపోయింది.

అడుగుల చప్పుడు దూరం అయ్యేదాకా వర్ధని వెనక్కు తిరగలేదు.

చుట్టుపక్కల ఎవరూ లేరని నిర్ధారణ చేసుకొన్నాక పళ్ళెంవంక చూసింది.

వేడి అన్నంలో వంకాయపచ్చడి, నెయ్యి వేసి కలిపిన వాసన వర్ధని బింకాలన్నిటినీ వదిలించేసింది.

నోరూరిపోతుంటే- వర్ధని పళ్ళెం వళ్లోకి తీసుకొని గబగబ తినడం మొదలెట్టింది. కిటికీలోంచి వర్ధనిని గమనిస్తోన్న ముకుందం మనసు అదోలా అయిపోయింది.

★ ★ ★

మొట్టమొదటిరోజు బడికి వెళ్ళడానికి వర్ధని చేయాల్సిన రాద్ధాంతం అంతా చేసింది లలిత కోపం పరిధులు దాటి వర్ధని బుగ్గలమీద వాతలు తేలేవరకూ!

వాణి ముందే తయారయ్యి రిక్షావాడి కోసం ఎదురుచూస్తూ వాకిట్లోనే కూర్చుంది. బడికి పిల్లలని తీసుకెళ్ళడంలో అనుభవమున్న ఆ రిక్షావాడు కొత్తలో అందరూ అంతేనని, నాలుగురోజులు పోతే వర్ధనే




స్వయంగా తయారయ్యి వస్తుందని లలితకు ధైర్యం చెప్పాడు. బడికి వెళ్ళే దారిలోనే వర్ధనిని దారిలోకి తెచ్చే పూచీ తనదని భరోసా ఇచ్చాడు.

రానని గింజుకుంటున్న వర్ధనిని ఎత్తుకొని తీసుకెళ్ళి బలవంతంగా రిక్షాలో కూలేశాడు. రిక్షాలోంచి కిందికి ఉరకబోతోన్న వర్ధనిని అదిమిపెట్టి, అడ్డంగా కొయ్యను బిగించాడు. ఒక్కసారిగా రిక్షాను ముందుకు ఉరికించాడు.

వాణి ఓ పక్కకు ఒదిగికూర్చుంది. వర్ధని సంచి కూడా వాణి దగ్గరే వుంది. రిక్షావాడు వారిని నవ్వించడానికి ఏవేవో మాటలు చెపుతున్నాడు. వాణి ఉత్సాహంగా అతనితో మాట్లాడుతూ, మధ్యమధ్యలో బిగ్గరగా నవ్వుతోంది. వర్ధనికి మాత్రం చిరాకేసింది. వలలో చిక్కిన సివంగిపిల్లలా గింజుకుంటోంది.

కిందకి దిగడానికి లేదు. బడి మానేసే అవకాశమే లేదు. కాసేపయ్యాక వర్ధని దృష్టి వాణి చేతిలోని తన సంచిమీద పడింది. 'దాన్ని తీసి విసిరికొడితే పీడా వదులుద్ది' వర్ధని కసిగా అనుకొంది.

వర్ధని ఆ సంచి అందుకోబోయింది. వాణి ఇవ్వలేదు. పైపెచ్చు అరిచినట్లుగా చెప్పింది,

"అమ్మ బడికెళ్ళాక ఇమ్మంది. ఇప్పుడు ఇవ్వను"

వర్ధనికి వాణి తిరస్కారంతో ఎక్కడలేని కోపం వచ్చింది. మళ్ళీ ఇంకోసారి సంచిని లాగింది. వాణి పట్టువదలకుండా సంచిని వళ్లోకి లాక్కుంది.

"అమ్మ బడికి వెళ్ళాకే ఇమ్మందని చెప్పాగా" వాణి గట్టిగా అంది.

వర్ధని దృష్టి సంచితాళ్ళను బిగించి పట్టుకొని వున్న వాణి చేతిమీద పడింది. వర్ధని చేతిని తీసేయబోయింది. వాణి చేతిపట్టును ఇంకాస్త బిగించింది. వర్ధని వాణి చేతిని వదలమంటూ గిచ్చింది. వాణి గింజుకుంది కానీ పట్టువదల్లేదు. పైపెచ్చు రిక్షావాడికి ఫిర్యాదు చేసింది. అతను ఒకసారి ఇద్దర్నీ గదిమి, మళ్ళీ రిక్షాతొక్కడంలో మునిగిపోయాడు.

వర్ధనికి వాణిమీద, వాణికి చెప్పి పంపిన లలితమీద, కోప్పడిన రిక్షావాడిమీద అందరి మీద కోపం వచ్చింది. తన సంచి ఎలాగైనా లాక్కోవాలన్న పట్టుదల పెరిగింది. ఊహించలేనంత వేగంగా వంగి, తాళ్ళు పట్టుకొని వున్న వాణి చేతిని కండలూడి వచ్చేలా కొరికేసింది. వాణి బావురుమంటూ అరవడంతో రిక్షావాడు రిక్షాను ఓ పక్కగా ఆపి, వాణిని సముదాయించాడు. తూతూ మంత్రంవేసి, తమాషా చేసి వాణిని నవ్వించాడు. దాంతోనే నొప్పి కూడా మాయం చేసేశాడు.

వర్ధని ఆ పని చేసింది తన పంతం నెరవేర్చుకోవాలనే ఆవేశంతోనే కానీ వాణిని గాయపరచాలని కాదు. వాణి కాలికి తగిలిన గాయం మానకముందే చేతిలో దిగబడిన పళ్ళగుర్తులు వర్ధనిని ఏదో తెలీని ఆందోళనకు గురిచేశాయి. మనసంతా పిరికితనం ఆవహించింది. రిక్షావాడు చెప్పినట్లు చేయాల్సివచ్చింది.

ఇంతలో బడి వచ్చేసింది. రిక్షావాడు ఇద్దర్నీ కిందికి దింపాడు. ఇద్దరి సంచుల్ని భుజాన తగిలించుకొన్నాడు. చెరో చేత్తో పట్టుకొని గబగబ బళ్ళోకి తీసుకెళ్ళాడు.

అప్పటికే పిల్లలందరూ బడి ఆవరణలో వరుసలుగా నిలబడివున్నారు.

అంతమంది వున్నా చీమచిటుక్కుమన్న శబ్దం కూడా లేదు.

రిక్షావాడు టీచర్లను ఏదో అడిగి, వాణిని ఓ వరుసలో వర్ధనిని మరో వరుసలో నిలబెట్టాడు. ఎవరి సంచి వారి చేతికిచ్చి వెళ్ళిపోయాడు.

వర్ధని తన వరుసలో చిట్టచివరిది. తన ముందున్న అమ్మాయిని పలకరిద్దామని అనుకుందో నిమిషం. అక్కడి వాతావరణం ఎందుకో ఆ పని చేయనివ్వలేదు. అప్పుడే మేడం వచ్చింది.

ఎవరో పెద్ద తరగతి పిల్లలు... ఇద్దరు వెళ్ళి- మేడం పక్కన నిల్చున్నారు.

మేడం సైగ చేయగానే 'వందేమాతరం' పాడారు. ఆ వెంటనే 'జనగణమన' మరో అబ్బాయి వెళ్ళి 'ప్రతిజ్ఞ' చెప్పాడు. అప్పటిదాకా నిశ్శబ్దంగా వున్న పిల్లలందరూ ముక్త కంఠంతో అతనికి వంతపలికారు.

వర్ధని కనుచివరలనుండి వాణిని చూసింది. వాణి కూడా పెదవులు కదిలిస్తోంది. వర్ధని అప్రయత్నంగా తనూ పెదవులు కదిపింది.

ఆ తరువాత ఒక్కొక్క వరుసలోని వాళ్ళు ఒకరి తరువాత ఒకరు నెమ్మదిగా నడుస్తూ తరగతుల్లోకి వెళ్ళారు.

వాణి ఓ వైపుకు, వర్ధని మరోవైపుకు మళ్ళారు.

వర్ధనికి ఎందుకో గాబరాగా వుంది. కొత్త ప్రదేశం, కొత్త మనుషులు, కొత్త పద్ధతులు.

వర్ధని వాణివైపు చూసింది.

వాణి ఉత్సాహంగా చకచక నడిచి వెళ్ళిపోయింది.

ఆగిపోయిన వర్ధనిని ఓ టీచర్ కేకేసి పిలిచింది.





వర్ధని గబగబ తమ వరుసను అనుసరిం చింది.

తరగతి గది గుమ్మందాకా క్రమబద్ధంగా వచ్చిన పిల్లలంతా... ఒక్కసారిగా గడబి డగా గదిలో దూరారు.

తరగతిగది చాలా పెద్దది. గదిలో కుర్చీలు వరుసక్రమంలో అమర్చివున్నాయి. కుర్చీలకు కొన్నింటికి బల్లలున్నాయి. కొన్నిం టికి కుడిపక్కన పుస్తకాలు పెట్టుకోను వీలుగా కొయ్య అమర్చివుంది. ఎదురుగా గోడమీద పెద్ద నల్లబల్ల. దాని పక్కనే ఓ ఎత్తయిన కుర్చీ

వర్ధని కళ్లు పెద్దవి చేసుకొని అన్నింటిని పట్టి పట్టి చూసింది.

పిల్లలంతా గోలగోలగా ఒకరినొకరు పల కరించుకొంటున్నారు.

వర్ధని ఒక్కతే గుమ్మంలో నిలబడిపో యింది.

"లోపలికి పదమ్మా"

వర్ధని గిర్రున వెనక్కి తిరిగింది. ఒకామె నవ్వుతూ నిల్చునివుంది.

ఆవిడ వర్ధని చేయి పట్టుకొని- ఓ కుర్చీ దగ్గరకి తీసికెళ్ళి కూర్చోబెట్టింది. తరగతి పిల్లలందరినీ పేరు పేరునా పలకరించింది.

చివరిగా వర్ధనిని తన దగ్గరకి పిలిచింది.

వర్ధని బిడియపడుతూ వెళ్ళి ఆవిడ పక్కన నిల్చుంది.

వర్ధని తరగతిలో చేరిన కొత్త అమ్మాయి అని అందరికీ పరిచయం చేసిందావిడ.

వర్ధని జరుగుతోన్న తతంగాన్నంతా అయోమయంగా చూస్తోంది.

ఆవిడ వర్ధనిని వెళ్ళి తనకు కేటాయించిన స్థలంలో కూర్చోమని చెప్పింది.

వర్ధని మౌనంగా వెళ్ళి, తన కుర్చీలో కూర్చుంది.

పిల్లలందరినీ వేసవి సెలవులు ఎలా గడి పారని అడిగిందావిడ.

అందరూ ఒకరిమీద పోటీపడి ఒకరు చెపుతున్నారు.

వర్ధని గుడ్లప్పగించి కూర్చుంది.

ఇంతలో ఎవరో రిబ్బను పట్టి లాగినట్లవ డంతో ఆ పక్కకి చూసింది.

పక్కకుర్చీలో అమ్మాయి గుసగుసగా అడి గింది, "నీ పేరేంటి? "

"వర్ధని" వర్ధని బెరుగ్గా అంది.

"నా పేరు గీత" వర్ధని తలాడించి, అటు తిరిగి కూర్చుంది.

గీత కాసేపటివరకు ఏమీ మాట్లాడలేదు.

"ష్... ష్..." వర్ధని గీతవైపు చూసింది.

"నాతో పందు కొడతావా!" గీత రహ స్యంగా అడిగింది.

వర్ధనికి గీత మాటలు అర్థం కాలేదు. గీతవైపు అయోమయంగా చూసింది.

గీతకి అంతలోనే కోపం వచ్చింది.

"నీతో కచ్చి" అంటూ తన మునిపళ్లకు బొటనవేలును తాటించి, అటు తిరిగికూర్చుంది.

వర్ధనికి అంతా అయోమయంగా వుంది.

ఇంతలో టీచర్ అందర్ని నిశ్శబ్దంగా వుండమని గద్దించింది.

పోయిన ఏడాది చదువుకుంది ఏమాత్రం జ్ఞాపకం వుందో చూస్తాను వుండండి. అంటూ అందర్నీ వరుసగా ఏవో ప్రశ్నలడ గడం మొదలెట్టింది.

ఆవిడ ప్రశ్న అడగగానే ఒక్కోరు లేచి నిల్చుని, సమాధానం చెపుతున్నారు.

వర్ధని వంతు వచ్చింది.

"నెలల పేర్లు చెప్పమ్మా"

వర్ధని బిడియంగా అటూ ఇటూ చూస్తూ లేచి నిల్చుంది.

తరగతి పిల్లలంతా వర్ధని వంకే చూస్తు న్నారు.

"భయం లేదులే.. చెప్పు" ఆవిడ నవ్వుతూ అంది.

వర్ధని పెదాలు తడి చేసుకొంటూ గుట కలు మింగింది.

"అసలు నీకు నెలల పేర్లు తెలుసా? మీ బళ్ళో చెప్పారా? "

వర్ధని తలదించుకొని, మౌనంగా తలాడించింది.

"అయితే చెప్పు మరి"

వర్ధనికి రోజూ క్రమం తప్పకుండా పంతులు వల్లెవేయించేవన్నీ చక్కగా గుర్తున్నాయి. ఒకసారి టీచర్ మొహంలోకి చూసింది. ఆవిడ నవ్వుతూ వర్ధని వంకే చూస్తోంది. వర్ధని కళ్ళు దించుకొని టకటక చెప్పింది.

"చైత్రం, వైశాఖం, జ్యేష్టం, ఆషాఢం..."

అంతే!

తరగతి పిల్లలంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు.

వర్ధని బిక్కచచ్చిపోయింది. బిత్తర బిత్తరగా అందర్నీ కలియజూసింది.

"ఇందులో నవ్వాల్సింది ఏం వుంది?" ఎవరిదో కంఠం గుమ్మం దగ్గర ఖంగుమంది. టక్కున నవ్వులాగిపోయాయి.

అందరితోపాటు వర్ధని గుమ్మంవైపు చూసింది.

ఎప్పుడు వచ్చిందో ఏమో- మేడం అందర్నీ తీక్షణంగా చూస్తోంది.

మేడం లోపలికి వచ్చింది.

"గీతా... నువ్వు చెప్పు నెలల పేర్లేమిటో'

"జనవరి... ఫిబ్రవరి..." గీతకు ఆపైన గుర్తుకు రాలేదు.

మేడం అందరి వంకా కలియజూసి, గంభీరంగా అంది, "సరే, మీలో ఎవరైనా తెలుగు నెలలు చెప్పండి"

ఎవరూ మాట్లాడలేదు.

"పోనీ సంవత్సరాలు?"

మౌనం సమాధానమయింది.

మేడం వర్ధనివైపు తిరిగి అంది, "ఏదమ్మా, నువ్వు చెప్పు"

వర్ధనికి జరుగుతోన్న పరిణామాలన్నీ ఆశ్చర్యంగా వున్నాయి. అంతకుముందున్న బెరుకు మాయమయింది. టకటక తెలుగు నెలలు, సంవత్సరాలు అప్పజెప్పింది.

మేడం దగ్గరకి వచ్చి వర్ధని భుజాన్ని తట్టింది.

తరగతి పిల్లలంతా గది హోరెత్తేలా చప్పట్లు కొట్టారు.

వర్ధని సిగ్గుపడుతూ తలదించుకుంది.

మేడం తరగతి పిల్లలందరినీ మరోసారి కలియజూసి వెళ్ళిపోయింది. సరిగ్గా అప్పుడే వర్ధనికి ఉదయం రిక్షాలో జరిగిన సంగతులు మనసులో మెదిలాయి. ఇక ఆ రోజంతా అన్యమనస్కంగానే గడిపింది.

తరగతి పిల్లలందరూ కేరింతలతో పాటలు పాడుతూ సరదాగా గడిపారు.

టీచర్ కూడా ఉత్సాహంగా అందరినీ ప్రోత్సహిస్తోంది.

వర్ధని ముభావం వారిలో కలవనివ్వలేదు.

బడిగంట కొట్టీ కొట్టగానే రిక్షావాడు తరగతి గదిముందు నిల్చున్నాడు.

రిక్షావాడు సంచి తను తీసుకొని, వర్ధని చేయిపట్టుకొని రిక్షా దగ్గరకి తీసుకెళ్ళాడు.

అప్పటికే వాణి రిక్షాలో కూర్చునివుంది. వర్ధనిని చూడగానే పలకరింపుగా నవ్వింది. వర్ధని మౌనంగా రిక్షాలో కూర్చుంది.

"అక్కా... మరే... ఇక్కడ పంతులమ్మని టీచర్ అనాలిట" వాణి గొప్పవిశేషం చెపుతున్నట్లుగా అంది. వర్ధని మాట్లాడలేదు.

వర్ధని రహస్యంగా వాణి చెయ్యి ఎలా వుందో చూసింది. వర్ధని కొరికినచోట ఎర్రగా కమిలిపోయింది. పళ్ళగుర్తులు ఇంకా స్పష్టంగా కనిపిస్తున్నాయి. వర్ధని బిక్కుబిక్కుమంటూ ఇంట్లో అడుగుపెట్టింది.

వర్ధని ఊహించిన సన్మానం సరిగ్గానే జరిగింది.

ఆరోజు వర్ధనిచేత మళ్ళీ అలాంటిపని చెయ్యనని చెప్పించడానికి లలిత చేతితోపాటు చీపురుకట్టకీ పనిచెప్పింది.




కానీ వర్ధని పెదవి విప్పించలేకపో యింది.

ఇన్నిరోజులూ వర్ధనికి వీరందరి మధ్య తను పరాయిదాన్నని అనుమానంగా వుండేది. ఇప్పుడు లలిత ప్రవర్తనతో ఆ అనుమానం నిజమయింది.

వర్ధని ఏదో సందర్భంలో అలాగే చేస్తూ వుంది. మళ్ళీ! మళ్ళీ!



బడి వాతావరణం ఇంటితో పోలిస్తే వర్ధనికి ఫెయ్యిరెట్లు బావుంది. పంతులు బడికి దీనికి పోలికే లేదు. వర్ధని లెక్కపెట్టలేనంత మంది పిల్లలు. వాణి అంత వాళ్ళు, తనంత వాళ్ళు, కొంచెం పెద్దవాళ్ళు, మరీ పెద్దవాళ్ళు. అందరూ ఒకేరకం దుస్తుల్లో వుండడంవలన కొత్తల్లో వర్ధని ఎవరినీ గుర్తుపట్టలేకపోయేది.

అయితే తరగతి గదిలో కదలకుండా అన్నిగంటలు కూర్చోవడమంటే, వర్ధనికి ముళ్ళమీద కూర్చున్నట్లుగానే వుంటోంది. ఒకరి తరువాత ఒకరు, ఒక పాఠం అవగానే ఇంకో పాఠం చెప్పేసి వెళుతోంటే వర్ధనికి కొత్తలో అయోమయంగా వుండేది. అయితే, వాళ్ల కొత్త కొత్త విషయాలు ఆసక్తికరంగా చెపుతూండడంతో వాటిపట్ల తనకు తెలియకుండానే ఆకర్షించబడింది.

వర్ధనిని అన్నిటికన్నా ఎక్కువగా ఆకర్షించింది- బడి బయటి తురాయి చెట్టుకింద వరుసగా కూర్చునే లంబాడీలు. వాళ్ల తమ ఎదురుగా చిన్న గోనెపట్టా పరుచుకొని, దానిపై జాంకాయలు రేగ్గాయలు, సీతాఫలాలు చక్కగా అమర్చి అమ్ముతూ వుంటారు.

సమయం దొరికితే చాలు వర్ధని పరిగెత్తుకొంటూ వెళ్లి, ఆ తురాయి చెట్టునానుకొని, లంబాడీలను గమనిస్తూ నిల్చునేది.

వాళ్ళల్లో కొందరు తళుకులీనే అద్దాలను లంగాలపై వోణీలపై కుడుతూ వుండేవారు. చాకచక్యంగా, నైపుణ్యంగా కదిలే వేళ్లను వర్ధని ఆశ్చర్యంగా గమనించేది.

వర్ధనితో వాళ్లు సైగలతో మాట్లాడాలని ప్రయత్నించేవారు. కానీ, వారి చూపు తన మీద పడగానే వర్ధని మళ్ళీ బళ్లోకి పరుగు తీసేది.

వర్ధని ఓరోజు తురాయి చెట్టుకింద నిలబడి, బడిలోని పిల్లల్ని గమనిస్తూవుంటే, ఓ తమాషా అయిన అబ్బాయి వర్ధని దృష్టిలో పడ్డాడు. అతని ప్రత్యేకత అతని వింత ప్రవర్తనే. అందరిలాగా కాకుండా అతను ఓ ప్రత్యేకమైన వెడల్పాటి బెల్టు పెట్టుకొనేవాడు. ఎత్తయిన బూట్లు వేసుకొనేవాడు. అతని జేబులో ఎంత డబ్బు వుంటుందో కానీ, లంబాడీల దగ్గరికి వచ్చి గుప్పిటనిండా తీసి ఇచ్చేవాడు. అంతటితో వూరుకొంటే విశేషమే లేదు. జేబుల్నిండా రేగ్గాయలు పోయించుకొని, వెళ్తూవెళ్తూ ఆ కాయల కుప్పని విసురుగా తన్నేవాడు. కాయలన్నీ చిందరవందరగా పడేవి. లంబాడీలు తమ భాషలో తిట్లపురాణం ఎత్తితే, పగలబడి నవ్వేవాడు. రోజూ ఇదే తంతు. ఐస్‌ఫ్రూట్ బండి వాడితోను, చాక్లెట్లు, పిప్పరమెంట్లు అతనితోను అలాగే ప్రవర్తించుతాడు.

వర్ధని అతని ప్రవర్తనని ఆశ్చర్యంగా, భయంభయంగా గమనిస్తూవుంటుంది. తరువాత ఎవరో చెప్పారు. అతను గౌతమ్ అనీ, మూడోతరగతి అనీ, తను మొట్టమొ

వటిరోజు కలిసినావిడ... అదే ఆ మేడం... గౌతం వాళ్ళ అమ్మ అనీ!

★ ★ ★

ఆరోజు ఉదయం వర్ధని నిద్రలేచేసరికి ఓ ఊహించని సంఘటన జరిగింది. వంటింట్లోంచి వేణు గొంతు వినిపిస్తోంది.

వర్ధని కలగంటున్నానేమోనన్న అనుమానంతో కొద్దిసేపు మంచంమీదే కూర్చుండిపోయింది. సందేహం లేదు. ఆ గొంతు వేణన్నాయిదే! వర్ధని ఒక్క ఉదుటున లేచి పరిగెత్తుకొంటూ వంటింట్లోకి వెళ్ళింది.

వర్ధని గుమ్మం దగ్గరే ఆగిపోయింది.

వేణు పీటమీద అటువైపు తిరిగి కూర్చుని వున్నాడు.

లలిత కాఫీ కలుపుతూ ఏవో కబుర్లు చెబుతోంది.

వర్ధని సవ్వడి చేయకుండా అలాగే నిలబడిపోయింది. వర్ధని మొహంలోకి మునుపటి ఉత్సాహం వచ్చేసింది. అంతకన్నా వేగంగా ఉద్వేగమూ వచ్చింది.

వర్ధని చిట్టిబుర్రనిండా ఎన్నో ప్రశ్నలు పుట్టుకొచ్చాయి.

'పెదనాన్న గిత్తల్ని సవారి కడుతున్నాడా? పెద్దమ్మ మిరపకాయలు ఊరేసిందా? చిక్కుడుపాదు ఎంత అల్లుకుందో? పొట్లకాయలకి రాళ్ళెవరు కడుతున్నారు? పూలమొక్కలు మొగ్గతొడిగాయా? పంతులు వాళ్ళింటికి వచ్చిన చుట్టాలు ఇంకా వున్నారా? సరళ ఏం చేస్తుంది? ఉయ్యాల ఒక్కతే ఊగుతుందా?

ఒక్కప్రశ్నా వర్ధని పెదవి దాటలేదు.

వేణును తనేముందు పలకరించడానికి వర్ధనికి మొహమాటమేసింది.

ఏదో దిగులు, బిడియం, అభిమానం వర్ధనిని నోరు మెదపనీయలేదు.

వర్ధని ముందు గదిలో ఒక మూలన మోకాళ్ళమీద తల ఆన్చుకొని కూర్చుని వుంది.

"వర్ధనమ్మా... వర్ధనమ్మా" వేణు పిలుస్తూ వచ్చాడు.

ఆ పిలుపుతో వర్ధని మనసులో ఏదో ఆశ చిగురించింది. ఎన్నాళ్ళయిందో ఎవరైనా తనని అలా పిలిచి. 'మొండిఘటం, రణపెంకి, పొగరుమోతు, గుబులుమారి గురవక్క' ఇలాంటి పేర్లతో పిలిపించుకోవడమే ఎక్కువైందీ మధ్య. ఎన్ని పితూరీలు తన మీద చెప్పాలని చూసినా, వేణన్నాయి ఆవిడగారి మాటలు వినడులే! అన్నయ్యా తన వేణు అన్నయ్య! తనంటే ఎంతో ఇష్టం.

వర్ధని నమ్మకం వమ్ము కాలేదు. వేణు వర్ధని ఎదురుగా వచ్చి కూర్చున్నాడు. ఆ మాటలు, ఈ మాటలు చెప్పి చివరకి వర్ధని నోరు విప్పించాడు.

"వర్ధనమ్మా... పెద్దమ్మ నీ కోసం ఎన్ని అప్పచ్చులు పంపిందో తెలుసా? " ఊరిస్తూ అన్నాడు.

"నాకేం వద్దుపో!" వర్ధని కోపంగా అంది.

"అరిసెలు, బూరెలు, ఇంకా..." వేణు నవ్వుతూ చెపుతున్నాడు.

"నాకేం అక్కర్లేదని చెప్పానా? నేనసలు వాళ్ళిద్దరితో మాట్లాడనే మాట్లాడను. నన్ను అక్కణ్ణించి ఎందుకు పంపాలట? నేను మీరెవ్వరితో మాట్లాడను!" వర్ధని తన చేతులమీద వేసిన వేణు చేతుల్ని విసిరికొడుతూ అంది.

"నాతో కూడా మాట్లాడవుగా! సరే! అయితే పెదనాన్న నీ కోసం పంపిన నేరేడుకాయలు వాణికిచ్చేయనా? "

"వొద్దొద్దు! అవి నాకే కావాలి!" వర్ధని అప్రయత్నంగా బింకాలన్నీ వదిలేసి అంది.

వేణు పెద్దగా నవ్వాడు.

"చూశావా... చూశావా... నువ్వు నాతో మాట్లాడేస్తున్నావ్! నేను నీకు కాయలు ఇస్తున్నాను" అంటూనే వేణు వర్ధనిని తను తెచ్చిన బుట్ట దగ్గరకి తీసుకెళ్ళాడు.

వర్ధని చెంగున గెంతి బుట్టంతా గబగబ వెదికింది. నేరేడుకాయలు, జామకాయలు,

 

మొక్కజొన్నకంకులు...

"అన్నాయ్, అప్పచ్చులేవీ?" వర్ధని ఆత్రంగా అడిగింది.

లలిత అరిసెలు, బెల్లపులడ్లు ప్లేట్లో పెట్టి అప్పటికే టేబుల్ మీద పెట్టివుంచింది. వర్ధని గమనించకుండా వెళ్లి, వేణు ప్లేటు తెచ్చి వర్ధనికి ఇచ్చాడు.

వర్ధనికి వాటిని చూడగానే ప్రాణం లేచొచ్చింది. పెద్దమ్మ చేతిలో రూపుదిద్దుకొన్న పిండివంటలివి! వర్ధని వాటిని అపురూపంగా చూస్తూ, ఆప్యాయంగా తడిమింది. అచ్చం పెద్దమ్మ చేతిని తడుముతున్నట్లుగా అనిపించింది. రెండు చేతుల్లోకి వాటిని తీసుకొంది. గబగబ పరిగెత్తుకెళ్లి తన పుస్తకాల సంచిలో దాచుకొంది.

మళ్లీ పరిగెత్తుకొంటూ వేణు దగ్గరకి వచ్చింది. చేయి పట్టుకొని గేటు దగ్గరకి లాక్కెళ్ళింది.

ఊరి విశేషాలు మళ్ళీ మళ్లీ అడిగి చెప్పించుకొంది. ఎన్ని మాట్లాడుతున్నా పెద్దమ్మా పెదనాన్నల సంగతిమాత్రం ఎత్తలేదు. గుంభనంగా ఉండిపోయింది. వాళ్లూ తన లాగే తనకోసం బాధపడుతూ ఉంటారా? తనను తీసుకురమ్మనే కదూ అన్నయ్యను పంపింది? వదిన్ని తీసుకురావడానికి తనను కూడా తీసుకెళతానని ఆరోజొకరోజు పెద్దమ్మ చెప్పలా? అవునుమరి, పెద్దమ్మ తను లేకుండా ఎలా వెళ్తుంది? ఈ బుజ్జి మేనత్త మేనకోడలికి పేరుపెట్టి ఇంటికి తీసుకురావాలన్ని పెదనాన్న చెప్పలా? పెద్దమ్మ వదినావాళ్ల ఊళ్లో తనకోసం ఓ పట్టులంగా కొంటానంది కూడా! వర్ధని వేణు తనని ఊరికి తీసుకువెళ్లడానికే వచ్చాడని తనకై తను నిశ్చయించుకుంది.

వేణు వర్ధనిని మాట్లాడిస్తూనే లోపలికి తీసుకొచ్చాడు. వర్ధని మొదటిసారిగా ఏ గొడవా చేయకుండా తయారయ్యి, వేణుతోపాటే టిఫిన్ కూడా చేసింది.

వేణు వర్ధనిని రోజూ బడికి తీసుకువెళ్లే రిక్షాలో కాక మరోదాంట్లో బడికి తీసుకువెళ్లాడు. వాణి ఎప్పటిలానే సంచులు మోస్తూ తమ రిక్షాలో బయలుదేరింది.

వర్ధని చెంగుచెంగున తిరుగుతూ వేణుకి తమ బడంతా చూపించింది. బడి ముందున్న తురాయి చెట్టును, చెట్టుకింది లంబాడీలను చూపించింది. వేణు కూడా ఆసక్తిగా వర్ధనిని అన్నీ మళ్లీ మళ్లీ అడిగి చెప్పించుకొన్నాడు. వర్ధని గారాలుపోతూ, మారాం చేస్తూ లంబాడీల దగ్గరి చిరుతిళ్లన్నీ కొనిపిచ్చుకుంది. ఐస్‌ఫ్రూట్, చాక్లెట్లు ఇప్పించుకుంది. తన తరగతి పిల్లలెవరైనా కనబడితే వేణు చేయి ఊపుతూ, "ఇదుగో, మా అన్నయ్య!" అంటూ గర్వంగా పరిచయంచేసింది.

తనకు బజారులో ముఖ్యమైన పని ఉందనీ, మళ్లీ వస్తానని నెమ్మదిగా వర్ధనిని ఒప్పించి, వేణు వర్ధనిని బడిలో వదిలి వెళ్లిపోయాడు.

వర్ధని బడి గేట్లో నుల్చుని వేణు కనుమరుగయ్యేదాకా చూస్తూ ఉండిపోయింది. ఎందుకో మనసు భారంగా అనిపించింది. అంతలోనే వాణి రిక్షా దిగి వచ్చి, వర్ధని సంచి వర్ధనికి అందించింది. వర్ధని గబుక్కున సంచిని అందుకొని తన తరగతివాళ్ల దగ్గరికి తూనీగలా పరిగెత్తింది.

ఎప్పుడూ తన తరగతి వాళ్లెవరైనా పలకరించినా పలకని వర్ధని ఆరోజు తనకై తను అందరినీ పలకరించింది. అంతేకాక వారిని తమ ఊరి కబుర్లతో ముంచెత్తింది. ఉత్సాహంగా ఇంటిబెల్లు మోగడంకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

రిక్షాలో వాణితో కూడా ఏవేవో కబుర్లు చెపుతూనేవుంది. ఇంటిదగ్గర రిక్షా దిగగానే సంచిని గుమ్మంలోనే పడేసి లోపలికి పరిగెత్తింది. వేణు కన్పించలేదు. ప్రతి గది లోనూ వెదికింది. చివరికి బాత్‌రూంలో, డాబామీదా, మెట్లకిందా కూడా చూసింది.

వర్ధనికి ఏదో అనుమానం వచ్చింది. ఒక్క పరుగున వెళ్లి ముందుగదిలో చెప్పులు వెదికింది. కనిపించలేదు. వేణు తనతో తీసుకు వచ్చిన బుట్టలకోసం వెదికింది. అవీ కనిపించలేదు. వర్ధనిలో ఏదో ఆందోళన మొదలయ్యింది.

వంటింట్లో గుమ్మం దగ్గరికి వెళ్లి, లలితను ఉద్దేశించి అరిచినట్లుగా గట్టిగా అడిగింది.

"వేణూ అన్నాయ్ ఏడీ? "

లలిత నింపాదిగా అంది, "ఊరెళ్లాడుగా! నీకు చెప్పలా? "

వర్ధని నెత్తిమీద ఏదో విరుచుకుపడ్డట్లుగా ఉలిక్కిపడింది. అప్రయత్నంగా నాలుగు అడుగులు వెనక్కి వేసింది.

"లేదు... లేదు...! వేణన్నాయ్ అలా చేయడు. నాకు చెప్పకుండా... నన్నొదిలేసి... వెళ్లడు... వెళ్లడు..." వర్ధని గొణుక్కుంటూ వెనక్కి జరిగింది.

గిరుక్కున వెనక్కు తిరిగి ఏడుస్తూ గట్టిగా వేణుని పిలుస్తూ రివ్వున బయటకు దూసుకుపోయింది. లలిత అంతకంటే వేగంగా కదిలి గేటుదగ్గరే వర్ధనిని ఆపింది. వర్ధని బలంగా లలిత చేతులు విదిలించుకోబోయింది. లలిత ఓ చేత్తో వర్ధని రెక్కను గట్టిగా పట్టుకొని, మరోచేత్తో వర్ధని వీపు మీద వాయించేసింది. వర్ధని గింజుకుంటున్నా కాళ్లతో తంతున్నా వదలకుండా తీసుకొచ్చి గదిలో పడేసింది. తలుపు మూసిన వెంటనే బయటనుంచి గడి వేసిన చప్పుడు కూడా వర్ధనికి వినిపించింది.

వర్ధనిని మళ్లీ ఒంటరితనం, పిరికితనం చుట్టుముట్టాయి. నిస్పృహాయంగా తలుపులు దబదబా బాదుతూ, గోళ్లతో గీకుతూ, ఏడుస్తూ, వేణుని పిలుస్తూ... అరిచి.... అరిచి... అలిసిపోయి నేలమీద కూలబడింది.

గడి తీసిన చప్పుడు వినిపించడంతో గిరుక్కున తలుపువైపు తిరిగింది. గదిలో అటూ ఇటూ చూసింది. తలుపు తీసేలోపలే గబుక్కున వెళ్లి మంచంకింద దూరింది.

మెల్లిగా తలుపు తెరుచుకొని మెత్తగా, శబ్దం చేయకుండా వచ్చారెవరో. మళ్లీ తలుపు చేరవేసి, అటూ ఇటూ తిరుగుతున్నారు. వర్ధని తల ఎత్తి చూసింది. ఆ చిన్ని పాదాలు వాణివి.

వాణి గుసగుసలాడుతున్నట్లుగా "అక్కా... అక్కా..." అని పిలిచింది.

వర్ధని మాట్లాడలేదు. వాణి మంచంకిందకు వంగి చూసింది.

"అమ్మయ్య... ఇక్కడున్నావా? చూడు నీకోసం ఏం తెచ్చానో!"

వర్ధని గచ్చుమీద గోడవైపు తిరిగి, బోర్లా పడుకొని ఉంది. తల తిప్పలేదు.

"సరే నీ ఇష్టం! తింటే తిను లేకపోతే లేదు! సరోజ వదిన చలిమిడి తెచ్చిందట! అమ్మ ఇమ్మంటే తీసుకొచ్చాను. నే వెళ్తున్నా!" వాణి ప్లేటును మంచంకిందికి నెట్టి చరచరా వెళ్లిపోయింది.

వర్ధనికి తను ఘోరంగా మోసపోయానని అర్థమైంది. వేణన్నాయి తనను తీసుకెళ్లడానికి రాలేదు. సరోజ వదిన తను వెళ్లకుండానే వచ్చేసింది. పెద్దమ్మ, పెదనాన్న అందరూ అబద్ధాలు చెప్పారు. ఈ బుజ్జి మేనత్త వెళ్లకుండానే పాపని ఎలా తీసుకొచ్చారు? వర్ధని గుండె పిండినట్లయింది.

వర్ధని దృష్టి చలిమిడి ప్లేటుమీద పడింది. చిన్నచిన్న కొబ్బరిముక్కలు, జీడిపప్పు చలిమిడిలోంచి ఊరిస్తూ తొంగిచూస్తున్నాయి.

వర్ధనికి అందరిమీదా కచ్చగా ఉంది. చివరకు తనమీద కూడా. ఆ కోపమంతా ఎదురుగా ఉన్న చలిమిడి ముద్దమీద చూపించింది. ప్లేటును చేతిలోకి తీసుకొని బలం కొద్దీ విసిరికొట్టింది. చలిమిడి గోడమీద ముద్దలా అతుక్కుంది. ప్లేటు శబ్దం చేస్తూ కిందపడింది. మంచంకిందే పడుకొని, వర్ధని ఏడుస్తూ ఉండిపోయింది.

★ ★ ★







వర్ధని నిద్రలేచి, మంచంకిందనుంచి మోకాళ్లమీద పాకుతూ బయటకు వచ్చింది. ముకుందం ఆ మంచంమీదే పడుకొని ఉన్నాడు.

రాత్రంతా ఈయన ఇక్కడే పడుకొని ఉన్నాడా? వర్ధని ముకుందం భారీకాయం కళ్లు నులుముకుంటూ భయంభయంగా చూసింది. గబుక్కున వరండాలోకి వెళ్లి, చుట్టూ చూసింది.

వాణి బయట వరుసలుగా పెట్టిన కనకాంబరం మొక్కలకు నీళ్లు పోస్తోంది. వాణి నీళ్లు పోయడం అవగానే లలిత పూసిన కనకాంబరాలన్నింటినీ కోసింది. వాణి గౌను చివర్లను రెండు చేతులతో పైకెత్తి ఆ ఒడిలో పూలను వేయించుకొంది. ఇద్దరూ వరండా మెట్లమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ పూలు మాల కడుతున్నారు.

వర్ధనికి ఉసూరుమనిపించింది. ఊళ్లో తనూ, పెద్దమ్మ నాటిన చిట్టి చేమంతులు ఎలా ఉన్నాయో? కారబ్బంతులు పూలు పూస్తుంటాయా? దొంతరమల్లె పూత ఆగిపోయుంటుంది కదా? వర్ధని ఆలోచిస్తూనే మొహం కడుక్కొచ్చింది.

ఇంతలో వాణి గబగబ వర్ధని దగ్గరికి వచ్చింది. కనకాంబరాల మాల చేతిలో

పట్టుకొని ఉంది.

"ఇదుగో అక్కా! నువ్వు బడికి తొందరగా తయారయితే నీకు దీంట్లో సగం!" మాల ఊపుతూ ఊరిస్తున్నట్లుగా అంది వాణి.

వర్ధనికి చిర్రెత్తుకొచ్చింది. తను బడికి తయారవ్వడానికి ఈ మాల ఇస్తుందా? ఇది ఈ వాణికొచ్చిన ఆలోచన అయివుండదు. ఆ లలితే చెప్పి పంపివుంటుంది. వర్ధని నిర్లక్ష్యంగా అంది, "ఏయ్! నీకేం చెప్పాను నేను? నన్ను అక్కా తొక్కా అని పిలవవద్దని చెప్పలా? అయినా, నీ బోడి కనకాంబరాలమాల ఎవడిక్కావాలి? మొత్తం నువ్వే పెట్టుకొని ఊరేగు!"

"ఇదుగో బోడి మాల గీడిమాల అన్నావంటే చూడు!" వాణి చూపుడువేలిని బెదిరిస్తున్నట్లుగా ఆడిస్తూ అంది.

"ఏం చేస్తావ్? అంటాను! మళ్లీ మళ్లీ అంటాను! బోడిమాల! బోడిమాల!" వర్ధని గట్టిగా అంది.

"అమ్మా...!" వాణి శక్తికొద్దీ అరిచింది.

వర్ధని ఉక్రోషంగా తలెత్తింది. వాణి చేతిలోని పూలమాలను లాక్కొని విసిరేయబోయింది. వాణి ఇంకో చివరనుంచి గట్టిగా పట్టుకొంది. చెరోపక్కా లాగడంతో పూలన్నీ సగానికి తెగి చెల్లాచెదురుగా కిందపడ్డాయి. దారం ఇద్దరి చేతుల్లో మిగిలిపోయింది.

లలిత రావడం, వర్ధని చెంప పగలగొట్టడం ఒకేసారి జరిగిపోయాయి.

వర్ధని కళ్లనుండి అగ్నికణాలు రాలుస్తూ, లలితవంకా, వాణివంకా తీక్షణంగా చూస్తూ, మౌనంగా, నిటారుగా నిల్చుంది.

లలిత నోరు నొప్పి పుట్టేవరకూ తిట్టింది. ఎంతకీ వర్ధనిలో చలనం లేకపోయేసరికి తనే తగ్గింది. తన రోజువారీ కార్యక్రమంలోకి తాను తిరిగి వెళ్లింది. వర్ధని బుసలు కొడ్తూ లలితవెళ్లినవైపే చూస్తూ ఉండిపోయింది. వాణి బిక్కుబిక్కుమంటూ వర్ధని వంకే చూస్తూ లోపలికి వెళ్లింది.

★ ★ ★

వర్ధని తన ప్రమేయం లేకుండానే బడికి, తయారవ్వడం, బళ్లోకి వచ్చేయడం జరిగిపోయాయి. నిన్న వేణుతో ఉత్సాహంగా తిరిగిన పరిసరాలు ఈరోజు మళ్లీ విసుగనిపించాయి. ఇంటర్వెల్ అయ్యేవరకూ తరగతి గదిలో అసహనంగా కూర్చుంది. ఆ స్థితిలో టీచర్ అడిగిన ప్రశ్నలకు వేగంగా తోచిన దేదో సమాధానాలుగా చెప్పింది. ఆ గది లోంచి ఎప్పుడు బయటపడదామా అన్న ధ్యాసలో వున్న వర్ధని టీచర్ తనను మెచ్చుకోవడం కూడా గమనించలేదు. నిర్లిప్తంగా, నిశ్శబ్దంగా ఉండిపోయింది.

ఇంటర్వెల్ అయ్యా అవ్వగానే అలవాటు ప్రకారం తురాయి చెట్టు దగ్గరకి పరుగుతీసింది. ఎందుకో అక్కడ మనసు నిలవలేదు. వేణన్నాయి నిన్నా లంబాడీల దగ్గర చిరుతిళ్లు కొనివ్వడం గుర్తొచ్చింది. అంతే, బడి పిల్లలందరూ ఆడుకొనే మైదానంలోకి పరుగుతీసింది. ఓపక్కగా ఇసుకపై కూర్చుంది. వర్ధనికి తమ బడిలో ఎంతగానో నచ్చిన అంశం ఒకటి ఉంది. అది ప్రతి శనివారం మేడం స్వయంగా తీసుకొనే పీరియడు.

మేడం పిల్లలందరినీ తరగతి గదిలోంచి బయటకు పిలిపిస్తుంది. పిల్లలందరూ పుస్తకాలు, పలకలు సంచుల్లో పెట్టుకొని, తరగతి గదిలోని బెంచీలపై సర్దేసుకుంటారు. మేడం కబురు అందీ అందగానే అందరూ బిలబిలమంటూ ఆవిడ దగ్గరకు వెళ్తారు. మేడం బడి ఆవరణలో ఉన్న పెద్ద చెట్టు నీడలో ఇసుకపై కూర్చుని ఉంటుంది. వర్ధనికి ఆవిడ గదిలో ఆవిడ కుర్చీలో ఠీవీగా కూర్చునే మేడంని చూడాలంటేనే ఏదో బెరుకు కలిగేది. ఎప్పుడూ మొహం బిగదీసుకొని, కనుబొమలు జోడించి, తీవ్రంగా చూస్తున్నట్లుగా అన్పిస్తుంది కుర్చీలోని మేడం. వర్ధని చెట్టుకింది మేడంని దగ్గరగా గమనించడం మొదలెట్టింది.




చెట్టుకింద చతికిలపడ్డ మేడంకి, ఆ కుర్చీలో మేడంకి పోలికే లేదు. పిల్లలందర్నీ రాగానే నవ్వుతూ ఆప్యాయంగా ఆహ్వానిస్తుంది. ఒక్కొక్కరి బాగోగులను ఆత్మీయంగా ఆరా తీస్తుంది. బడిలో, పుస్తకాల్లో, పాఠాల్లో తలెత్తే సమస్యల్ని అంతర్జాతీయ సమస్యలుగా భావించి, ఈ చిన్నారుల అభిప్రాయాలకోసం చర్చ ప్రారంభిస్తుంది. పిల్లలందరినీ కూర్చోవడంలోకానీ, మాట్లాడటంలోకానీ ఏదైనా క్రమపద్ధతిని పాటించమనదు. పిల్లలందరూ వాళ్లకి తోచినట్లుగా కూర్చుంటారు. మనసుకు నచ్చినట్లు మాట్లాడుతుంటారు. ఆవిడ అన్నీ చిరునవ్వుతో వింటుంది. తరువాత మృదు గంభీర స్వరంతో చక్కటి కథ వినిపిస్తుంది. ఒక్కో శనివారం గడుస్తున్నకొద్దీ వర్ధని ఆవిడతో మానసిక సాన్నిహిత్యం పెంచుకుంటోంది. తనుమాత్రం ఎప్పుడూ కలివిడిగా మాట్లాడటానికి ప్రయత్నించడంలేదు. ఆవిడ కనిపించేట్టుగా ఓ పక్కకి ఒదిగి కూర్చుంటుంది అంతే!

మునుపటి శనివారంనాడు మేడం తన కోమల స్వరంతో కరుణరసమొలికిస్తూ రాగయుక్తంగా పాడుతూ, వివరించిన పుష్పవిలాపం గుర్తొచ్చింది. దానితోపాటే పొద్దున చెల్లాచెదురుగా పడిన కనకాంబరాలు... అందులో తన తప్పు ఏం ఉంది? ఆ చాడీకోరు పట్టుకొని లాగకపోతే అవి తెగకపోను! అంతా ఆ వాణి నిర్వాకమే! వర్ధని తనకు తానే సర్ది చెప్పుకుంటోంది. మేడం కోమలస్వరం వాణిదే తప్పంటూ వంత పాడినట్లుగా తోచింది వర్ధనికి. ఏదో రమ్యమైన భావనలో మునిగిపోయింది, కనిపించని పూల సౌరభాలు ఆస్వాదిస్తూ!

"బూ...!" వర్ధని మొహంలో మొహం పెట్టి అరిచారెవరో.

వర్ధని ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది.

గౌతం...!!

గౌతం ఓ చేయి జేబులో పెట్టుకొని, మరోచేయి నడుంమీద పెట్టుకోని ఠీవిగా నిల్చుని ఉన్నాడు.

"ఎందుకలా గుడ్లగూబలా చూస్తున్నావ్? ఇక్కణ్ణించి లే! నేనిక్కడ ఆడుకోవాలి!" గౌతం వర్ధనిని ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు.

గౌతం కంఠంలో తొణికిన తీవ్రతకు వర్ధని నిర్ఘాంతపోయింది. గౌతంవంక కళ్లు విప్పార్చి చూస్తూ ఉండిపోయింది.

"ఏయ్ నీకే చెప్పేది... లెమ్మంటున్నానా? "

వర్ధని తేరుకొని పైకి లేవబోయింది. ఆ లోపలే గౌతం జేబులోంచి చేతిని తీశాడు. మూసివున్న గుప్పిటని వర్ధని మొహాన తెరిచాడు. ఏదో ఎగిరే పురుగు వర్ధని మొహాన రెక్కలు టపటపామని కొట్టుకుంటూ ఎగిరింది. వర్ధని భయంతో వెనక్కి జరిగింది.

గౌతం చప్పట్లు కొడుతూ పగలబడి నవ్వాడు.

అది తూనీగ. తూనీగ తోకకు దారం ముడేసి, దారం చివరను తన చేతిలో ఉంచుకొన్నాడు గౌతం. దారాన్ని లాగి తూనీగని చేతిలో పట్టుకోవడం, వర్ధని దగ్గరకి వెళ్లి మొహాన గుప్పిట తెరవడం, వర్ధని బెదరగానే తూనీగని దారంపట్టి వెనక్కి లాగడం... ఇలా వర్ధనిని కాసేపు ఆటపట్టించాడు.

కొద్దిసేపటికి వర్ధని ధైర్యం కూడదీసుకుంది. గౌతం ఈసారి తన మొహాన తూనీగని వదలగానే వేగంగా కదిలి దారాన్ని ఒడుపుగా పట్టుకుంది.

ఊహించని పరిణామానికి గౌతం కంగారుగా అరిచాడు,"ఏయ్, ఏయ్... నా దారం వదులు!"

వర్ధని దారాన్ని పుటుక్కున తెంపి, తూనీగని వదిలేసింది.

గౌతం దురుసుగా వర్ధని దగ్గరకి

వచ్చాడు. "నా తూనీగని ఎందుకు వదిలేసావ్?" కోపంగా గద్దించి అడిగాడు.

"మరి ఆ తూనీగ తోకకి దారం ఎందుకు కట్టావ్?" వర్ధని అంతకంటె గట్టిగా అరిచింది.

"ఉండు... నీ పని చెప్తా!" గౌతం గిరుక్కున వెనక్కి తిరిగి పరిగెత్తాడు.

వర్ధనికి ఒక్కక్షణం భయం వేసింది. గౌతం ఎక్కడికెళ్లుంటాడు? మేడం దగ్గరికేనా? మేడం వాళ్లమ్మేగా! ఖచ్చితంగా ఆవిడ దగ్గరికే వెళ్లుంటాడు. గౌతం వాళ్లమ్మతో ఉన్నవీ లేనివీ కలిపి చాడీలు చెప్తాడేమో! వాణీలాగా! చెపితే ఆవిడ ఏం చేస్తుంది? బళ్లోంచి గెంటేస్తుందా? వర్ధనికి ఆ ఆలోచన రాగానే ఎగిరి గంతెయ్యాలనిపించింది. అవును... తనను బళ్లోంచి పంపేస్తే బావుణ్ణు. నేరుగా ఊరెళ్లిపోవచ్చు పెద్దమ్మ, పెదనాన్నలతో హాయిగా ఉండొచ్చు

వర్ధనికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. గౌతం మేడంని తీసుకొస్తాడని చూస్తూ అక్కడే కూర్చుంది. ఇంటర్వెల్ సమయం అయిపోవస్తోంది. గౌతం ఇంకా రాలేదు.

వర్ధనికి తను ఏ తరగతో గౌతంకి చెప్పనందుకు దిగులేసింది. తను గదిలోకి వెళ్లగానే వస్తాడో ఏమో?

గౌతం ఎక్కడన్నా కనిపిస్తాడేమోనని మైదానమంతా కలియచూసింది. గౌతం ఎక్కడా కనిపించలేదు.

పిల్లలందరూ తమ గొడవలో తాము న్నారు. కొందరు చిరుతిళ్లను కొంటుంటే, కొందరు మంచినీళ్లదగ్గరా, ఇంకొందరు ఆటల్లో పడి అటూ ఇటూ పరుగులెత్తుతున్నారు. వర్ధని నిరాశగా చతికిలపడింది.

"ఏయ్! ఇలా చూడు!" గౌతం వర్ధని వెనకనుండి వచ్చి ఒక్కసారిగా అరిచాడు.

వర్ధని చివ్వున తల ఎత్తింది.

గౌతం గుప్పిటతో వర్ధని మొహాన ఏవో విసిరేశాడు. అవి గాలికి ఎగురుతూ వచ్చి వర్ధనిమీద పడ్డాయి. వర్ధని అయోమయంగా చూసింది.

గౌతం క్రాపును నిర్లక్ష్యంగా ఎగరేస్తూ, కరకుగా అన్నాడు, "ఇందాక నా తూనీగని వదిలేశావుగా! ఇప్పుడు చూడు! వీటన్నింటినీ ఏం చేస్తావో మరి!"

గౌతం వర్ధని చేతిలో విసురుగా ఓ పొట్లం పెట్టి, పరిగెత్తుకొంటూ వెళ్లాడు. వర్ధని ఆశ్చర్యంగా అతను వెళ్లినవైపే చూస్తూ ఉండిపోయింది.

ఇంతలో గంట గణగణమని మోగింది. వర్ధని ఈ లోకంలోకి వచ్చిపడింది. కుతూహలంగా ఆ పొట్లాన్ని గబగబా విప్పింది. దాంట్లో ఒకదానిమీదకు ఒకటి గబగబ కదులుతున్న తూనీగలు! రెక్కలు తెగిన తూనీగలు! నీలంవి! ఆకుపచ్చవి! నారింజరంగువి!

వర్ధనికి ఏదో అనుమానం వచ్చి చుట్టూ చూసింది. ఇందాక గౌతం తనమీదికి విసిరేసింది వాటి రెక్కలు. వర్ధని చుట్టూ చెల్లాచెదురుగా పడివున్నాయి.

వర్ధని మనసు విలవిలలాడిపోయింది. ఆ పొట్లంలోని తూనీగల్ని నెమ్మదిగా పచ్చికమీదకు వదిలి, తరగతి గదిలోకి వెళ్లింది.

ఆరోజంతా వర్ధని మనసులో ఆ తూనీగలే మెదులుతూ ఉన్నాయి. తన మూలంగానేగా గౌతం అలా చేశాడు! వర్ధని దిగులుగా అనుకొంది.

★ ★ ★

"ఇదుగో... మిమ్మల్నే! గబగబా ఇలా రండి! ఈరోజు నేను ఓ కొత్తాట నేర్పిస్తాను. ఆడేవాళ్లు ఎవరో తొందరగా చెప్పండి!" వాణి ఉత్సాహంగా పిలవడంతో వర్ధని కూడా కుతూహలంగా అటువైపు చూసింది.

ఆ సాయంకాలం వాణి ఎప్పటిలానే వీధిలో పిల్లల్ని పోగేసి, ఏవేవో ఆటలు ఆడుతోంది. వర్ధని వాళ్లనే గమనిస్తూ వాకిట్లో నిల్చునివుంది.




వాణి చేతిలో ఏవో కాగితం ముక్కలు పట్టుకొని ఉంది. పిల్లలందరి దగ్గరా డబ్బు లంటూ కొన్ని గులకరాళ్లు ఇప్పించుకొని, ఒక్కొక్కరికీ ఒక్కో కాగితం ఇచ్చింది. వాణి పరిగెత్తుకొంటూ వచ్చి వర్ధని చేతిలో కూడా ఒకటి పడేసి వెళ్లింది.

వర్ధని ఆశ్చర్యంగా దానివంక చూసింది. ఆ చిన్న కాగితంమీద ఏవేవో అంకెలు న్నాయి. ఒకటి రెండుచోట్ల సన్నని రంధ్రాలు చేసివున్నాయి.

"ఆగండాగండి!" వాణి కేకేయడంతో వర్ధని ఆవైపు చూసింది.

"ఒక్కొక్కళ్లే ఎక్కాలి! నెమ్మదిగా ఎక్కాలి! తోసుకోవద్దు! బయలుదేరుతున్నాం! గబగబ ఎక్కండి!" వాణి కేకలు పెట్టింది.

వాణి చెప్పినట్లుగా ఒక్కొక్కళ్లు వచ్చి ఒకరి గౌను అంచు మరొకరు పట్టుకొని వరుసగా నిలబడ్డారు.

"డుర్ డుర్... పాం... పాం... డుర్ డుర్" వాణి నోటితో శబ్దాలు చేసింది.

"ఏం ఆటే ఇదీ? " ఓ అమ్మాయి కుతూహలం అణుచుకోలేక అడిగింది.

"బస్సాట! నువ్వు ఏ వూరెళ్లాలో చెప్పు ఆ ఊళ్లో దింపేస్తాను!" వాణి బస్సు చక్రం తిప్పుతున్నట్లు అభినయిస్తూ అంది.

వాళ్లంతా హడావుడిగా ఆ ఆటలో మునిగిపోయారు. వాళ్లనే గమనిస్తూ నిల్చున్న వర్ధనికి హఠాత్తుగా ఓ విషయం తట్టింది. నిన్న వేణన్నాయి వచ్చినప్పుడు తను ఊరి నుంచి బస్సులో వచ్చానని చెప్పాడు కదూ? అంటే బస్సెక్కి తమ ఊరికి వెళ్లచ్చున్న మాట! వర్ధని వాణివైపు తిరిగి గట్టిగా అరిచింది.

"నీ బస్సు మన ఊరు పోతుందా? "

వాణి తన బస్సుని చుట్టూ తిప్పుకొని, వర్ధని దగ్గరికి వచ్చి ఆపింది.

"పోతుంది... అహ... పోదు పోదు! పొద్దున నాన్న ఊరినుంచి వచ్చాడే అలాంటి బస్సయితే పోతుంది" వాణి అటూ ఇటూ గెంతుతూ అంది.

"అది ఎక్కడ ఉంటుంది? " వర్ధని ఆనందం అణచుకుంటూ అడిగింది.

"ఏమో నాకేంతెలుసు? " వాణి కాసేపు ఆలోచించి, పెదవి విరిచింది. చేతిలో గులకరాళ్లను చూపెడుతూ మళ్లీ అంది, "అయినా దాంట్లో వెళ్లాలంటే ఇలాంటి డబ్బులు పనికిరావు. నిజ్జం డబ్బులు బోలెడు కావాలంట!" వాణి మళ్లీ తన ఆట లోకి వెళ్ళిపోయింది.

వర్ధని ఆలోచనలో పడింది. డబ్బులు ఉంటే తమ ఊరికి వెళ్లచ్చున్నమాట! ఈ లలితకి, వాణి, ముకుందానికి అందరికీ దూరంగా! హాయిగా...! కానీ డబ్బులు ఎక్కణ్ణించి వస్తాయి? అసలెక్కడ ఉంటాయి? వర్ధని ఆ విషయం ఛేదించే ప్రయత్నంలో పడింది.

అయితే ఆ పూటే వర్ధనికి కావాల్సిన డబ్బులు అమిరాయి.

ఆ రోజు రాత్రి ముకుందం బయటనుంచి రాగానే చొక్కా విప్పి, మంచం కోడుకు తగిలించాడు. స్నానం చేయడం, భోజనం చేయడంలాంటి కార్యక్రమాల్లో పడిపోయాడు.

వర్ధనికి అందరికీ ముకుందమే డబ్బులు ఇస్తూ ఉంటాడన్నది జ్ఞాపకం వచ్చింది. వేణన్నాయికి, మురళన్నాయికి, లలితకి కూడా! ఎప్పుడిచ్చినా తన చొక్కా జేబు లోంచే తీసి ఇస్తాడన్నది గుర్తొచ్చింది.

మెల్లిగా వెళ్లి గోడకు ఎత్తిపెట్టి ఉన్న మంచంపక్కన నిల్చుంది. మునివేళ్లపై నిలబడి చొక్కా జేబులో చేయిపెట్టింది. చేతిలోకి వచ్చిన డబ్బుల్ని తీసుకొని, గబుక్కున గౌను కింద పెట్టుకొని, పరుగుతీసింది.

తన పుస్తకాల సంచి తెరిచి, డబ్బును పుస్తకాల అడుగున దాచింది. వేణన్నాయి తెచ్చినప్పుడు దాచిన అరిసె ముక్క ఇంకా అక్కడే ఉంది. వర్ధని తృప్తిగా చూసుకొని,

సంచిని యథాస్థానంలో పెట్టేసింది.

వర్ధనికి ఆ పూట ఎంతో సంతోషంగా ఉంది. లలిత పళ్లెంలో పెట్టిచ్చినవన్నీ గబగబా తినేసింది. తన పక్కమీదకెళ్లి పడుకొంది. వర్ధనికి గాలిలో తేలిపోతున్నట్టుగా ఉంది. రేపు ఎలా ఉండబోతోందో! వర్ధని ఓ క్షణం అనుకొంది. మరుక్షణం వర్ధనికి తెలీకుండానే వర్ధని ఆలోచనలు గౌతంవైపు, అతని ప్రవర్తనవైపు తిరిగాయి. అది కూడా కొద్దిసేపే. మళ్లీ తన ఊరి జ్ఞాపకాలనే జోలగా చేసుకొని హాయిగా నిద్రపోయింది.



వర్ధని బస్సు దిగగానే కోటయ్యా పరిగెత్తుతున్నట్లుగా వచ్చి, వర్ధనిని హత్తుకొన్నాడు.

వర్ధని కోటయ్యను వాటేసుకొని వెక్కి వెక్కి ఏడ్చింది ఇన్నాళ్ళ దుఃఖం కరిగిపోయేట్లుగా. జయమ్మ దడి దగ్గరే ఎదురొచ్చింది. తనూ వర్ధనితోపాటు ముక్కు ఎగబీల్చి కంటనీరు కార్చింది. వాళ్లిద్దర్నీ చూసిన కోటయ్య కళ్లు తడిగట్టాయి.

ముందుగా జయమ్మే తేరుకొంది. కళ్లు చీరకొంగుకు తుడుచుకొంటూ అంది, "ముదనట్టపు చదువులు ముదనట్టపు చదువులని! ఏ క్షణాన ఊరుదాటిందో ఊలుబంతిలా ఉండే పిల్ల మునక్కాడలా తయారయ్యింది! నా తల్లీ ఇలా రావే!" అంటూ కోటయ్య దగ్గరనుంచి వర్ధనిని తీసుకొంది.

"ఎట్టా ఉండేదానివి ఎట్టా అయిపోయావూ? ఇంక ఎవరు వచ్చి పంపమని అడిగినా నిన్ను ఎక్కడికీ పంపేదేలేదు! ఆ...!" కోటయ్య పైపంచెను దులిపి మళ్లీ భుజాన వేసుకొన్నాడు.

"రామ్మా... ఎప్పుడు తిన్నావో ఏవో! బిడ్డవి ఎట్టా తోటకూర కాడలా వాడిపోయావో!" అంటూనే వర్ధనిని చేయి పట్టుకొని వంటింట్లోకి తీసుకెళ్లింది.

వేడి వేడి అన్నంలో బీరకాయ పచ్చడేసి, అప్పుడే తీసిన వెన్నముద్ద కలిపి, గోరుముద్దలు చేసి తినిపించింది. గడ్డ పెరుగుతో, ఆవకాయతో తృప్తిగా భోంచేసింది వర్ధని. జయమ్మ అన్నం పెడుతూనే వర్ధనిని అక్కడి విశేషాలు ఆరా తీసింది.

"ఆ మహాతల్లి బిడ్డ కడుపు చూసి ఇంత ముద్దయినా తినేట్టు చూడకూడదూ? ఎట్టా మాడ్చిందో చిట్టితల్లిని!" లలితను దెప్పుతూనే వర్ధని చిక్కిపోయినందుకు మరోసారి కంటతడి పెట్టింది జయమ్మ.

ఆ చల్లని వెన్నెల రాత్రి వర్ధని తీయని కలలతో తెల్లవారింది.

హఠాత్తుగా వర్ధని మొహాన చల్లటి నీళ్లు వచ్చి పడడంతో వర్ధని ఉలిక్కిపడి చుట్టూ చూసింది.

"ఏంటే పొద్దుటే నీ కలవరింతలు?" లలిత వర్ధని మొహంలో మొహం పెట్టి, వర్ధని భుజాలు కదుపుతూ అంటోంది.

వర్ధని లలిత మొహంలోకి అయోమయంగా చూసింది. పెద్దమ్మ, పెదనాన్న ఏరీ? వర్ధని చుట్టూ చూసింది. లలిత వెనకే వాణి నీళ్లగ్లాసు పట్టుకొని నిల్చొని ఉంది. వర్ధని ఒక్కసారిగా ఈలోకంలోకి వచ్చి పడింది. మొహాన్ని చేత్తో తుడుచుకుంటూ మంచంమీద లేచి కూర్చుంది.

ఇంతలో వాణి కెవ్వున అరిచింది, "అమ్మా... అక్క పక్క తడిపేసింది. ఛీ! యాక్!" వాణి ముక్కు మూసుకొంటూ, ఓ గెంతు గెంతి దూరంగా నిలబడింది.

"ఇంక ఇది కూడా మొదలుపెట్టావా?

రోజురోజుకీ అధ్వాన్నంగా తయారవుతున్నావేమిటే నువ్వు?" లలిత చేత్తో నుదురుమీద చిన్నగా కొట్టుకుంటూ అంది.

వర్ధని సిగ్గుతో బిక్కచచ్చిపోయింది. గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయింది.

లలిత వర్ధనిని నేరుగా బాత్‌రూంలోకి తీసికెళ్లి బట్టలు మార్చింది.

★ ★ ★

లలిత వంటింట్లోకి వెళ్లింది. వర్ధని వచ్చి వాకిట్లో మెట్లమీద చతికిలబడింది. వాణి వచ్చి వర్ధనిని పలకరించింది. జడలు ముందుకేసుకుంటూ, కళ్లు తిప్పుతూ అంది,

"పత్రికోసం వెళ్తున్నా, నువ్వూ వస్తావా?"

"పత్రా? దేనికి?" వర్ధని ఆశ్చర్యంగా అడిగింది.

"అయ్యో, నీకింకా తెలీలా? ఇవ్వాళ వినాయకుడి పండగ! నేను చూడు అప్పుడే తలంటి పోసుకొన్నాను. అమ్మ మనకోసం కొత్తగౌనులు తెచ్చింది!" చివరి మాటలు రహస్యం చెపుతున్నట్టుగా అంది వాణి.

వర్ధని మొహం వెగటుగా పెట్టింది.

లలిత వాణిని కేకేసింది. లోపలికెళ్లి ఏదో మాట్లాడి, మళ్లీ రివ్వున బయటకు పరిగెత్తింది వాణి.

వర్ధనికి చవితి పూట తమ ఊళ్లో పత్రి సంపాదించడంకోసం తాము చేసే హడావుడి మనసులో మెదిలింది. ఒకసారి చెరువు గట్టున ఉన్న ఉమ్మెత్త కాయలు కోయబోయి సరళ బురదలో జర్రున జారి పడింది కూడాను!

ఆ సంఘటన గుర్తుకు రాగానే వర్ధని మొహాన నవ్వొకటి కదలాడింది. సరళ కొత్త బట్టలు పాపం ఎలా తయారయ్యాయో! మొహంనిండా, చేతులనిండా బురద! ఇంకా నయం చెరువులో పడలేదు అన్నారు పెద్దాళ్లంతా. వేణన్నాయి అయితే అక్కడికి ఇంకోసారి వెళితే వీపు విమానం మోత మోగిస్తానన్నాడు. ఇప్పుడు సరళ ఏం చేస్తుంటుందో... ఈపాటికి పత్రి తీసుకొచ్చేసి ఉండదూ?

"ఏంటీ అలా మూగి మొద్దులా కూర్చున్నావ్? కళ్లు తెరుచుకొనే కలలు కంటున్నావా ఏంటీ?" లలిత మళ్లీ వచ్చింది.

వర్ధని సమాధానం చెప్పేలోపలే వర్ధని చేయి పట్టుకొని బాత్‌రూంలోకి తీసుకెళ్లింది. పనిమనిషి కుంకుడుకాయరసం పోస్తుంటే లలిత తల రుద్దుతోంది.

వర్ధనికి ఇదొక పెద్ద శిక్షాసమయం. తను అయిష్టంగా అటూ ఇటూ కదలడం, కుంకుడురసం కళ్లల్లో పడడం, మంటపుట్టి కేకలు పెడుతూ ఏడవడం తలంటుకొన్న ప్రతీసారీ జరగాల్సిందే. వర్ధని కొన్నిసార్లు చాకచక్యంగా లలితను విడిపించుకొని పారిపోయేది. పనిమనిషి, లలిత కలిసి మళ్లీ లాక్కొచ్చి కూర్చోపెట్టేవారు. ఈరోజు వర్ధని కాస్తకూడా కదిలే అవకాశం లేకుండా పనిమనిషి గట్టిగా పట్టుకొంది.

"చిందులు తొక్కావంటే వొళ్లు చీరేస్తాను జాగ్రత్త!" లలిత హెచ్చరించింది. వర్ధనికి జయమ్మ కూడా కుంకుడురసంతోనే తలంటుతుంది. అది వర్ధనికి ఎంతో హాయిగా ఉంటుంది. మళ్లీ మళ్లీ అడిగి తల రుద్దించుకొనేది. జయమ్మ నలుగుపెడితే మల్లెలాంటి వర్ధని గులాబి పూవులా తయారయ్యేది. జుట్టు చిక్కు తీయడంలో, జడలు వేయడంలో జయమ్మ నచ్చినట్లుగా లలిత నచ్చలేదు వర్ధనికి. వర్ధని జయమ్మకు ఇచ్చినంత సహకారం లలితకు ఇయ్యకపోవడంవల్లనే ఆ ఇబ్బందంతా వచ్చేది. అదే వాణి లలితతో కబుర్లు చెపుతూ, హాయిగా తలంటించుకొంటుంది. ఏమైనా తలంటుకొన్న ప్రతిసారీ వర్ధనికి పెద్దమ్మ జ్ఞాపకాలు వెచ్చటి కన్నీరులా వేడినీళ్లల్లో కలిసిపోతుంటాయి. ఆరోజూ మండుతోన్న కళ్లతో, జుట్టునిండా చిక్కులతో బాత్‌రూంలోంచి బయటకు వచ్చింది వర్ధని.

వర్ధనికి చవితినాడు ఉత్సాహమంతా పత్రి తీసుకురావడం, ఉండ్రాళ్లు తినడంవరకే. మిగిలిన కార్యక్రమాలు అసలు మనసుకు పట్టవు. ఈరోజు పత్రి సమీకరించే ఉత్సాహం లేనేలేదు.

వాణి మోయలేక మోయలేక పత్రి తీసుకొచ్చింది. తన స్నేహితులు, తను ఏ ఆకు ఎలా సంపాదించారో, ఏ పూలు ఎలా సాధించారో వాణి ఉత్సాహంగా చెప్తోంది లలితతోపాటు ఉండ్రాళ్లు చేస్తూ.

వర్ధనికి వాణి వాలకం చూసి నవ్వొచ్చింది. ఈ వాణివన్నీ బడాయి మాటలు! చేసేవన్నీ బడాయి పనులు! ఆకులు, పూవులు కూడా అంత బరువుంటాయా ఎక్కడైనా? వర్ధని తతంగాన్నంతా నిర్లిప్తంగా చూస్తూ ఉండిపోయింది.

ఈ ఏడాది పత్రి ఎవరు తీసుకొచ్చారో? పెద్దమ్మ ఈపాటికి ఉండ్రాళ్లు, కుడుములు చేసేసి ఉండదూ? ఎప్పుడైనా మొదట వినాయకుడికి ఉండ్రాళ్లు పోసేది తనేకదూ? ఇప్పుడు ఎలా చేస్తారో? ఎవరు పోస్తారో? వర్ధని మనసు బాధతో మూలిగింది.

వాణి తన పుస్తకాలు తీసుకొచ్చి పూజ చేసే పీట పక్కన పెట్టింది. పూజయ్యాక వాటిమీద పసుపుతో సున్నా చుట్టి,




మధ్యలో కుంకుమ పెడతానని చెపుతోంది లలిత. వాణి తనే పెడతానని మారాం చేస్తోంది.

"సరేలే! నువ్వు పెడుదువుగానీ అక్క పుస్తకాలు కూడా తీసుకురా పో!"

"నేనెందుకు తేవాలి? తననే తెమ్మను!" వాణి తెంపరిగా జవాబిచ్చింది.

"పండగపూట కూడా గిల్లికజ్జాలు మానరా? నేనే తెస్తానుండు!" అంది లలిత. వర్ధని లలితను వారించ బోయేలోపలే లలిత వర్ధని సంచిని చేతిలోకి తీసుకొంది. సంచిలో చేయి పెట్టిన లలిత తేలు కుట్టినట్లు కెవ్వున అరిచింది. వర్ధని భయంతో మూలకు నక్కింది. ముకుందం పరిగెత్తుకొంటూ వచ్చాడు ఏమయ్యిం దంటూ.

"రాత్రి మీ చొక్కా జేబులో డబ్బులు ఏమ య్యాయోనని కంగారు పడ్డామా! ఇవిగోండి మీ వెయ్యి రూపాయిలు! అరిసెలోని నెయ్యంతా అయ్యి ఎలా తయారయ్యాయో!' ' లలిత పొత్తిలాపట్టుకొన్న డబ్బును ముకుందానికి చూపిస్తూ అంది.

లలిత అనగానే ఏదో అర్థమయినట్లు, "అమ్మో!" అంది వాణి కళ్లు పెద్దవి చేసి, గుండెలమీద చేయి వేసుకొంటూ.

లలిత డబ్బు ముకుందం చేతిలో పెట్టి, విసురుగా వర్ధని వైపు తిరిగింది.

"చెప్పవే! చెప్పు! దొంగతనం చేశావా? ఎందుకు చేశావీ పని? ఇంకోసారి ఇలా చేస్తావా? చెయ్యనని చెప్పు!" లలిత కొట్టడా నికి చెయ్యి ఎత్తింది.

వర్ధని బిగ్గరగా ఏడుస్తూ డాబామీదకు పరుగెత్తుకెళ్లింది. డాబా మూలమీద నిల్చుని, ఆకాశంవైపు చూస్తూ గట్టిగా అరి చింది.

'పెద్దమ్మా, నన్నిక్కడికి ఎందుకు పంపే శావ్? పెద్దమ్మా! నన్నీ రాక్షసి దగ్గర్నుంచి తీసికెళ్లిపో! పెదనాన్నా... నేను నీ మాట ఎప్పుడైనా వినలేదా? నేనేమైనా చెడ్డపి ల్లనా? మరైతే నన్నెందుకు వీళ్లతో తీసుకు రానిచ్చావ్ పెదనాన్నా? పెద్దమ్మ ఊరు కున్నా నువ్వైనా నన్ను అక్కడే ఉంచేయకూ డదా... పెదనాన్నా! నన్ను తీసుకెళ్లిపోండి పెదనాన్నా... పెద్దమ్మా...!" వర్ధని గుండె లవిసేటట్లు ఏడ్చి, ఓపికలేక కింద కూలబ డింది.

"ఎందుకే అలా కొండెక్కి కూచున్నావ్? ఇప్పుడు నిన్నేమన్నానని? రా! రెటమతం మాని కిందికి దిగిరా! పండగపూట మొండి తనం చేయమాక!" ఎప్పుడు వచ్చిందో కానీ లలిత వర్ధనివంక తీక్షణంగా చూస్తూ అంది.

వర్ధని లలితను కోపంగా చూసి, తల తిప్పుకుంది.

లలిత కొద్దిసేపు బతిమిలాడింది. కొద్ది సేపు బెదిరించింది. కొద్దిసేపు కోప్పడింది. వర్ధని తనకు సంబంధించిన విషయం కానట్లు మౌనంగా కూర్చుండిపోయింది. చివరికి లలితకే విసుగుపుట్టింది.

"గుబులు మారి గురవక్క! కాసేపున్న బుద్ధి కాసేపుండదు! దీన్ని దారికి తీసుకురా వడమేమోగాని నాపని అయిపోతోంది!" లలిత గొణుక్కుంటూ కిందికి దిగిపో యింది.

'తిక్క కుదిరింది! నీ మాట నేను వింటా ననుకొన్నావా? ' వర్ధని లలితను వెక్కిరిస్తూ కచ్చగా అనుకొంది.

వర్ధని మళ్లీ గోడనానుకొని కూర్చుంది. ఎండ తీవ్రత పెరుగుతోంది. ఆ చివర ఉన్న బొప్పాయి చెట్టు ఆకులు డాబాకి ఓ పక్కగా వాలుతాయి. వర్ధని వెళ్లి, ఆ ఆకుల్ని ఎడంచేసి, వాటి మధ్యలో కూర్చుంది. పెద్ద పెద్ద ఆకులు నీడనిస్తున్నా, పొడవాటి కాడల మధ్యనుండి ఎండ పడుతూనేవుంది.

ఈసారి డాబాపైకి వాణి వచ్చింది, చేతిలో పళ్లెంతో!

"ఇదుగో అక్కా ప్రసాదం! చలిమిడి, వడ

పప్పు, కొబ్బరి ముక్కలు, ఉండ్రాళ్లు, కుడుములు..." వాణి ఊరిస్తున్నట్లుగా ఒక్కో పేరు నెమ్మదిగా చెప్పింది. వర్ధని ఆకలి చరచరలాడుతూంటే తన కోపాన్ని మింగేయబోయింది. అంతలోనే వర్ధనికి వాణి ముక్కు మూసుకొని, మంచానికి దూరంగా ఓ గెంతు గెంతడం గుర్తొచ్చింది.

"నాకేం వద్దుపో!" వర్ధని కోపంగా కసిరింది.

ఇంకో రెండుసార్లు అడిగి, వర్ధని వద్దన్నాక వాణి తన చేతిలోని పళ్లాన్ని వర్ధని పక్కన పెట్టింది.

"నీ ఇష్టం! తీసుకుంటే తీసుకో! లేకపోతే లేదు! అమ్మ నీకు ఇమ్మంది కదాని తెచ్చాను! నే పోతున్నా!" వాణి విసురుగా అని, వేగంగా మెట్లవైపు వెళ్లింది. వర్ధనికి లలితమీదా, వాణిమీదా చివరికి తన నిస్సహాయతమీదా కోపం తారాస్థాయికి చేరుకొంది. దఢాల్న ఆ పళ్లాన్ని లాగి వెళుతోన్న వాణిమీదకు కసికొద్దీ విసిరేసింది. పళ్లెం వేగంగా వెళ్లి వాణి కాలికి బలంగా కొట్టుకుంది.

వాణి బ్యారుమంటూ అరుస్తూ కిందికి పరుగుతీసింది. వాణి గొడవ గొడవగా ఏడవటం, లలిత సముదాయించడం వర్ధనికి పైకి వినిపిస్తున్నాయి. వర్ధని మనసు అప్పటికి శాంతించింది. 'అమ్మ కూచి! పిల్ల రాక్షసి! చాడీకోరు! చీమిడిముక్కు! బాగయ్యింది!' కసికసిగా వాణిని తిట్టుకుంది వర్ధని.

వర్ధని కోపం వచ్చినంత వేగంగా తగ్గిపోయింది. ఎండ తాకిడి వలన మొహమంతా కమిలిపోయింది. చెమట్లు పట్టి చికాకుగా ఉంది. బొప్పాయి ఆకులనుంచి ఏదో వెగటు వాసన వస్తోంది. బొప్పాయి కాడల మీద బారులు తీరి ప్రయాణం చేస్తోన్న గండు చీమల దండును చూస్తూ కాసేపు గడిపింది. మెల్లిగా కడుపులో నకనకలు బయలుదేరాయి. వర్ధనికి కళ్లు బైర్లు కమ్ముతున్నట్లుగా అనిపించింది.

వర్ధని మెల్లిగా, మోకాళ్లమీద పాకుతూ ఇందాక చెల్లాచెదురుగా పడిన ప్రసాదం దగ్గరికి వెళ్లింది. ఉండ్రాళ్లని చూడగానే నోట్లో నీళ్లూరాయి. ఒక్కోదాన్నీ తీసుకొని గౌనుకి తుడుచుకొని, నోట్లో వేసుకుంది. వర్ధనికి ప్రాణం లేచొచ్చినట్లయింది. చలిమిడిని అడుగు మట్టి అంటకుండా పైపైన తీయడానికి జాగ్రత్తగా ప్రయత్నిస్తోంది. ఇంతలో వర్ధని మీద పొడవాటి నీడ పడింది.

"కిందికి వస్తే గారెలు, పాయసం కూడా తినొచ్చు!" గంభీరంగా పలికిందో కంఠం. వర్ధని ఆశ్చర్యంగా తలెత్తింది.

ముకుందం!

వర్ధని తప్పుచేస్తూ పట్టుబడిన దానిలా తల వంచుకొని లేచి నిలబడింది.

"వెళదాం పద!" ముకుందం మృదువుగా అన్నాడు.

వర్ధని మంత్రముగ్ధురాలిలా మౌనంగా ముకుందం వెనకే కిందికి నడిచింది.

★ ★ ★

కొత్త బళ్లో చేరినప్పటినుంచీ వర్ధనికి ఇంకో బాధ మొదలయ్యింది. పంతులు బడిలో చదివేదేదో అక్కడే చదివేసి, పంతులికి అప్పచెప్పేసి వచ్చేవాళ్లు. రాయడం, దిద్దడం అన్నీ బడిలోనే పూర్తి చేసుకొని బయటపడేవారు. ఇక్కడ అలా కాదు. ప్రతీరోజూ ఇంటికొచ్చాక రాయాలి. చదవాలి.

వర్ధనికి తమ ఊళ్లో బడి అయ్యాక చెరువు గట్టుమీద కాసేపు కూర్చోవడం అలవాటు. ఇక్కడ కూడా గుట్టల వరుసను చూసినప్పుడల్లా చిన్న చిన్న గులకరాళ్లలాగా కనిపిస్తోన్న బండరాళ్లను దగ్గరనుండి చూడాలని, తాకి రావాలని బలమైన కోరిక. అయితే ఈ ఊరొచ్చిన మొదటిరోజే ఆ అర్హత పోగొట్టుకుంది. తను ఇప్పుడు ఈ ఇంటి ప్రహరీ గోడలు దాటి వెళ్లకూడదు.




వెళ్లదు.

బడినుంచి రాగానే చిరుతిళ్లు పెట్టి, కాసేపు ఆడుకొని రమ్మనేది లలిత. వాణి ఆ మాట లలిత నోట్లో ఉండగానే తుర్రుమనేది. వర్ధని ఆడుకోవడం అనే సంగతి ఊరి జ్ఞాపకాల్లో ఓ జ్ఞాపకం. అంతే! అయితే అప్పుడప్పుడూ వెళ్లి వాణి వాళ్ల ఆటల్ని గమనిస్తూ నిల్చుంటుంది. లలిత తన సాయంకాలం పనులు పూర్తిచేసుకొని, ఇద్దర్నీ లోపలికి పిలుస్తుంది. వర్ధని లలిత పిలిచినప్పుడు నిర్లక్ష్యంగా విని ఊరుకుంటుంది. లలిత పిలవడానికన్నా ముందో, ఆ తరువాతో మాత్రమే లోపలికి అడుగు పెడుతుంది. చాలాసార్లు వీధిలో, ఇళ్లల్లో దీపాలు వెలిగి, పిల్లలందరూ ఇళ్లల్లోకి వెళ్లిపోయాక, ఇంట్లోకి వచ్చేది.

వర్ధనికి ఇక్కడికి వచ్చాక అందమైన ఉదయాలు, ఆహ్లాదమైన సాయంకాలాలు అన్నీ ఒక్కలాగే ఉంటున్నాయి. నీరసంగా! నిస్తేజంగా!

అవన్నీ వర్ధనికోసం లలిత పాడే సుప్రభాతాలతోనూ, వినిపించే స్తోత్ర పాఠాలతోనూ నిండిపోతున్నాయి. లలిత తిట్ల పురాణంలో దిట్ట అని వర్ధనికి ఇక్కడికొచ్చాకే తెలిసింది.

ప్రతీ సాయంత్రం వర్ధని చేత చదివించడానికి, రాయించడానికి లలిత మూడు చెరువుల నీళ్లు తాగాల్సి వస్తోంది. ఫలితం మెలిపెట్టబడిన వర్ధని చెవులు, కందిపోయిన వర్ధని బుగ్గలు, నీళ్లింకిన కళ్లు మాత్రమే!

పరీక్షలు దగ్గర పడుతున్నకొద్దీ లలితకు వర్ధని గురించిన ఆందోళన ఎక్కువవుతోంది. అసలే బడిలో చేర్పించిన రోజు కూడా మొద్దురాచిప్పలా ప్రవర్తించింది. ఇప్పుడెలా చేయబోతోందోనన్న ఆరాటం లలితను నిలవనీయడంలేదు.

ప్రతిరోజు పక్కవీధిలో ఉన్న వర్ధని తరగతి అబ్బాయి దగ్గరకు వెళ్లి, జరిగిన పాఠాల్ని, రాయించిన ప్రశ్నల గురించి తెలుసుకు వస్తోంది. తనే స్వయంగా వర్ధని నోట్సులో రాసి ఉంచుతోంది. ఏదోరోజు వర్ధని కుదురుగా కూర్చోకపోతుందా అని లలిత ఆశ.

ఓరోజు లలిత పోరు భరించశక్యం కాకపోవడంతో వర్ధని తన తెలుగువాచకం తీసి వళ్లో పెట్టుక్కూర్చుంది. యధాలాపంగా పుస్తకం తిరగేస్తున్నా మనసుమాత్రం ఎక్కడో ఉంది. ఆ పుస్తకంలో ఉండే రంగు రంగుల బొమ్మలు కూడా వర్ధని దృష్టికి ఆనడంలేదు. లలిత వంటింట్లో పనిలో ఉంది. వాణి వర్ధని ఎదురుగా బుద్ధిగా కూర్చుని, ఇంకా బుద్ధిగా చదువుకుంటోంది. వాణి పుస్తకంలోంచి తలెత్తి వర్ధనిని అడిగింది, "అక్కా, రెండు నాలుగులు ఎనిమిదే కదూ? "

వర్ధని మాట్లాడలేదు. వాణి మళ్లీ మళ్లీ రెట్టించి అడిగింది. వర్ధని చిరాగ్గా అంది.

"నీ తలకాయ్! ఎనిమిది కాకపోతే తొమ్మిది అవుతుందా? "

"చూడమ్మా! నేను రెండో ఎక్కం రాపోతే అక్కని అడిగాను. నీ తలకాయ్, చదువురాని మొద్దు, కదలలేని ఎద్దు అంటోంది" వాణి వీధంతా వినపడేలా అరిచింది.

"ఏయ్... ఏయ్... అవన్నీ నేనెక్కడ అన్నాను? " వర్ధని కంగారుగా అంది.

"అమ్మా చూడవే! నన్ను తిట్టి ఇప్పుడేమీ తెలీదంటోంది!" వాణి మళ్లీ కేకలు పెట్టింది.

"పోపు మాడిపోతుంది. కాసేపు కుదురుగా కూర్చోండి!" లలిత బదులుగా అరిచింది. వర్ధనికి ఉక్రోషం వచ్చింది. పుస్తకం పక్కన పడేసి వాణి దగ్గరకి కోపంగా వెళ్లింది. "ఏయ్, ఎందుకలా చాడీలు చెపుతున్నావ్! అన్నీ అబద్ధాలే మాట్లాడుతున్నావ్! నాగ్గానీ కోపం వచ్చిందా...? "

వాణి మళ్లీ కేకలు పెట్టింది, "చూడమ్మా! అక్క నన్ను ఏంటేంటో అంటోంది!"

వర్ధనికి కోపం కట్టలు తెంచుకొంది. గబుక్కున వాణి చేతిలోని పుస్తకం లాక్కోబో

యింది. వాణి పుస్తకం అట్టను దొరకబుచ్చు కుంది. ఇద్దరి మధ్యలో పుస్తకం అట్ట రెండుగా చిరిగిపోయాయి. వాణి గోలగో లగా ఏడుస్తూ లలిత దగ్గరికి పరిగెత్తింది. లలిత ఇద్దరి గొడవల్లో పడి వంట పాడవు తోందని ఆందోళనలో ఉంది. ఎలాగో మాట విని కుదురుగా కూర్చున్నారని కాస్త సమాధానపడి, వంట పూర్తిచేద్దామనుకునే లోపల ఈ గొడవ. వాణి ఏడుపుతో వొళ్లు మండి చెరో రెండు అంటించింది. వాణి టక్కున ఏడుపు మానేసింది. మళ్లీ చదువు కోవడానికి కూర్చుంది.

వర్ధనికి మొదటి దెబ్బ చురుకుగానే తగి లింది. రెండోదెబ్బ తగిలినట్లుగానే అనిపిం చలేదు. వళ్లంతా బిగదీసుకుని గోడనాను కొని కూర్చుంది. కళ్లు ఎండిన కొలనులాగా ఉన్నాయి. తలంతా భారంగా ఉంది.

'పెద్దమ్మా మీరు నన్ను ఇక్కడికి రానీయ కపోతే ఎంత బాగుండేది పెద్దమ్మా. వేణ న్నాయి అబద్దాలు చెప్పి, నన్ను వదిలేసి వెళ్లాడు. పెదనాన్నా నువ్వైనా వచ్చి నన్ను తీసుకెళ్లు. పెదనాన్నా... ఈ బడి, ఈ పుస్త కాలు ఇవన్నీ ఏం అక్కర్లేదు! మీరుంటే చాలు! మన పంతులు బడికే వెళ్తాను! ఆయన మాట బుద్ధిగా వింటాగా పెద నాన్నా! ఏ గొడవా చేయనులే పెద్దమ్మా!' వర్ధని మనసు ఆక్రోశిస్తూనే ఉంది. వర్ధని చేతులు అప్రయత్నంగానే పక్కగా పడివున్న తెలుగు వాచకాన్ని ఒళ్లోకి తీసుకొన్నాయి.

ఆలోచనలు సాగుతోన్నంత వేగంగా పుస్త కాన్ని ముక్కలు ముక్కలు చేస్తున్నాయి. పుస్తకమంతా ముక్కలుగా మారినా వర్ధని తేరుకోలేదు. మళ్లీ మళ్లీ ఆ ముక్కల్నే చింపుతూ కూర్చుంది.

వాణి మళ్లీ కెవ్వున కేకేసింది. "అమ్మా... అక్క చూడు పుస్తకాన్ని ఎలా చింపి పోగులు పెడుతోందో!"





లలిత వంటింట్లోంచి వచ్చేలోపలే వర్ధని వేగంగా మంచం కిందికి దూరింది.

పొద్దున వర్ధనికి మెలకువ వచ్చేసరికి మంచంమీద ఉంది. వర్ధనికి రాత్రి జరిగిన సంఘటన అంతా పీడకలలా గుర్తొచ్చింది. నిజంగానే తను తెలుగు వాచకాన్ని చింపే సిందా? పుస్తకాలు చింపితే కళ్లు పోతాయం టారు కదూ! వర్ధని ఓసారి గదంతా కలియ చూసింది. అక్కడి వస్తువులన్నీ ఎప్పటిలానే ఉన్నాయి. ఎప్పటిలానే కనిపిస్తున్నాయి. వర్ధనికి ఎక్కడ లేని ధైర్యం వచ్చింది. మెల్లిగా లేచి, పుస్తకాల సంచిలో తెలుగువా చకం కోసం చూసింది.

వర్ధని మంచం కిందకు దూరి పడుకో గానే లలిత పక్కింటి కుర్రాణ్ణి బతిమిలాడి మరో కొత్త తెలుగువాచకం తెప్పించింది. ఎప్పటిలానే అట్ట వేసి వర్ధని సంచిలో మిగి లినవాటితో పాటు సర్దేసింది. వర్ధనికి ఈ విషయాలేవీ తెలీవు. పుస్తకం చూడగానే వర్ధని మనసు కుదుటపడింది.

'హమ్మయ్య! తను పుస్తకం చింపలేదన్న మాట! అందుకే కళ్లు పోలేదు! ఆ వాణి చెడ్డపిల్ల, అందుకే తన పుస్తకాలు నలిగి పోయి ఉంటాయి ఎప్పుడూ! తను మంచిది. అందుకే కొంచెం పాతబడిన పుస్త కాలు మళ్లీ కొత్తగా అయిపోతుంటాయ్! వర్ధని తన పుస్తకాన్ని తృప్తిగా చూసుకొంది.

★ ★ ★

వర్ధని రోజువారీ కార్యక్రమంలో ఎలాంటి మార్పు లేదు రోజురోజుకీ వర్ధని విషాదం చిక్కబడటం తప్ప! వర్ధనికి రోజులు భారంగా గడుస్తున్నా, ఘోరంగా గడుస్తున్నా గడుస్తూనే ఉన్నాయి.

ఓరోజు వాణి ఓ కమ్మటి వార్త తీసుకొ చ్చింది.

త్వరలో తమకి సెలవలిస్తారట! దసరా పండుగ వచ్చేస్తుందట! తామందరం ఊరె ళ్తామట!

వర్ధనికి నమ్మబుద్ధి కాలేదు. ఎన్నో అబ ద్ధాల్లా ఇదీ ఓ అబద్ధమే! వర్ధని తన్నకై తాను

నిశ్చయానికి వచ్చింది.

అయితే తమ తరగతి పిల్లందరూ ఈ సెలవల్లో తాము ఎక్కడెక్కడికి వెళ్లేదీ, ఏమేం చేసేదీ కుతూహలంగా, ఉత్సాహంగా చెపుతూవుంటే, వర్ధనికి వాణి మాటలు నిజమేమోనన్న అనుమానం మొదలయ్యింది. కానీ ఎందుకనో వారందరిలాగా తమ ఊరి కబుర్లను గలగల చెప్పలేకపోయింది. వేణు వచ్చి వెళ్లినప్పుడు మిగిలిన నిరాశ వర్ధని ఇంకా మర్చిపోలేదు. తను వారందరి కబుర్లకు శ్రోతలా మిగిలిపోయింది.

ఆ శనివారం మేడం అదే మాటను చెప్పింది. ఈ సెలవల్లో సమయం వృథా చేయకుండా ఏమేం చెయ్యొచ్చో చెపుతూ ఉందావిడ. వర్ధనికి మాత్రం తను తిరిగి ఊరెళ్లగలనన్న వాస్తవం ఉక్కిరిబిక్కిరి చేసింది. ఆవిడ చెప్పేవేవీ వర్ధని వినిపించుకోలేదు. వెళ్లగానే పెదనాన్నతో ఇక్కడి విషయాలు ఏవేం చెప్పాలో, ఎలా చెప్పాలో నిర్ణయించుకోవడంలో మునిగిపోయింది.

ఓరోజు లలిత బజారెళ్లి వీళ్లిద్దరికీ, వేణు కూతురికి బట్టలు, రిబ్బన్లు, గాజులు తీసుకొచ్చింది. పెద్దమ్మాయికి కూడా గాజులు, రిబ్బన్లు కొంది. వర్ధని అన్నింటిని నిర్లిప్తంగా గమనిస్తోన్నా ఊరి సంగతి రాగానే చెవులు రిక్కించి వింటోంది. వాణి ఊరెళ్తున్నామని వేస్తున్న గెంతులు రోజురోజుకీ వర్ధనిలో విశ్వాసాన్ని నింపుతున్నాయి. రోజూ రిక్షాలో వాణి తరుగుతోన్న రోజుల్ని లెక్కబెట్టేది. వర్ధని వాణివంక నిరాసక్తిగా చూస్తూన్నా, మనసుమాత్రం ఉరకలు వేస్తూ ఊరిని చేరిపోయింది.

ఊరికి వెళ్లబోయేముందు ఆరు రోజులూ టీచర్లు రోజంతా బడిలో ఉండాల్సిన అవసరం లేదన్నారు. ఇంటర్వెల్ కే బడి అయిపోతోంది. పాపం వాణికి బడి కొద్దిసేపే వున్నా మిగిలిన సమయమంతా పుస్తకాలతో కుస్తీపడను సరిపోతోంది. లలిత వర్ధనిని కూడా వాణితోపాటు కూర్చోబెట్టాలని విశ్వప్రయత్నం చేస్తోంది. ఇంక ఈవిడ మాట తనెందుకు వినాలి? వర్ధని లలిత ప్రయత్నాలన్నిటిని మౌనంగానే ప్రతిఘటిస్తోంది. చదవమంటూ ఎంత గొడవ చేసినా పట్టనట్లు ఉండిపోతోంది.

ఆ ఆరు రోజులూ టీచర్లు ఏవేవో ప్రశ్నలడిగారు. కొన్నింటిని ఓ తెల్ల కాగితంపై రాసిచ్చారు. అన్నిటికీ సమాధానాలు ఆ కాగితంమీదే రాయమన్నారు. అవే పరీక్షలట! అవన్నీ ఇన్ని రోజులూ టీచర్లు బళ్లో చెప్తోన్న పాఠాలలోంచే! ఒక్కోరోజు తరుగుతోంటే వర్ధనికి ఉత్సాహం పెరుగుతోంది. ఆ సంతోషంలో టీచర్లు చెప్పినట్లుగా వేస్తోంది. ఇక ఎన్నటికీ వాళ్లని తను తిరిగి కలవబోనని వర్ధని నమ్మకం.

పెదనాన్నకి, పెద్దమ్మకీ ఈ ముకుందం ఏవో మాయమాటలు చెప్పి తననిక్కడికి తీసుకొచ్చాడు. ఒక్కసారి తను వాళ్లను కలిసి ఇక్కడి సంగతులన్నీ చెపితే వాళ్లు తిరిగి ఇక్కడికి ఎన్నడూ పంపరు. తనెంత బాధ పడుతుందో తెలిస్తే ఇక్కడ ఒక్క క్షణమైనా ఉంచేవారా? ఉంచరు! ఎన్నటికీ ఉంచరు!

చివరికి వర్ధని ఊరికి తిరుగు ప్రయాణం చేసేరోజు వచ్చేసింది. ఎదురు చూసినంత వేగంగా!

★ ★ ★

ముకుందం ఏదో ముఖ్యమైన పని ఉందంటూ వారందరినీ రైలులో రమ్మని తను ముందుగానే బయలుదేరి వెళ్లాడు.

వర్ధనికి కాళ్లు నేలమీద ఆనడంలేదు. తన పుస్తకాల్నీ, పలకనీ, అన్నింటినీ అటూ ఇటూ పడేసింది. ఇంట్లోని గదులకీ, గదులలోని సామాన్లకీ, ముంగిట్లో మొక్కలకీ, డాబా మెట్లకి, డాబామీది బొప్పాయి ఆకులకు తనకి ఇక సంబంధం తెగిపోయినట్లుగా అనిపించింది. వాటన్నిటితోనూ ఉత్సాహంగా అరిచి అరిచి చెప్పాలనిపించింది -



ఇక నేను మళ్లీ మిమ్మల్ని చూడనుగా! హాయిగా మా ఊళ్లో మా పెదనాన్నతో పెద్దమ్మతో ఉంటాగా! అని. వర్ధని మాటలు పెదవులు దాటకపోయినా ఊహలు ఈ ఊరిని దాటి ఎప్పుడో తమ ఊరికి చేరుకున్నాయి.

మొదటిసారి రైలెక్కిన అనుభూతి ఆ ఉత్సాహం ముందు తేలిపోయింది. ముకుందం ముందే వెళ్లాడు కనుక తను వస్తున్నానని అందరికీ తెలిసిపోయివుంటుంది. పెదనాన్నా, పెద్దమ్మా తనకోసం ఎదురు చూస్తూ ఉంటారు. అన్నాయిలిద్దరూ రైలు దగ్గరకే వస్తారు. అయినా తను ఊరెళ్లగానే మొదట పెదనాన్న దగ్గరికి వెళ్లాలా? లేక తనని బుజ్జి మేనత్తను చేసిన వేణన్నాయి కూతురి దగ్గరకా? కాసేపు వర్ధని తనలో తను తర్జనభర్జనలు పడింది.

అయినా తను ఊరిలో అడుగు పెట్టగానే పెదనాన్న తనను ఆయన భుజాలమీద ఎక్కించుకొని వెళ్లడూ? వర్ధనికి సమాధానం దొరికింది. ఊరెళ్లగానే వెంటనే ఏం చేయాలో ఒక్కొక్కటిగా గుర్తు తెచ్చుకొంటోంది.

సీమచింతకాయల చెట్టుకు వేళ్లాడుతోన్న పిచ్చుక గూళ్లు ఎలా ఉన్నాయో చూడాలి ముందు, ఆ తరువాత సరళ ఉయ్యాలకన్నా పెద్ద ఊయల కట్టించుకోవాలి... ఆలోచిస్తున్న వర్ధని టక్కున ఆగిపోయింది.

వర్ధని అంతే ఉన్న అమ్మాయొకతి రైలు పెట్టెను చిమ్ముతూ, వర్ధని దగ్గరికి వచ్చింది. కాళ్లు పైకి పెట్టుకోమని ఎంత దీనంగా అడిగిందంటే వర్ధనికి ఏం చేయాలో తోచక లేచి నిల్చునేంత.

రైలు ఊడుస్తూ, డబ్బులు అడుక్కుంటూ, చిన్న చిన్న వస్తువులు, చిరుతిళ్లు అమ్ముతూ పిల్లలు కొందరు వర్ధని కంటపడ్డారు. వాళ్ల చింపిరి జుట్లు, మురికి బట్టలు, ఆకలి, దైన్యత కలబోసిన కళ్లూ వర్ధనిని కలవరపరిచాయి. వాళ్లల్లో కొందరు వాణికన్నా చిన్నవాళ్లు.

వర్ధని తను బడిలో చేరేరోజు బడినుంచి పారిపోయిన సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఆరోజు లలిత ఏం చెప్పింది? పారిపోయిన పిల్లలందర్నీ పట్టుకుపోయే వాళ్లుంటారనీ, వాళ్ల కాళ్లూ చేతులూ విరిచేసి అడుక్కోమంటారని చెప్పిందికదూ!

వర్ధని పెదాలు తడి చేసుకొంది. ఆ అమ్మాయి చీపురు పట్టుకొని లేచి నిల్చుంది. వర్ధనికి ఎందుకో ఆ అమ్మాయి మొహంలో తన మొహం కనిపించింది. కళ్లు నులుముకొని చూసింది. ఆ అమ్మాయి ఏమీ పట్టించుకోకుండా మళ్లీ చీపురుతో చిమ్ముతోంది.

ఈ అమ్మాయి తనలా ఊరెళ్ళాలని పారిపోయి వచ్చుంటుందా? ఆరోజు తనను కూడా ఆ లంబాడీలు ఎత్తుకొని వెళ్లేవారా? లేదు. వాళ్లు మంచివాళ్లు. రోజూ బడి దగ్గర పిల్లలందరితో ఎంత చక్కగా మాట్లాడుతూ వుంటారో! ఏవైనా ముకుందం రావడం ఆలస్యమైవుంటే ఆ లంబాడీలు కాకపోతే ఇంకోరు! తననీ ఇలాగే తయారు చేసేసి ఉండేవాళ్లు కదూ! పాపం వీళ్లని సమయానికి ఆదుకోవడానికి ముకుందంలాంటి వాళ్లు ఉండివుండరు! అయినా పిల్లల్ని ఎత్తుకెళ్లే వాళ్లు ఎలా ఉంటారో? !

వర్ధని వాణివైపు చూసింది.

వాణి వేరుశనక్కాయలు నములుతూ ఆ పక్కవాళ్లనీ ఈ పక్కవాళ్లనీ హుషారుగా పలకరిస్తోంది. ఆ ఊడుస్తున్న అమ్మాయి తన దగ్గరకు రాగానే కాళ్లు పైకి పెట్టుకొని, తన కబుర్ల కార్యక్రమం తాను కొనసాగిస్తోంది.

ఆ అమ్మాయి వెళ్లడానికి వెనుదిరిగింది. ఆ అమ్మాయినే గుచ్చి గుచ్చి చూస్తున్న వర్ధని కళ్లల్లో కళ్లు కలిశాయి.

ఒక్క క్షణం...

వర్ధని గబుక్కున తన చేతిలోని వేరుశన




క్కాయల పొట్లం ఆ అమ్మాయి చేతిలో పెట్టింది.

ఆ మురికి మొహంలో తెల్లటి పళ్లు తళుక్కుమన్నాయి. వర్ధని కూడా స్నేహపూర్వకంగా నవ్వింది. ఆ అమ్మాయి ముందుకెళ్లిపోయింది.

వర్ధని చీపురు పుచ్చుకొని, అందరిమధ్యనా తిరుగుతున్న ఆ అమ్మాయినే చూస్తూ ఉండిపోయింది.

ఇంతలో వాణికి ఎదురుగా కూర్చున్న ఓ నలభై ఏళ్ళావిడ హఠాత్తుగా వెనక్కు విరుచుకుపడిపోయింది. పడినంత వేగంగానే లేచి నిలబడింది. ఆ వేగానికి ఆమె జుట్టు ముడిలోంచి విడిపోయి మొహమంతా పరుచుకొంది. ఆమె కళ్లు సగం మూసి, వళ్లంతా ఊపేస్తూ "హు...హు..." అంటూ గట్టిగా అరవడం మొదలుపెట్టింది.

వాణి బిత్తరపోయి లలితను వాటేసుకుంది.

వర్ధని దిమ్మెరపోయి గుడ్లప్పగించింది.

ఆమె అరుపులు రైలు శబ్దాన్ని మించిపోయాయి. అక్కడి గందరగోళాన్నంతా ఓ క్షణంలో అదుపులోకి తెచ్చాయి. దానికి తోడు ఆమె పక్కనే కూర్చున్నతను లేచి, ఆమెను బలవంతంగా నిలబెట్టాడు. మొహాన రూపాయంత బొట్టు పెట్టాడు. ఆవిడ నల్లటి మొహాన ఎప్పుడు పూసిన పసుపోగానీ పచ్చగా కనబడుతోంది. చెమటకు తడిసి కారుతోన్న బొట్టుతో ఆమె రూపం భీభత్సంగా తయారయింది. అతను సంచిలోంచి సాంబ్రాణికడ్డీలు తీసి వెలిగించి ఆమె జాకెట్టుకు గుచ్చాడు. వెలుగుతున్న చివర్లలో పొగలు చిమ్ముతూ ఆ కడ్డీలు ఆమెతోబాటే భయంకరంగా కదులుతున్నాయి.

వర్ధనికి ఆ సాంబ్రాణి వాసనకు కడుపులో తిప్పడం మొదలయ్యింది.

వర్ధని మూతి బిగించి, కొయ్య బొమ్మలా కూర్చుంది.

వాణి లలిత ఒళ్లో తల పెట్టుకొని, కళ్లకు చేతులు అడ్డం పెట్టుకొని వుంది. అప్పుడప్పుడు చేతివేళ్లను దూరంచేసి, భయంభయంగా చుట్టూ చూస్తూ మళ్లీ కళ్లు గబుక్కున మూసుకుంటోంది.

లలిత వర్ధనిని కూడా దగ్గరకు తీసుకోబోయింది.

వర్ధని లలిత చేతిని విసిరికొట్టింది. ఇంకాస్త దూరంగా జరిగి కూర్చుంది.

అంతటి భయంలోనూ వర్ధని ఓ విషయం గమనించింది.

సాంబ్రాణీకడ్డీలు గుచ్చినతను ఏవో మాటలు చెపుతూ అందరి దగ్గరా డబ్బులు తీసుకుంటున్నాడు. లలిత కూడా డబ్బులిచ్చింది.

కలుగొంట్ల దగ్గరకి రాగానే అతను గబుక్కున చైను లాగాడు. ఆమె టక్కున సరిగ్గా నిల్చుంది. గబగబా సీట్లకింద వున్న సామాను తీసుకొని రైలు దిగి వెళ్లిపోయారు.

వాణి సాధారణ స్థితిలోకి రావడానికి చాలా సమయం పట్టింది. వర్ధని భయంతో బిగుసుకుపోయి అలాగే కూర్చుంది.

లలిత బాధగా అనుకొంది, 'వర్ధని వంటరితనపు గిరిదాటి తమలో కలవగలదా ఎప్పటికైనా?' అని



ఊళ్లోకి అడుగుపెట్టగానే ఏదో మొహ

మాటం, బెరుకు, సిగ్గు అన్నీ కలిసి వర్ధనిని ఉక్కిరిబిక్కిరి చేశాయి.

అందరికన్నా వెనకగా తలదించుకొని, గౌను కాలర్ల చివర్లను వేళ్లతో లాగుతూ నడుస్తోంది. కనుచివరల నుండి పెదనాన్న కోసం, పెద్దమ్మ కోసం చూస్తూ నడుస్తోంది. ఆనందంతో అడుగులు నేలమీద బలంగా ఆనడంలేదు.

వేణు, మురళి గబగబ ఎదురొచ్చి లలిత బస్సులోంచి దించిన సామాను అందుకొన్నారు. పక్కయిళ్లల్లోంచి ఆడవాళ్లంతా దడి దాకా వచ్చి కుతూహలంగా చూసి మళ్లీ వెనక్కు వెళుతున్నారు. సందడిసందడిగా అందరూ పలకరిస్తూన్నా వర్ధని సిగ్గుతో మాట్లాడలేదు. వాణి మాత్రం తమ రైలు ప్రయాణం గురించి, రైలుదిగి ఎక్కిన బస్సు ప్రయాణం గురించి అడిగినవాళ్లకీ అడగని వాళ్లకీ ఒకే రకంగా గడగడా చెప్పేస్తోంది.

వర్ధని ఆవరణలోకి రాగానే తను పందిరి మీదికి పాకించిన చిక్కుడు చెట్టు పందిరంతా అల్లుకుపోయి పూలతో, పిందెలతో కళకళలాడుతూ స్వాగతమిచ్చింది.

ఇన్నాళ్లూ పెదనాన్నా పెద్దమ్మల కోసం వర్ధని చూసిన ఎదురుచూపులు ఇంకా ఆత్రంగా వారికోసమే వెతుకుతున్నాయి. వర్ధని అలవాటు ప్రకారం చావిడి దగ్గరకి పరిగెత్తింది.

చావిట్లో పెదనాన్ననీ, పెద్దమ్మనీ చూశాక వర్ధని అడుగు ముందుకు పడలేదు. వున్న చోటే నిల్చుండిపోయింది.

మంచంమీద కూర్చుని కోటయ్య తాళ్లు పేనుతున్నాడు. జయమ్మ ఎదురుగా చావిడి గుంజ నానుకొని నిల్చునివుంది. ఇద్దరూ ఎప్పటిలాగానే ఏవో పరాచికాలాడుతున్నారు. వాళ్లమొహాలు తేటగా, సంతోషంగా తను ఊరెళ్లక ముందు ఎలావున్నాయో అలాగే వున్నాయి. అన్నిటికీ మించి వర్ధని అడుగుముందుకు పడనీయకుండా చేసింది, జయమ్మ చంకనెక్కి కేరింతలు కొడుతున్న పాప!

వారిద్దరి సంభాషణ పాప చుట్టూనే తిరుగుతోంది.

వర్ధనికి ఉక్రోషం, ఏడుపు ఒక్కసారే ముంచుకొచ్చాయి. ఇన్నాళ్ల దుఃఖం మూడింతలై... ఏడింతలై... నూరింతలై... వెయ్యింతలై.. వర్ధని కాళ్లకు బంధాలు వేసినట్లనిపించింది. తనకే స్వంతమైన స్థానంలో ప్రత్యక్షమైన పాప మీద అసూయ, ద్వేషం కూడా అంతగానే పుట్టుకొచ్చాయి. కళ్లల్లోంచి అగ్నికణాలు రాలుస్తూ నిల్చుంది.

జయమ్మ కోటయ్యతో మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా వర్ధని వైపు చూసింది. జయమ్మకు ఆశ్చర్యంతో నోట మాటరాలేదు. ఒక్క పరుగున వర్ధని దగ్గరకి వచ్చింది. కోటయ్య కూడా గబుక్కున మంచం మీద నుంచి లేచి వచ్చాడు.

"ఏంటే అమ్మాయ్ ఎంత సేపయ్యింది వచ్చి? అయినా వచ్చిన దానివి అలా ఉలుకూ పలుకూ లేకుండా నిలబడ్డావేం? " జయమ్మ ఆప్యాయంగా అడిగింది.

వర్ధని తలదించుకొని వారివైపు రెండడుగులు వేసింది. కోటయ్య వర్ధనిని భుజానికెత్తుకున్నాడు.

"ఏమ్మా... ఇట్టా అయిపోయావూ!" వర్ధని తల నిమురుతూ ఆప్యాయంగా అడిగాడు. ఇన్నాళ్ల ఎడబాటు మిగిల్చిన విషాదాన్ని ఆ ఆప్యాయతా, అభిమానం కరిగించేసేవే కానీ వర్ధనికి ఏదో వెలితి వెలితిగా అనిపించింది. ఇంతకు మునుపులా మనసారా కోటయ్య అభిమానానికి స్పందించలేకపోయింది. వారిద్దరూ ఏకబిగిన అడుగుతోన్న ప్రశ్నలకు ముక్తసరిగా సమాధానాలిస్తోంది. మాటల మధ్యలో జయమ్మ అంది,

"నువ్వెట్టా వున్నావోగానీ మీ పెదనాన్న నిన్ను తలవని క్షణం లేదనుకో! నిన్ను తలవందే ముద్ద ఎత్తేవాడూకాదు. కునుకు తీసేవాడూకాదు"

"ఆ...! అక్కడికి తవరేదో తక్కువ





తిన్నట్టు!" కోటయ్య నవ్వుతూ అన్నాడు.

వర్ధని ఆ మాటలన్నిటిని అపనమ్మకంగా ఆలకించింది.

"ఇదుగోనే అమ్మాయ్ మీ బుజ్జి మేనత్త!" జయమ్మ పాపకి వర్ధనిని మురిపెంగా చూపిస్తూ అంది.

"ఆ... ఇంక నీ మనవరాలితో మాకేం పనిలేదు. మా అమ్మాయి వచ్చిందిగా! మా వర్ధనమ్మ ఎప్పటికైనా మా వర్ధనమ్మే! బంగారుకొండ!" అన్నాడు కోటయ్య.

"ఓయబ్బో!" జయమ్మ మూతి మూడు వంకర్లు తిప్పింది.

జయమ్మ వాలకం చూసి వర్ధని అన్నీ మరిచిపోయి పడీపడీ నవ్వింది.

"నవ్వవే నవ్వు! నన్ను చూస్తే మీ అయ్యా కూతుళ్లిద్దరికీ ఎప్పుడూ వేళాకోళమే!"

కోటయ్య కూడా పైపంచను మూతికడ్డం పెట్టుకొని నవ్వాడు. వర్ధని కోటయ్య మెడ చుట్టూ చేతులు వేసి నవ్వుతూనే వుంది చాలా సేపు.

జయమ్మ ఎప్పటిలాగానే స్నానం చేయించింది. గోరు ముద్దలు తినిపించింది.

వర్ధనికి తన ప్రపంచంలోకి తిరిగి వచ్చినట్లు అనిపించింది. పందిట్లో వాల్చివున్న మంచం మీద పడుకొని హాయిగా నిద్రపోయింది.

వర్ధన్ని నిద్రలేచేసరికి లలిత, వాణి తను అక్కడ చేసిన ఘనకార్యాలన్నిటిని రసవత్తరంగా వర్ణించి చెప్పడం వినిపించింది. అలగడం, రక్కడం, గిచ్చటం, కొరకటం, గదిలో కెళ్లి తలుపులు బిగించుకోవడం, ఇంట్లోంచి పారిపోవడం, పక్కలు తడిపేయడం, దొంగతనం చేయడం అన్నీ అన్నీ వివరించి చెపుతున్నారు.

జయమ్మ, సరోజ మళ్లీ మళ్లీ ఆసక్తిగా అడిగి చెప్పించుకొంటున్నారు.

వర్ధనిలో ఏదో అలజడి బయలుదేరింది.

వీళ్లంతా ఒకటే! అందరికీ తనంటే ఇష్టం లేదు! తను ఎవరికీ అక్కర్లేదు! వర్ధని కళ్లు తెరిచి చావిడివైపు చూసింది. పాప అక్కడే మంచంమీద కోటయ్య పక్కన కూర్చుని వుంది.

పెదనాన్న కూడా అబద్ధం చెప్పాడుకదా! పెద్దమ్మతో ఏం చెప్పాడు? పాపతో ఇక తనకేం పనిలేదు అని కదా? తనను నిద్రపోనిచ్చి మళ్లీ ఆడుతున్నాడు. అందరూ అందరే! అబద్ధాల కోరులే!

వర్ధని మనసు వికలమైంది. చెరువు గట్టు దగ్గరకి పరుగుతీసింది. చెరువులోకి నీళ్లు పెడుతున్నారు. సన్నటి కాలవలోంచి సవ్వడిలేకుండా చెరువులోకి నీళ్లు చేరుతున్నాయి. వర్ధని చేతిలోకి గులకరాళ్లు తీసుకొని కాలువలోకి విసిరింది. అడుగున వున్న బురద మట్టిలోకి అవి మెత్తగా చేరుతున్నాయి.

భుజాన ఎవరిదో చెయ్యి పడడంతో వర్ధని చివ్వున తలెత్తి చూసింది... సరళ.

"ఏంటి వర్ధనీ ఇల్లా కూచున్నావ్?"

'అయితే నీకేంటీ' అన్నట్లు చూసింది వర్ధని.

సరళ వర్ధని పక్కనే కూర్చుంది.

"అక్కడ మీ బడి భలే బావుంటుందట కదా?" సరళ ఆసక్తిగా అడిగింది.

"ఆ!" వర్ధని ముక్తసరిగా అంది.

"బోలెడంత మంది పిల్లలు, చాలామంది పంతులమ్మలు ఉంటారంటకదా?" సరళ మళ్లీ అడిగింది. వర్ధని ఔనన్నట్లు తలాడించింది.

"పిల్లలందరూ ఒకేరకం బట్టలేసుకుంటారట... బూట్లేసుకుంటారట... కుర్చీల్లో కూర్చుంటారట..." సరళ చెపుతూ వుంది.

తన బడి సరళకి ఊహ అయితే తనకి నిజం అన్న విషయం వర్ధనికి తట్టింది. గర్వంగా తలెగరేస్తూ అంది, "మరేం అనుకున్నావ్! ఆ డొక్కు చావిట్లోని పిలక పంతులు బడి అనుకున్నావా?" ఊరెళ్లబోయే ముందు పంతులు ఇంట్లో తనకు జరిగిన పరాభవం మర్చిపోలేదు వర్ధని. ఆ

ప్రతీకారపు తీవ్రత అంతా పంతుల్ని సంబో దించడంలోనే చూపింది.

"నువ్వూ ఆ బళ్లోనేగా చదివావ్?" సరళ టక్కున అంది.

"అయితే ఏం? మా కొత్తబడి ముందు ఇదెంత?"

"మీ బడి గురించి చెప్తూనే, నువ్వక్కడ ఏం చేస్తున్నావో కూడా వాణి చెప్పిందిలే!" సరళ లేచి నిల్చుని వెటకారంగా అంది.

"ఏం చేస్తున్నానని చెప్పింది?" వర్ధని వస్తోన్న కోపాన్ని తమాయించుకొని అడి గింది.

"నువ్వే పోయి వాణిని అడుగు!" సరళ టక్కున అని, చెరువుగట్టు దిగి వాళ్లింటివైపు పరిగెత్తింది.

ఈ చాడీకోరు అప్పుడే అందరికీ తన మీద అవీఇవీ చెప్పేస్తోందా! తను మహ బూబ్‌నగర్ వెళ్లకుండా ఇక్కడే వుండాలి కదా! మరి సరళతో అలా మాట్లాడానే మిటి? తనకు ఏదో పిచ్చి ఎక్కినట్లుంది. తను ఈ పంతులు బడిలోనే చదవాలి. ఈ సరళతోనే ఆడుకోవాలి. ఆ వాణి ఒక్కతే లింగులింగుమంటూ రిక్షాలో వెళ్తుంది. అప్పుడు కుదురుతుంది దాని తిక్క! అయినా ఈ బోడీ సరళకి ఎంత నోరొచ్చింది! తను మాట్లాడితే చాలని తన చుట్టూ తిరిగేది! అంతా ఆ చాడీకోరువల్లే! సరళ లాగే పెద్దమ్మ కూడా ఆ లలిత మాటలన్నీ విని నమ్ముతుందా? పెద్దమ్మ పెదనాన్నకి కూడా చెపుతుందా?

వర్ధనికి ఆకస్మాత్తుగా రైలులో చూసి నామె గుర్తొచ్చింది. ఆమె బీభత్సమైన రూపం కళ్లముందు కదలాడింది. ఆ బొంగురు గొంతులోంచి పుట్టిన భయంకర మైన ధ్వని చెవుల్లో ప్రతిధ్వనించింది. ఆ సాంబ్రాణి పొగల వాసన ఉక్కిరిబిక్కిరి చేసి నట్లనిపించింది. వర్ధనికి వెన్నులోనుంచి వొణుకు మొదలయింది. వళ్లంతా చెమటల్లో పట్టాయి. గులకరాళ్లను చేతిలో అలాగే పట్టుకొని బొమ్మలా కూర్చుంది. ఘనీభవిం చిన హృదయం మంచులా కరగడం మొద లెట్టింది. కంట్లోని నీరు సవ్వడిలేకుండా చెరువులోకి వొదిగిన తుంగభద్రమ్మ వొడిని చేరుతున్నాయి.

"అయ్... వొరదమ్మాయి వొచ్చింది. వర దమ్మాయి వచ్చింది" సంతోషంగా చప్పట్లు కొట్టడం వినిపించి తలెత్తింది వర్ధని.

పెద్దమ్మాయి! ఆమె మొహంలో ఆనందం తాండవిస్తోంది. వర్ధని పలకరిస్తున్నా విని పించుకోకుండా, బిందెలోకి నీళ్లు కూడా ముంచుకోకుండా, వోణిని భుజంపైకి ఎగ దోస్తూ, హడావుడిగా వెళ్లింది. ఖాళీ బిందెను ఊపుతూ కళ్లు గిరగిరా తిప్పుతూ అడిగినవాళ్లకీ అడగనివాళ్లకీ అందరికీ వరద మ్మాయి వచ్చిందని సంబరంగా చెపుతూ వచ్చినంత వేగంగా వెళ్లింది.

వర్ధని మొహాన చిరునవ్వు కదలాడింది.

అందరూ పెద్దక్కాయిని పిచ్చిది అంటారే! అందరిలో తనే మంచిది! ఎంతో మంచిది! అందరూ మారిపోయారు. చివరికి పెద్దమ్మా పెదనాన్న కూడా!

వర్ధని వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది. ఎప్పటికో తేరుకొని కళ్లు తుడుచుకొంది.

ఇంతలో పెద్దమ్మాయి మళ్లీ బిందె ఊపు కుంటూ రావడం కనిపించింది. వర్ధని పల కరింపుగా నవ్వింది.

★ ★ ★

పాపకి రెండు పూటలా జయమ్మే వెన్న రాసి, నలుగుపెట్టి స్నానం చేయిస్తోంది. పాపకి వేసే సాంబ్రాణి గుబాళింపులతో ఇల్లంతా నిండిపోతోంది.

వర్ధనికి జయమ్మ పాపకి ఏం చేస్తున్నా అయిష్టంగానే వుంటోంది. స్నానం చేయిస్తు న్నంతసేపూ పక్కనే నిల్చుని తీక్షణంగా చూస్తుంది ఏం చేయాలో తోచక!

వాణి మాత్రం పాపకి స్నానం చేయించే పుడు తనూ ఓ చెంబెడునీళ్లు పోస్తుంది.

సాంబ్రాణి వేసేప్పుడు తనూ ఓ చిటికెడు పొడి నిప్పులమీద వేస్తుంది. పాపకి గౌను తొడిగినా, తల దువ్వినా, దిష్టి తీస్తున్నా వాణి చాలా సంబరపడిపోతోంది. చివరికి పాప ఆవులించినా, నవ్వినా, దగ్గినా, తుమ్మినా వాణి ఆనందానికి అంతుండడం లేదు. ఉత్సాహంగా చప్పట్లుకొట్టి, వింత వింత శబ్దాలు చేసి పాపను నవ్వించాలని ప్రయత్నిస్తూ వుంటుంది. వర్ధనికి వాణి ప్రవర్తన చిరాకేసింది.

ఈ వాణికి ఇదేం తెగులు! ఆ పిల్లరాక్షసి వెంట అలా పడుతుంది! అనుకుంది వర్ధని విసుగ్గా.

పాప కేరింతలుగానీ బోసినవ్వులుగానీ వర్ధనిని కదిలించలేకపోయాయి. పైపెచ్చు వర్ధనిలోని సున్నితభావాల్ని కరడుకట్టించాయి. ఓ రోజు పాప కార్యక్రమాల్ని గమనిస్తోన్న వర్ధనితో జయమ్మ నవ్వుతూ అంది, "నీకు ఇంతకన్నా ఎక్కువే చేశాను లేవే! రేపు మమ్మల్ని ఎలా గుర్తుంచుకొంటావో గానీ!"

వర్ధనికి ఏదో చేదు నిజం తట్టింది. పెద్దమ్మ ఆదరణ, అభిమానం నిన్నటి విషయాలు! ఈ రోజువికావు! పాపకి స్నానం చేయించేదాకా వర్ధని అలాగే ముగ్గా కూర్చుంది. లలిత వచ్చి బతిమిలాడింది "ఎండెక్కిపోతోంది నేనన్నా పోస్తానురా" అంటూ.

వర్ధని ఏమీ మాట్లాడకుండా జయమ్మ వెనకే తిరిగింది. పాప కార్యక్రమాలన్నీ పూర్తయ్యాక, వర్ధనికి స్నానం చేయించింది జయమ్మ. ఉదయం నుంచి ఏమీ తినకుండా అట్లాగే వున్నందుకు వర్ధనికి విపరీతమైన ఆకలి వేస్తోంది. జయమ్మ పళ్లెంలోకి వేడివేడి అన్నంపెట్టి, బీరకాయ పచ్చడేసి కలపడానికి వెన్నముద్దేసుకుంది. వర్ధనికి నోట్లో నీళ్లూరాయి. జయమ్మని చేయిలాగుతూ తొందరపెడుతోంది.

"అబ్బ... వస్తున్నా వుండవే!" అంటూ జయమ్మ వర్ధని చేయి విడిపించుకొని, మంచినీళ్ల బాన దగ్గరకెళ్లి గ్లాసుతో మంచి నీళ్లు తీసుకొంది.

ఇంతలోకి సరోజ వచ్చింది.

"అదేంటత్తయ్యా, అంత వెన్నపూసా వర్ధని అన్నంలోకే వేసేస్తే ఎలా? అసలే పాప స్నానానికి వెన్నపూస రాస్తున్నప్పటినుంచి అన్నంలోకి నెయ్యే సరిపోవట్లా!"

జయమ్మ ఏమనుకొందో ఏమో పళ్లెంలోంచి సగం వెన్న ముద్దతీసి చిన్నమూతలోకి పెట్టింది. వర్ధనికి చిర్రెత్తుకొచ్చింది. తీవ్రంగా ఏదో అనబోయేంతలో జయమ్మ మిగిలిన వెన్నతో కలిపి అన్నం ముద్దలు చేసింది. బతిమిలాడుతూ అంది,

"పోనీలేమ్మా, రేపు ఎక్కువ వెన్న తీస్తాగా! ఈ పూటకి తిను!"

ఆ మర్నాడు మజ్జిగ చిలకడానికి చూరులోంచి కవ్వం తీసుకున్నప్పటినుంచే జయమ్మ వెంటపడింది. జయమ్మ గుంజకి కవ్వాన్ని, తాళ్లు చుట్టింది. మీగడతపేలాలో కవ్వాన్నివుంచి చిలకడం మొదలెట్టింది. మొదటి వెన్నముద్ద తనకే పెట్టాలని వర్ధని వాగ్దానం తీసుకుంది. చుక్క చిందనీయకుండా, తపేలా కదలనీయకుండా మజ్జిగ చిలుకుతోన్న జయమ్మ నైపుణ్యాన్ని వర్ధని ఆశ్చర్యంగా చూస్తోంది. ఎన్నిసార్లు చూసినా రోజూ వింతే! వెన్న పడగానే చూసి సంతోషంగా అరిచింది. జయమ్మ కవ్వాన్ని గుంజకాన్చి, వెన్న తీసే గిన్నె తేవడానికి లోపలికి వెళ్లింది.

"అత్తయ్యా, పప్పుచారులోకి ఓ కరివేపాకు రెబ్బ తెచ్చిస్తావా?" గిన్నె అందిస్తూ అడిగింది సరోజ.

"అక్కాయ్, ఆ చేత్తోనే రెండు మునక్కాయలుంటే కోసుకురా!" లలిత కోస్తున్న ఉల్లిపాయని చేతిలో పట్టుకొని కత్తిపీట దగ్గర్నుంచి కేకేసింది.

"ఎట్టాగమ్మాయ్... వెన్న తియ్యద్దా?"

జయమ్మ అంటుండగానే సరోజ వచ్చింది.

"నే తీస్తాలే అత్తయ్యా. నీవు త్వరగా తీసుకురా. వంట ఆలస్యమైపోతోంది. మళ్లీ క్యారియర్లు పెట్టద్దూ? ""

వర్ధని జయమ్మ కొంగులాగుతూ "నువ్వే తియ్యి పెద్దమ్మా!" అంటూ నసిగింది.

"అమ్మాయ్ మజ్జిగగిన్నెలో ఓ చుక్క వేణ్ణీల్లు పొయ్యి. వెన్న బాగా వచ్చుద్ది" అంటూనే వర్ధని చేయి పుచ్చుకొని కూరగాయల మడిదగ్గరకి వెళ్లింది జయమ్మ. మడి దగ్గర దడికి ఆన్చివున్న కర్రను తీసుకొని, ఓ చివర ఓ గట్టిపుల్లను పురికొసతో బిగించి కట్టింది. అది చక్కగా వంకీలా తయారయ్యింది. లేత కరివేపాకు రెబ్బలు కోసి వర్ధని చేతికిచ్చింది. బాగా పొడవైన మునక్కాయల్ని వర్ధని చూపిస్తుంటే వంకీని జాగ్రత్తగా వాటి తొడిమల దగ్గరకి పోనిచ్చి కర్రతో ఓ గుంజుగుంజింది జయమ్మ. కాయకిందపడగానే వర్ధని పరిగెత్తుకెళ్లి తీసుకొస్తోంది.

పొట్ల పందిరి దగ్గరికి తీసుకెళ్లి ఈ ఏడాది వర్ధని లేకపోవడంవలన, వంగి వంగి పిందెలకి రాళ్లు కట్టడానికి ఎంత కష్ట పడాల్సి వచ్చిందో చెప్పింది. మాట్లాడుతూనే పక్క పందిరిమీద గింజలు గట్టిపడ్డ చిక్కుళ్లను వేళ్లతో తుంపి, కొంగులో వేసుకుంది. ఇద్దరూ మాట్లాడుకొంటూ వచ్చేసరికి వంటింట్లో నెయ్యి వాసనలు వస్తున్నాయి.

"పెద్దమ్మా, నా వెన్నపూస!"వర్ధని ఓ గావు కేక పెట్టింది. వర్ధని వంటింట్లోకి జయమ్మ కన్నా ముందే వచ్చింది.

"ఏంటా అరుపులు వర్ధనీ.." సరోజ తీవ్రంగా ఏదో అనబోయింది. జయమ్మని చూడగానే, "అదేంటత్తయ్యా కరివేపాకు ముందు వర్ధనితో పంపకపోయావా? నెయ్యి కరగేసిన గిన్నెలో పప్పుచారుకి పోపు పెడితే బావుండేదిగా, వంకాయ పచ్చడికి పోపు వేసేసాను" అంది.

వాళ్లిద్దరూ వర్ధని వెన్న-విషయమే మరిచిపోయి, వేరే పనిలో పడ్డారు.

వర్ధని ఉక్రోషంలో నేలమీద దబాదబా బాదుతూ నడుస్తూ బయటికి వెళ్లింది.

అదేంటోగానీ జయమ్మ వర్ధనిని స్నానానికి సిద్ధం చేసినప్పుడే సరోజ పాపకి నీళ్లు తోడేది. జయమ్మ వర్ధనితో, "మళ్లీ పోస్తా వుండమ్మా" అంటూ పాప దగ్గరకి వెళ్లేది. వర్ధనికి జయమ్మ అన్నం కలిపినపుడే పాపకీ అన్నం కలిపి, "అత్తయ్యా మీ దగ్గరైతే పాప మారాం చేయకుండా తింటుంది" ' అంటూ పాపతో పాటు గిన్నెను జయమ్మకు ఇచ్చిపోయేది సరోజ.

వర్ధనికి సరోజ మీద విపరీతమైన కోపంగా వుంది. సెలవలకని వచ్చినప్పటి నుంచీ లలిత తనని పెద్దగా పట్టించుకోవడం లేదుగానీ సరోజే అప్పుడప్పుడూ చురకలంటిస్తోంది. జయమ్మ చక్కగా వళ్లో కూర్చోపెట్టుకొని గోరుముద్దలు తినిపిస్తుంటే, "తాడిలాగా ఇంతెత్తుంది! ఇంకా చిన్నపిల్లలా నోట్లో పెట్టించుకోవడం ఏమిటీ? " అంటూ దీర్ఘాలు తీస్తూ బుగ్గలు నొక్కుకునేది.

సరోజ ఏ పని చేస్తున్నా పాపని జయమ్మ చేతికిచ్చిపోయేది. దాదాపు రోజంతా జయమ్మ పాపని ఎత్తుకొని తిప్పుతూనే వుంటుంది. జయమ్మ దగ్గర పాపని చూడగానే వర్ధనికి భగ్గుమనేది. తన సార్వభౌమత్వానికి ఎసరుపెట్టిన ఆగర్భ శత్రువులా కనిపించేది వర్ధనికి. వర్ధని పంతం వెయ్యింతలు పెరిగిపోయింది. జయమ్మ పాపని ఎత్తుకున్నంతసేపు తను కోటయ్య మీద సవారి చేస్తోంది.

"నేనెక్కడా చూళ్లేదమ్మా, ఇంత వయసొచ్చినా వీపునెక్కించుకొని ఆడించేవాళ్లను!" సరోజ మూతిమూడు వంకర్లు తిప్పుతూ కోటయ్య పరోక్షంలో అనడం వర్ధని చెవిన పడింది.

"నా పెద్దమ్మ! నా పెదనాన్న! నా యిష్టం" అని అరిచి చెపుదామని అనుకుం





టుంది వర్ధని అలాంటప్పుడల్లా!

కానీ ఎందుకో ఒక్క మాటా వర్ధని పెదవి దాటదు. వర్ధనికి సరోజకన్నా ఆమెని ఖండించని జయమ్మమీద కోపం వస్తోంది. పెద్దమ్మ ఒక్కసారి గట్టిగా ఝాడించి పడేస్తే వదిన తిక్కకుదరదూ? వదినా వదినా వంకాయ్! పోనీ వేణన్నాయితో చెపితే? ఎందుకో తనను నిరాశలో ముంచి ఊరికి వచ్చేసినప్పటినుంచి వేణుకూడా పరాయివాడిలాగానే అన్పిస్తున్నాడు. పెద్దమ్మే సరిపోతుంది ఆ వదినకి! పెద్దమ్మ వదిన అన్ని మాటలంటున్నా పట్టించుకోనట్టు వుంటుందంటే పెద్దమ్మకి తనమీద శ్రద్ధ తగ్గిపోయిందా?

★ ★ ★

"వేరుశనక్కాయలు పచ్చిమీదే అమ్మితే తూకం బాగా వచ్చుండేదికాదూ? అయినా, ఊళ్లో ఎవరైనా ఇంకా అట్టిపెట్టుకొని వున్నారా? ఏంటో!" పొద్దున్నే పందిట్లో గట్టుమీద కూర్చుని మురళి తనలోతనే గొణుక్కుంటున్నాడు.

సూపర్ సంచులన్నీ కలిపి కుట్టించిన పెద్దపట్టా పందిరి ముందు పరిచివుంది. కురప, దానం లోపలినుంచి ఒక్కో బస్తా తెచ్చి పట్టామీద దించుతున్నారు. బీసి, మాణిక్యం ఒక్కో సంచిమూతి విప్పి వేరుశనక్కాయల్ని పట్టామీదకి గుమ్మరిస్తున్నారు. వర్ధని నిద్రలేచి వచ్చి మురళి పక్కనే కూర్చుని వుంది.

"మాణిక్కెం, ఆడు గుమ్మరిస్తాడుగానీ నువ్వు పట్టామీద కాయల్ని పరవరాదూ? " కోటయ్య ఎక్కడినుంచో కేకేసాడు.

కుప్పలుగా పోసిన వేరుశనక్కాయల్ని మాణిక్యం అలికినట్లుగా పట్టామీద పరుస్తోంది. వర్ధనికి కూడా సరదా వేసింది. గబుక్కున తానూ లేచి మాణిక్యం పక్కన కూర్చుంది. తనూ మాణిక్యంతో పాటు బీసిగాడు పోసిన కుప్పల్ని సర్దడం మొదలెట్టింది. మురళి అక్కడే కూర్చుని వాణిని కూడా కేకేసాడు. ఇద్దరూ మాణిక్యంతో పంతాలుపడి పట్టా అంతా పరిచారు.

ఇన్నాళ్లు వేరుశనక్కాయల బస్తాలుంచిన గది ఖాళీ అవడంతో బూజు కొడదాం రమ్మని మాణిక్యాన్ని కేకేసింది. ఓ పక్క నుంచి లలిత, సరోజ బూజులు కొడుతున్నారు. జయమ్మ పాపని చంకనేసుకొని ఆరబోసిన వేరుశనక్కాయల దగ్గరకి లోపలకి తిరుగుతోంది. అటూఇటూ తిరిగి విసుగుపుట్టి, వర్ధనికి వాణికి కర్రలిచ్చి చెరోపక్క కాపలా పెట్టింది. మురళి పొలానికెళ్లడానికి బయలుదేరాడు.

"అబ్బాయ్, ఇళ్లు బూజులు కొడుతున్నాం! అలుకుమన్ను తోలించరా సాయంకాలం!" జయమ్మ కేకేసి చెప్పింది. అట్నుంచీ ఇట్నుంచీ ఎగురుతోన్న కాకుల్ని అదిలిస్తున్నారు వాణి, వర్ధని. కోడిపుంజు ఒకటి కాళ్లతో కంకుల్ని పట్టామీద నుంచి కిందికి తోసేస్తోంది.

వాణి కాసేపటికి ఓసారి ఓ కాయ తీసుకొని నోట్లో వేసుకుంటోంది.

వర్ధనికి మాత్రం అన్ని వేరుశనక్కాయల్ని ఒక్కసారిగా చూసేసరికి వాటిమీద ఇష్టమే పోయింది. కాయలంటే వెగటుపుట్టినట్లుగా అనిపించింది.

కోటయ్య చావిట్లో పని అయ్యి పందిట్లోకి వచ్చాడు. పిల్లలిద్దరూ కర్రలు పుచ్చుకొని కాకుల్ని, కుక్కల్ని తరమడం చూసి జయమ్మని కేకలేశాడు.

"పిల్లల్నేంటిట్టా ఎండలో కూచోబెట్టా? వడదెబ్బ తగలదూ? "

పందిట్లో మంచాలు వాల్చి ఇద్దర్నీ నీడపట్టున కూర్చుని కాపలా కాయమన్నాడు. తనూ నార తెచ్చుకొని, ఇంకోమంచం మీద కూర్చుని తాళ్లు పేనడం మొదలు పెట్టాడు. జయమ్మ పాపని తీసుకొచ్చి కోటయ్య పక్కనే కూర్చోబెట్టింది.

"దీన్ని ఇక్కడ వదుల్తున్నావే! నార చిక్కు

పడుద్ది!" కోటయ్య చురుగ్గా అన్నాడు.

"పోనీ నేను ఆడిస్తాలే పెదనాన్నా" వాణి పాపని చంకనేసుకొంది.

వర్ధని ఉత్సాహంగా కాయల్ని చెల్లాచెదురు చేస్తోన్న కోడిపుంజు వెంటపడింది. వాణినిగానీ, పాపని గానీ పట్టించుకోలేదు.

జయమ్మ కొంగు తలచుట్టూ తిప్పి వేసుకొని తనూ ఓ చీపురు తీసుకొని వెళ్లింది.

ఆ రోజు సాయంకాలం మురళి, కురప, దానంలను తీసుకొని పెందలకాడే ఇంటికి వచ్చాడు. కురప, దానం రాగానే ఉదయం గుమ్మరించిన గోనెసంచుల్ని శుభ్రంగా దులిపి, కాయలు నింపడం మొదలెట్టాడు. కురప, దానం సంచిని తెరిచి చెరోపక్కా పట్టుకొంటే బీసి, మాణిక్యం కాయలతో నింపిన తట్టల్ని తెచ్చి సంచిలోకి గుమ్మరిస్తున్నారు.

మురళి కాటా సర్ది పెట్టాడు. గోనెసంచి నిండగానే కురప, దానం సంచికి చెరోపక్కా పట్టుకొని, ఎత్తి కాటాబల్ల మీద పెట్టారు. మురళి కాగితం మీద బరువు వేసుకొని, బస్తా మీద ఎర్రరంగు అద్దిన పుల్లతో నెంబరు రాశాడు. కురప, దానం కాటావేసిన బస్తాల్ని పందిట్లో ఒకదాని తరువాత ఒకటి ఆన్చి పెట్టారు.

వర్ధని, వాణి కూడా ఉత్సాహంగా తట్టలు తెచ్చుకొని, మాణిక్యంతో పాటు నింపడం మొదలు పెట్టారు.

మురళి కూడా వాళ్లను ఉత్సాహపరుస్తూ, "తొందర తొందరగా కాయలు ఎత్తారనుకో, మీ ఇద్దరికీ పండక్కి మంచి గౌనులు తెస్తాను. సరేనా!" అన్నాడు.

వర్ధని, వాణి అంతవరకూ కేవలం సరదాగా చేస్తున్న పనిని ఉత్సాహంగా, వేగంగా, పనికోసమే పనిగా చేయసాగారు.

ఇంతలో కోటయ్య కూడా వచ్చి దబ్బనంలోకి పురికొస ఎక్కించి నిలబెట్టిన నిండు బస్తాల మూతులు కుట్టడం మొదలెట్టాడు.

ఒకే తట్టలోకి వర్ధని, వాణి చెరోపక్క నుంచి కాయలు ఎత్తుతున్నారు. పని హుషారులో వర్ధనికి వాణిమీద కోపతాపాలన్నీ మాయమయ్యాయి. ఎవరి దోసిట్లో కాయలు ముందు తట్టలో పడతాయన్న పోటీకన్నా, మాణిక్యం తట్టకన్నా ముందు నింపేయాలన్న పోటీ ఇద్దరి మధ్య సమన్వయాన్ని తెచ్చింది. చెరోపక్కా తట్ట పట్టుకొని మాణిక్యంకన్నా ముందు బస్తా దగ్గర పరుగులు పెడుతుంటే కాయలతో పాటు వారి నవ్వులూ నాలుగుపక్కలా చిందుతున్నాయి. కాయలు ఎత్తుతున్న వేగానికి లేస్తోన్న ధూళి వారిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నా పట్టించుకోలేదు. కొత్తగౌను రాబోతోందన్న ఉత్సాహం ముందు ఆ కారుదుమ్ము సువాసనలాగే అనిపించింది ఇద్దరికీ. ఓ చేత్తో దుమ్మును విసురుకొంటూ, దగ్గుతూ గబగబ తట్టలు నింపసాగారు.

వాణికి అలుపొచ్చినపుడు ఆగి కుతూహలంగా అడిగింది, "వర్ధనక్కా, మురళన్నాయి ఎట్లాంటి గౌను తెస్తాడంటావ్?"

పైకి అనలేదుకానీ వర్ధని మనసులోనూ అలాంటి ప్రశ్నే కదలాడుతోంది. పగలంతా బాగా అలసిపోవడంతో సాయంకాలం స్నానం చేయగానే వర్ధని నిద్రపోయింది.

వేణు తెల్లవారుఝామున కాయల బస్తాలన్నీ ట్రక్కులో పెట్టించాడు. పైన సూపర్ కాగితపు పట్టా పరిపించాడు. నిద్రపోతోన్న మురళిని లేపాడు. మురళి స్నానం చేసి తయారయ్యే లోపల, వేణు ట్రాక్టరును శుభ్రంగా తుడిచి వుంచాడు. మురళి ట్రాక్టరు కదిలించగానే ఆ శబ్దానికి వర్ధని లేచి కూర్చుంది.

జయమ్మ పండక్కి కావలసిన సరుకుల లిస్టు, సంచులు మురళికి అందించింది. వర్ధనికి విషయం అర్థమయ్యి అక్కడికి పరిగెత్తుకు వెళ్లేటప్పటికి ట్రాక్టరు రోడ్డు మీదికి వెళ్లింది. వర్ధని ట్రాక్టరు వెనకాలే పరిగెత్తుతూ కేకలు పెట్టింది.





"మురళన్నాయ్... నాకు మంచి గౌను తీసుకురా!" ఒక్క క్షణం ఆగి మళ్లీ అంది.

"వాణీకి కూడా!"

మురళి ట్రాక్టరు వేగం తగ్గించి, వెనక్కి తిరిగి చూస్తూ చెయ్యి ఊపి వెళ్లిపోయాడు. వర్ధని మళ్లీవెళ్లి నిద్రపోయింది.

వర్ధని నిద్రలేచేసరికి బాగా పొద్దెక్కిపోయింది. కురుప చావిడిదగ్గరే మట్టి, పేడ కలిపి, అలకడానికి వీలుగా, కడవతో నీళ్లు గుమ్మరించుకొంటూ, కాళ్లతో తొక్కుతున్నాడు.

లలిత, సరోజ ఇంట్లో సామాను ఒక్కొక్కటే తెచ్చి పందిట్లో పెడుతున్నారు. మాణిక్యం సాయం చేస్తోంది. జయమ్మ ఎండలో మంచాలు వేసి, పరుపులూ దిళ్లూ ఎండలో వేస్తోంది.

పిల్లలకి స్నానాలవీ కానిచ్చి చపాతీలు తినిపించారు. పొలానికి క్యారియర్లు సర్దేశారు. జీతగాళ్లకి భోజనాలు పెట్టేశారు.

వర్ధని వాళ్ల హడావుడి చూసి చావిట్లోకి వెళ్లింది. అక్కడే వాల్చివున్న మంచంమీద కూర్చుంది. మురళన్నాయి తేబోయే కొత్త గౌను గురించి ఆలోచిస్తూ కాలప్పాస నములుతూ వుంది. దాహమేసి వంటింట్లోకి పరిగెత్తబోయింది. వర్ధని వంటింటి గుమ్మంలో కాలుపెట్టక ముందే జయమ్మ కేకలు పెట్టింది.

"వర్ధనమ్మా కాస్తాగు! గదిలోకి అప్పుడే రామాకు!"

వర్ధని ఎత్తిన కాలును గడపమీదే ఆన్చి లోపలికి తొంగిచూసింది. లలిత, సరోజ, జయమ్మ తలో పక్కనుంచి అలుక్కుంటూ వస్తున్నారు. పొద్దుటిదాకా చిన్నచిన్న గుంటలతో పెచ్చులు లేచిన నేలపై వెలిసిపోయిన ముగ్గులతో పొయ్యి చుట్టూ చిందిన నూనె మరకలతో చిందరవందరగా వున్న వంటిల్లు వారందరి చేతుల్లో అద్భుతంగా మారిపోయివుంది. చాకచక్యంగా పాతనేల మీద కొత్తమట్టి అద్దిన వారి అరచేతుల్ని ఆశ్చర్యంగా చూసింది. నుదుటికి పట్టిన చెమటని ఏమాత్రం పట్టించుకోకుండా ఛలోక్తులు విసురుకుంటూ చలాకీగా పని చేసుకుంటున్నారు.

"ఏంటే అమ్మాయ్, అట్టా నిలబడిపోయావ్?" జయమ్మ పనాపి తలెత్తి చూసింది.

"మంచినీళ్లు కావాలి!"

"అదుగో నీళ్ల కడవలన్నీ అట్టా ఆ చూరు కిందపెట్టాం, పోయితాగు. పిల్లలెవరూ గది ఆరేదాకా ఇట్టా రామాకండి"

వర్ధని అలాగేనని తలాడించి, మంచినీళ్లు తాగి బయటకు పరిగెత్తింది. నేరుగా ఇంటి ముందున్న చెట్టు కిందికి వెళ్లి ఓ బండ రాయి చూసుకొని దానిమీద చతికిలబడింది. దూరంనుండి ఏ వాహనం వస్తున్నా మురళన్నాయి ట్రాక్టరేమోనని ఆశగా చూస్తోంది.

ఒంటిగంట బస్సుకు ముకుందం వచ్చాడు. తనతోపాటు చాలా సామాను తీసుకొచ్చాడు. మురళన్నాయి గౌను ఈయనతో ఏమైనా పంపివుంటాడా? వర్ధని ఆ సామాను వంకే చూస్తూ అనుకొంది.

ముకుందాన్ని చూడగానే వాణి గెంతులేస్తూ సంబరంగా వచ్చింది.

ఇల్లంతా అలికి వుండడంతో ముకుందం పందిట్లోనే కూర్చున్నాడు. జయమ్మ పిల్లలకి, కోటయ్యకి ముకుందంతోపాటు పందిట్లోనే భోజనం పెట్టింది. ముకుందం తెచ్చిన సామాను అక్కడే ఓ పక్కగా వరసగా పెట్టి వున్నాయి. వర్ధని తన కొత్తగౌను దాంట్లో వుందని ముకుందం చెపుతాడేమోనని కాసేపు చూసింది. ముకుందం అసలు ఆ సామాను వంకే చూడకుండా, తన బ్యాగులోంచి ఓ పుస్తకం తీసి చదువుకుంటున్నాడు. వర్ధని మళ్లీ వెళ్లి నిరాశగా ఆ చెట్టు కిందే కూర్చుంది.

పొలాన్నుంచి కురుప, దానం తిరిగొ



చ్చారు. కాస్త వెనగ్గా వేణు కూడా వచ్చాడు. చీకటి తెరలు కమ్ముకొస్తున్నా చెట్టుకిందే కూర్చున్న వర్ధనిని కేకలేసి, ఇంట్లోకి తీసుకొచ్చాడు. వర్ధని ఇంట్లోకి వచ్చేసరికి ఇల్లంతా మారిపోయి వుంది. అప్పుడే వెలిగించిన లాంతర్ల వెలుతురులో కొత్త ముగ్గులు వింతగా మెరుస్తున్నాయి.

జయమ్మ వర్ధనికి స్నానం చేయించి, భోజనం పెట్టింది. వర్ధని నిద్రముంచుకొస్తుంటే జయమ్మతో చెప్పింది, "పెద్దమ్మా! మురళన్నాయి రాగానే నన్నులేపు! మర్చిపోమాక!"

"అలాగేలేవే, నువ్వు పడుకోముందు!" అంటూ జయమ్మ మంచం వాల్చి పక్కవేసింది. వర్ధని మురళితేబోయే కొత్తగౌనులో తనను ఊహించుకొంటూ కమ్మటి కలలు కంటూ నిద్రపోయింది.

★ ★ ★

జయమ్మ, సరోజ పిండి రుబ్బుతుంటే లలిత గారెలు వొండుతోంది. ఆ కమ్మటి వాసన పీలుస్తూ వర్ధని ఉదయపు ఎండలో తలంటుకున్న జుట్టును ఆరబెట్టుకొంది. జయమ్మ పిండి మొత్తం గిన్నెలోకి తీసి సరోజకిచ్చింది. రోలు కడిగింది.

"కాస్త ఉప్పు చూడక్కాయ్," అంటూ లలిత అందించిన గారె ముక్కను నోట్లో వేసుకొని వర్ధని దగ్గరకి వచ్చింది జయమ్మ

"ఏంటే అమ్మాయ్ అట్టా కూచున్నా? పద జడేస్తాను!"

"ఉండు పెద్దమ్మ, మురళన్నాయిని రానీ!"

వర్ధని దడిపైనుంచి రోడ్డును చూస్తూ అంది. ఇంతలో ఎవరిదో బండి వచ్చి ఇంటి ముందు ఆగింది.

"చుట్టాలెవరో వచ్చారు చూడు!" కోటయ్య జయమ్మని కేకేశాడు.

జయమ్మ గబగబ వాకిట్లోకి వెళ్ళింది. అప్పటికే బండి దిగి ఆడవాళ్ళు కొందరు లోపలికి వస్తున్నారు. వేణు జయమ్మ దగ్గరకి వచ్చి "అమ్మా పక్కవూరు పెద్దరెడ్డిగారి ముఠా వస్తున్నారు" అని చెప్పి, వారికి ఎదురెళ్ళారు. జయమ్మ వాళ్ళందర్నీ ఇంట్లోకి తీసుకెళ్ళింది. మంచాలు వాల్చి కూర్చోమనింది. అప్పటికే సరోజ మంచినీళ్ళ చెంబు, గ్లాసులు తీసుకొచ్చింది.

వాళ్ళు మంచినీళ్ళు కూడా తీసుకోకుండా జయమ్మ దగ్గరకి వెళ్ళి "ముందు నువ్విట్లా నుంచోమ్మా!" అని పిలిచారు.

జయమ్మ ఎందుకంటూనే వచ్చి నిల్చుంది. వర్ధని జయమ్మ చెయ్యి లాగుతూ 'ఎందుకు?' అని సైగ చేసింది. జయమ్మ మొహం అయోమయంగా పెట్టింది.

పెద్దరెడ్డి భార్య జయమ్మ చేతిలో ఏదో పెట్టి, గబుక్కున కాళ్ళకు నమస్కారం పెట్టింది.

జయమ్మ కంగారుగా వెనక్కి ఓ గెంతు గెంతింది. "ఇదేంటమ్మాయ్" అంటూ.

"ఏం లేదమ్మా! బంగారం ఇస్తున్ను! గంతే!"

జయమ్మ తేరుకొనేలోపలే ఒకళ్ళ తరువాత ఒకరు అందరూ అలాగే చేశారు. తరువాత ముకుందాన్ని, కోటయ్యను, లలితను పిలుస్తూ తలా ఓ పక్క వెళ్ళారు. వర్ధని పెద్దరెడ్డి భార్య వెనకే వెళ్ళింది.

ముకుందం ఆ తతంగంతో కంగారుపడి, నెమ్మదిగా అడిగాడు, "మరేమీ అనుకోకండమ్మా- మీ ఆచారాలు మాకు అంతగా తెలీదు..."

"ఏమీ లేదు చిన్నాన్నా... బంగారం పుచ్చుకున్నాంగా! ఇక మనం వీళ్ళందరికీ బహుమతులు ఇవ్వాలి... అంతే!" వేణు నవ్వుతూ అన్నాడు. వర్ధని ముకుందం ఏమిస్తాడోనని ఆసక్తిగా చూసింది. "గట్లేం కాదు వేణన్న! మీరు మంచిగుండాలె! మేం మంచిగుండాలె! అందుకే గాదూ పండుగపూట బంగారం పంచుడు!" పెద్దరెడ్డి చెల్లెలు మనస్ఫూర్తిగా అంది.





"ఏం ముకుందమన్నా! మా వూరి కెల్లివొస్తలేరూ?" అడిగింది పెద్దరెడ్డి భార్య.

"ఎక్కడమ్మా, ఈ పనులమీద తిరుగుతూ...! అయినా ఇక్కడి పనులన్నీ పిల్లలిద్దరు చూసుకుంటున్నారు. పైనుంచి అన్నయ్య కూడా..."

"నువ్వు ఏమెరగనట్లే వుంటవ్‌లే అన్న! కలిసున్నరు! కష్టపడ్డరు! మేం చూస్తుంటనే పొలాలు కొంటిరి. మేం పాడుపెట్టిన పొలాల్లనే బంగారం పండిస్తిరి!"

"ఏందే ఓదినా యవ్వారం పెట్టినవ్? అన్న జల్ది రమ్మనలే... పద పద!" పెద్దరెడ్డి చెల్లెలు హడావుడిగా వచ్చి హడావుడిగా అంది.

వాళ్లు చనువుగా వంటింట్లోకి వెళ్లి అందరితో గలగల మాట్లాడుతూ తిరిగారు.

జయమ్మ, లలిత గబగబ పాయసం, గారెలు పెట్టారు.

సరోజ మంచి నీళ్ళందించింది.

పెద్దరెడ్డిగారి చెల్లెలికి ముగ్గులు నచ్చితే, మరదలికి గారెలు నచ్చాయి.

"ఎంత సుతారంగా చేస్తున్రు!" అంటూ ఆశ్చర్యపోతూ మెచ్చుకుందామె.

"సందేళ బతకమ్మలాడతన్నం. మా వూరికి రాకూడదా లలితమ్మ?" పెద్దరెడ్డి

భార్య ఆహ్వానిస్తూ అంది.

"రాతిరికి అరికథ కూడా ఆడుతున్రు!"

"పండుగపూట ఇప్పుటికిప్పుడంటే..." లలిత ఆగి మళ్లీ అంది "ఇంకోసారి ఎప్పుడైనా తప్పక వస్తాం!" లలిత మృదువుగా నవ్వుతూ అంది.

"రావాలె! వచ్చిపోతుంటనే బాగుంటది!"

జయమ్మ అందరికీ తాంబూలాలు ఇచ్చింది.

వాళ్ళందరూ హడావుడిగా బండెక్కి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళాక వర్ధని జయమ్మ చెయ్యి వూపుతూ అడిగింది, "పెద్దమ్మా, వాళ్లిచ్చిన బంగారం ఏం చేస్తావ్?"

"నీ మెళ్లోకి గొలుసు చేయిస్తాలేవే!" జయమ్మ నవ్వుతూ లోపలకి వెళ్లింది. వర్ధనికి ఆ సమాధానం తృప్తికలిగించలేదు. పరిగెత్తుకొంటూ కోటయ్య దగ్గరకి వెళ్లింది మళ్లీ అదే ప్రశ్న అడిగింది. కోటయ్య మూసి వున్న గుప్పిటని వర్ధనివైపు చాచాడు. వర్ధని గబుక్కున తెరిచి చూసింది.

కోటయ్య చేతిలో చిన్ని చిన్ని ఆకులున్నాయి. అంతే! బంగారం లేదూ! ఏమీ లేదు!

"ఆవిడేమిటీ అలా చెప్పింది?" వర్ధని ఆశ్చర్యంగా అడిగింది.

"ఈ రోజు ఈ జమ్మి ఆకులే బంగారం! చెట్టుకు పూజచేసి ఆ ఆకు ఇలా ఇస్తారు" కోటయ్య వివరిస్తూండగానే ట్రాక్టరు వచ్చిన శబ్దం వినిపించింది.

వర్ధని పరుగుపరుగున రోడ్లోకి వెళ్ళి నిల్చుంది.

వేణు కూడా అక్కడే నిల్చుని ట్రాక్టరును వెనక్కు తిప్పుతుంటే చేతులాడిస్తూ అంటున్నాడు, "రైట్... రైట్... రానీ... ఇంకా రానీ!"

వర్ధని కూడా అలాగే చేతులాడిస్తూ, అలాగే అరుస్తూ నిల్చుంది, ఉత్సాహంగా!





మురళి ట్రాక్టరు ఆపి, కిందకు దిగగానే వర్ధని విప్పారిన మొహంతో ఎదురుగా వెళ్ళి నిల్చుంది.

"అన్నాయ్... అన్నాయ్... నాకు గౌను తెచ్చావా?" ఆశగా అడిగింది.

"వచ్చీరాగానే నీ సణుగుడేవిటే? గౌను లేదు! ఏం లేదు! పో! అవతలికి పోయి ఆడుకో! పో" మురళి విసుక్కున్నాడు.

వర్ధని తోక తొక్కిన తాచులా విసురుగా తలెత్తింది.

"ఎందుకట్లా గుడ్లపిడతలా చూస్తున్నావ్? ముందిక్కణ్ణించి పో! పోయి ఆడుకోమన్నానా?" మురళి అదే ధోరణిలో తీవ్రంగా కసురుకున్నాడు.

మొదటిసారీ, రెండవసారీ మురళి వర్ధని అహంమీద దెబ్బకొట్టాడు. వర్ధని గిర్రున వెనక్కు తిరిగి చావిడి దగ్గరకి పరిగెత్తింది. టైర్లబండి వెనకగా నిల్చుంది. కోటయ్య గిత్తలకి మేత వేస్తున్నాడు.

మురళి పందిట్లోకి రాగానే ఓ పాకెట్టు తీసి సరోజ చేతికివ్వడం కనిపించింది.

"ఇదుగో వదినా, నువ్వు ఇలాంటిదేగా తెమ్మన్నావు!" అంటూ వుండి వుంటాడు వర్ధని కోపంగా అనుకొంది. అక్కడినుండే నాలుక బయటపెట్టి వెక్కిరించింది.

అప్పటికే స్నానం చేసి వున్న పాపకి మురళి తెచ్చిన కొత్త గౌను తొడగడం, అందరూ ఒకరి తరువాత ఒకరు మెటికలు విరిచి, పాపను ముద్దుచేయడం వర్ధనికి కనిపిస్తూనే వున్నాయి. ఎర్ర బుట్టచేతుల గౌనులో బొద్దుగా వున్న పాప నిజంగానే ముద్దొస్తోంది.

వర్ధని మనసు భగ్గుమంది. వాణి కూడా పాపని ముద్దుచేస్తోంది.

'ఈ తిక్కపిల్లకి ఏమీ గుర్తుండదెందుకు?' వర్ధనికి మొదట వాణిమీద కోపమొచ్చింది. 'మురళన్నాయి వేరుశనక్కాయలు తట్టల్లోకి ఎత్తితే ఇద్దరికీ గౌనులు తెస్తానన్నాడు కదా! మరి వాణి ఆ సంగతే మరిచిపోయి ఆ పిల్ల రాక్షసితోపాటు గెంతులేస్తుందే?'

వర్ధనికి వాణిమీద నిన్న కలిగిన స్నేహ భావం మాయమయింది. మళ్ళీ ఎప్పటి లానే వాణి తన ఆగర్భశత్రు శిబిరంలోని ముఖ్యప్రాణి అయిపోయింది.

'వేణన్నాయి ఊరికి తీసుకెళ్తానని అక్కడే వదిలేసి వచ్చాడు! మురళన్నాయి గౌను తేకుండానే వచ్చాడు! అందరూ అబద్దాలకో రులు!' వర్ధని కసిగా తిట్టుకొంది.

వర్ధని టైరుబండికిందే కూలబడింది. అక్కడే వున్న కోళ్లగంపమీద వర్ధని దృష్టిప డింది. కళ్ళు గౌనుకి తుడుచుకొని, ఆ గంప కింద దూరి, ముడుచుకు కూర్చుంది. వర్ధని కాస్త అటూఇటూ మెదిలినా గంప కదులు తోంది. వర్ధని మెల్లిగా గంపతో పాటు కాస్త ముందుకు జరిగింది. గంపకున్న సందు ల్లోంచి ఇంటివైపు చూసింది. పందిట్లో పాప ఇంకా రబ్బరుబొమ్మలా ఒకరిచేతుల్లోంచి ఇంకోరి చేతుల్లోకి మారుతోంది.

'ఇవ్వాళ ఎవ్వరు వెతికినా దొరకకూడదు. వూరంతా తిరిగి తిరిగి, వెతికివెతికి వాళ్ళ తిక్క కుదరాలి!" వర్ధని దృఢనిశ్చయానికి వచ్చింది.

ఇంతలో పందిట్లోకి జీతగాళ్ళు, బుడ్డాడు, కూలీలు అందరూ వచ్చారు ఒక్కొక్కరుగా!

ఇప్పుడేం జరగబోతోందో వర్ధనికి తెలుసు.

ఉదయంనుంచీ జయమ్మ, లలిత, సరోజ నడుమెత్తకుండా వంటలు చేస్తోంది వారికో సమే. సీమచింత చెట్టుకింద, గాడులు తీసి పొయ్యిలు తయారుచేశారు. పక్కింటి అమ్మ లక్కలు కూడా పొద్దెక్కాక వచ్చి చేయి కలి పారు. వంటలు ఎప్పుడో తయారయిపో యాయి.

వాళ్ళందర్నీ పందిట్లో కూర్చోబెట్టి, భోజ నాలు పెడుతున్నారు.

ప్రతి పండక్కీ మొట్టమొదట విస్తట్లో అందరికి పూర్ణాలు తనే వడ్డిస్తుంది. ఆ తరువాత మిగిలిన వాళ్ళు గారెలు, పాయసం, పులిహోర, కూరలు వగైరాలు వడ్డిస్తారు. వర్ధనికి ఉసూరుమనిపించింది. 'ఎవరూ ఇటు పక్కకి రావడంలేదు. కనీసం వెతకాలను కోవడంలేదు. పోనీ తనే వెళ్లి పోతే? ' వర్ధని ఆశగా అటువైపు చూసింది.

మురళి పాపని ఎత్తుకొని, నవ్వుతూ పూర్ణాలు వడ్డించడం కనిపించింది. వర్ధనికి వొళ్ళు మండిపోయింది. కదలకుండా అలాగే కూర్చుంది.

గంపలోనే వంగి కూర్చుని కూర్చుని మెడ నొప్పి పుడుతోంది. వర్ధని మెల్లిగా వేళ్ళతో మెడ సవరించుకుంది. వంకాయ పులుసు వాసన గాలికి తేలి వచ్చింది. వర్ధని దిగు లుగా అనుకొంది, 'తను వెళ్ళేసరికి అన్నీ అయిపోతాయేమో!'

చూస్తుండగానే వాళ్ళ భోజనాలవ్వడం, విస్తళ్ళు ఎత్తేయడం, పందిరి శుభ్రం చేయడం అన్నీ అయిపొయ్యాయి. అందరూ మళ్ళీ పందిట్లో కూర్చున్నారు. మురళి, వేణు నిన్న ముకుందం తెచ్చిన అట్టపెట్టెల్ని పంది ట్లోకి తెచ్చారు. వాటిని తెరిచి స్టీలు క్యారి యర్లు బయటకు తీశారు.

కోటయ్య అక్కడే మంచంమీద కూర్చుని వున్నాడు. ముకుందం కొయ్యకుర్చీలో కూర్చుని వున్నాడు. మురళి వరుసగా పేర్లు చదువుతున్నాడు. వేణు అందిస్తుంటే కోటయ్య వాళ్ళకి తలా ఓ క్యారియర్ ఇస్తు న్నాడు. ప్రతి ఏడాదీ తను బహుమతులు పంచేప్పుడు వాళ్ళ విప్పారిన మొహాలు, ఎక సెక్కాలు, ముసిముసి నవ్వులు వర్ధనికి గుర్తొచ్చాయి.

రెండోదో, మూడోదో క్యారియర్ ఇచ్చాక వేణు, మురళిని ఆపమన్నట్లు సైగ చేశాడు. కోటయ్యవైపు తిరిగి ఏదో అన్నాడు. ఆ తరు వాత ఆ పక్కనే గట్టుమీద కూర్చున్న జయ మ్మవైపు తిరిగి ఏదో అన్నాడు.

వర్ధని తన గురించే అయితే బావుణ్ణు అనుకొంది. ఆత్రంగా, ఆశగా వారివైపే చూస్తోంది. ఎంతసేపని కదలకుండా

కూర్చోవడం! వర్ధని అసహనంగా అనుకొంది.

వేణు మళ్ళీ మురళివైపు తిరిగి ఏదో అన్నాడు. అందరూ కంగారుగా లేచి అటూ ఇటూ పరిగెత్తారు.

ప్రతి పండక్కీ తనేగా వాళ్ళందరికీ బహుమతులు పంచేది. పోనీలే వేణన్నాయి అయినా గుర్తుంచుకున్నాడు. మురళన్నాయి మంచాడే కాడు! ఇప్పుడు చూడాలి తమాషా!

ఒక్కొక్కళ్ళు చెమట్లు తుడుచుకుంటూ పందిట్లోకి వచ్చి మళ్ళీ వెళుతున్నారు.

"వర్ధనీ... వర్ధనమ్మా..." అన్న పిలుపులతో ఆవరణంతా దద్దరిల్లిపోయింది.

అందరి హడావుడి చూసి వర్ధని మొహాన సన్నటి వెలుగురేఖ తొంగిచూసింది. తనను వెతకగలరా వాళ్ళంతా? ఊహు! అందరూ మురళన్నాయిని బాగా తిట్టాక అప్పుడు తనే పందిట్లోకి వెళ్తుంది! అంతే! అలాగే చేయాలి!

వర్ధని మెడ సవరించుకొని, గౌను అంచులు గంపలోకి జాగ్రత్తగా మడుచుకొంది. వాళ్ల హడావుడి చూస్తూవుంది.

తను అక్కడికి వెళ్ళగానే ఏమవుతుంది? పెద్దమ్మ, పెదనాన్న తనని వాటేసుకొని కళ్ళనీళ్ళు పెడతారు. ముకుందం మళ్ళీ తన పుస్తకం తీసుకొని చదువుకుంటాడు. లలిత నుదురు కొట్టుకొంటూ, "ఈవిడ గారితో అక్కడా రోజూ ఇదే గొడవ! వేగలేక చస్తున్నాను!" అంటుంది.

వెంటనే తను, "మరి నన్నెందుకు పెదనాన్న దగ్గరనుంచి దూరంగా తీసుకెళ్ళిపోయారు? పెద్దమ్మ దగ్గరే వుంచచ్చుగా? ఆ వాణీ... అదే ఆ పిలక జడల చాడీకోరు నన్ను మాటిమాటికి ఎందుకు తిట్టిస్తుంది? ఈ లలిత గొడ్డునుబాదినట్లు బాదుతుంది. వేణన్నాయి నన్ను అక్కడినుంచి తీసుకొస్తానని చెప్పి నాతో చెప్పాపెట్టకుండా ఎందుకు వచ్చేసాడు? మురళన్నాయి... చివరికి మురళన్నాయి కూడా! ఆ పిల్ల రాక్షసికి గౌను ఎందుకు తెచ్చాడు? అదేమైనా తట్టల్లోకి కాయలు ఎత్తిందా? రోజంతా కోళ్ళు రాకుండా కాపలా కాసిందా? హాయిగా మంచంమీద పడుకుంది! అంతేగా! మురళన్నాయి అబద్ధాలు చెప్పాడు! వేణన్నాయి అబద్ధాలు చెప్పాడు! అందరూ... అందరూ చెడ్డవాళ్లే! ఎవరికీ నేనంటే ఇష్టంలేదు! నేను లేకపోతేనేం మీకు ఆ భూతాలు రెండూ వున్నాయిగా! హాయిగా వుండండి! నేను గంపకింద వుంటే మీకెందుకూ? ఎట్లా పోతే మీకెందుకూ?" అని ఖచ్చితంగా చెప్పేస్తుంది.

వెంటనే పెదనాన్నకి కోపమొచ్చి లలితని, వేణన్నాయిని, మురళన్నాయిని బాగా తిట్టేస్తాడు.

"ఆ లలితమ్మ చెపుతుంటే ఏవో అనుకున్నానే అమ్మాయీ. నువ్వు గొడవచేసిందంతా మాకోసమా? నా తల్లే! నా బంగారే! ఎంత దిగులు పడ్డావే బిడ్డవి! ఎంత చిక్కిపోయావూ! ఆ దరిద్రపుగొట్టు చదువుకోసం నిన్నింతగా బాధపెట్టాలా? అట్టాంటి చదువు చదివితే ఎంత? చదవకపోతే ఎంత? అంతగా అయితే మన పంతులు బడికే వెళుదువులే! ఇంక నిన్ను ఎవరు వద్దన్నా కాదన్నా నేను వుంచుకుంటాగా!" అని అంటుంది పెద్దమ్మ ఖచ్చితంగా.

అయ్యో, మర్చేపోయాను! అసలు అన్నిటికీ మూలం ఆ ముచ్చు ముకుందం! ఏవీ ఎరగనట్టు నింపాదిగా పుస్తకమెలా చదువుకుంటున్నాడో చూడు! అతన్ని కూడా పెదనాన్నతో బాగా తిట్టించాలి!

ఎవరో చావిడివైపు వస్తున్నారు వర్ధనిని పిలుస్తూ. వర్ధని ఆలోచనలను ఆపి, ఊపిరి బిగబెట్టింది. వచ్చింది వేణు! చావిట్లో అంతా వెతికి కురుపని కేకేశాడు.

"కృపా... ఆ మొచ్చు మీదేమయినా




వుండేమో చూడు ఎందుకైనా మంచిది!" కురుప మెచ్చుమీదికి ఎక్కాడు.

"వర్ధనీ!" ఖంగుమంటోన్న వేణు గొంతు విని, అటువైపు వర్ధని భయం భయంగా చూసింది. వేణు చావిడి గుంజకు చేయి ఆన్చి నిల్చుని వున్నాడు.

'వేణన్నాయి ఎందుకిలా చేసావని కోప్పడ తాడేమో! ఇంతమంది ముందూ కోప్పడితే అసహ్యంగా వుండదూ?' వర్ధనికి బదులు పలకాలంటేనే కంగారుపుడుతోంది. లోప ల్నించి సన్నని వొణుకు ప్రారంభమైంది. భయంతో చెమట్లు పడుతున్నాయి. వర్ధని గట్టిగా కళ్ళు మూసుకొని ధైర్యం కూడగట్టు కుంటోంది. తను చెప్పాలనుకొన్నవన్నీ మననం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తోంది.

"వేణూ... ఈవేళప్పుడు కోళ్లనెవరు కప్పె ట్టారురా?" అప్పుడు చావిట్లోకి వచ్చిన కోటయ్య ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎవరైతే ఏంలే! నువ్వొదిలేయరాదూ!" వేణు మెచ్చువంకే చూస్తూ చిరాగ్గా అన్నాడు.

కోటయ్య బండి కిందికి వంగి, కోళ్ళగంప పైకి ఎత్తాడు.

"వేణూ!" కోటయ్య ఓ పొలికేక పెట్టాడు. వర్ధని ముడుచుకొని, వణుకుతూ కూర్చుని వుంది. వేణుతోసహా అందరూ పరిగెత్తుకొ చ్చారు.

కోటయ్య పైపంచతో వర్ధని మొహం తుడిచి, జయమ్మ తెచ్చిచ్చిన మంచి నీళ్ళు తాగించాడు. వర్ధనిని వళ్లో కూర్చోబెట్టుకొని జయమ్మమీద విరుచుకుపడ్డాడు.

"పొద్దుట్నించీ పిల్లెటుపోయిందో కనిపె ట్టుకోనక్కర్లా!"

"ఏ పాపిష్టికన్ను పడిందో పిల్లకిట్టాంటి బుద్ధిపుట్టింది!" జయమ్మ కోటయ్య మాటలు పట్టించుకోకుండా ముక్కు ఎగబీల్చి, కళ్ళు కొంగు కద్దుకుంది.

జయమ్మ ఆ మాట అనగానే వర్ధని దూరాన నిల్చుని వున్న మురళివైపు చూసింది. పాప ఇంకా మురళి దగ్గరే వుంది. వర్ధని తాను చెప్పాలనుకొన్నవన్నీ మర్చిపోయింది. "ఎందుకమ్మా ఇలా చేశావు?" అని ఎవరైనా అడుగుతారేమో ఆ పిల్ల భూతంవల్లే, ఆ మురళన్నాయి వల్లే చేశానని చెపుదామని వర్ధని సిద్ధపడింది. కానీ ఎవరూ వర్ధనిని ఏమీ అడగలేదు.

జయమ్మ మాత్రం గబగబ వెళ్ళి ఉప్పు తీసుకొచ్చి, వర్ధని చుట్టూ మూడుసార్లు తిప్పి పొయ్యిలో వేసింది. అది చిటపటమ నగానే వేళ్ళువిరిచి, "పాడు దిష్టివిరగడ కానూ" అంది.

'వర్ధని మనసు ఏమాత్రం శాంతించలేదు. ఉప్పు కాదు, కానీ పెద్దమ్మ చిటపటమంటూ అందరిమీదా విరుచుకుపడాలి' అనుకుంది.

"ఆ... ఇంక చాల్లే! ముందు వర్ధని కింత భోజనం పెట్టు!" వేణు జయమ్మని ఉద్దే శించి కోపంగా అన్నాడు.

వేణుకోపం చూసి వర్ధని బిత్తరపో యింది. కోటయ్య ఏదో చెప్పాలనుకొన్నా నోరు పెగల్లేదు.

"ఉరుముఉరిమి మంగలంమీద పడ్డట్లు నీ విసురు నామీద ఏవిట్రా?" జయమ్మ దీర్ఘాలు తీస్తూ అంది.

"నెత్తికెక్కించుకొని ఊరేగావుగా! ఇప్పుడు అఘోరించినట్టే తయారయ్యిందది! ఇద్దరూ కలిసి ఏట్లో దూకండి!" వేణు కోపంగా అన్నాడు.

"వేణూ!" కోటయ్య గొంతు ఖంగుమంది. "నువ్వు మాత్రం తక్కువేమిటీ" గొణు క్కుంటూ చరచరా పందిట్లోకి వెళ్ళాడు వేణు.

జయమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"అనండిరా! అందరూ నన్నే అనండి! ఆ లలితమ్మ నేనే గారాం చేసి చెడగొట్టానని డప్పు వాయించి మరీ అందరితో చెపు తోంది. నువ్వేమో మొహానే అనేసావ్! పసి

పిల్లని ముచ్చటపడి దగ్గరకి తీస్తే ఇన్ని నిష్టూరాలా? మీ ఇష్టమొచ్చినట్లు చేసుకోండి! మధ్య నాకెందుకూ? ఆవిడ ఇష్టం! మీ ఇష్టం!" జయమ్మ కొంగుతో కళ్ళు అద్దుకొంటూ, వంటింటివైపు విసవిసా వెళ్లింది.

వర్ధనికి పరిస్థితి ఇలా పరిణమించడంతో ఏం చేయాలో తోచలేదు.

"చూసావమ్మా... అందరం ఎట్టా కంగారు పడ్డామో..." కోటయ్య వర్ధని జుట్టు సవరిస్తూ నెమ్మదిగా అన్నాడు.

అంతలోనే జయమ్మ గారెలు, పాయసం తీసుకొచ్చి వర్ధనికి తినిపించింది.

జయమ్మ ఇందాకటిలా లేదు. తేటగా ఎప్పటిలా వుంది. వర్ధని మనసు తేలికపడింది.

వేణు పందిట్లోకి వెళ్ళి- ముకుందంతో మంతనాలాడి వచ్చాడు.

వేణు ఏం అంటాడోనని వర్ధని చెవులు రిక్కించింది.

"పదమ్మా... వర్ధనీ! చూడు వాళ్ళందరికీ క్యారియర్లు ఇవ్వకుండా ఆపాం. ఇద్దువుగానీ పద!" వేణు గొంతు సౌమ్యంగా పలికింది.

వర్ధని అపనమ్మకంగా కళ్ళెత్తి చూసింది. వేణు నవ్వుతూ వర్ధనినే చూస్తున్నాడు. వర్ధని వేణు చేయి పట్టుకొని పందిట్లోకి వెళ్ళింది.

మురళి ఒక్కో పేరు చదువుతున్నాడు. వాణి ఒక్కో క్యారియర్ తెచ్చి, వర్ధనికి అందిస్తోంది. వర్ధని ఎప్పటిలా ఠీవీగా నిలబడి అందరికీ క్యారియర్‌లు ఇచ్చింది. అందరూ విప్పారిన మొహాలతో, ముసిముసి నవ్వులలో సంతోషంగా అందుకున్నారు.

ముకుందం పెద్దపండక్కి బట్టలు తీసిస్తానని వాగ్దానం చేశాడు.

ఇంకెంతో సంతోషంతో కదిలారందరూ.

వర్ధనికీ సంతోషం వేసింది. ఎప్పటిలాగే అందరూ వ్యక్తపరిచిన కృతజ్ఞతలన్నీ తనవేనని వర్ధని తృప్తిపడింది.

వెళుతూ వెళుతూ వాళ్ళందరూ మురళి ఎత్తుకొని వున్న పాపను ముద్దాడి, ముక్తకంఠంతో చెప్పారు, "పెద్దపండక్కి బుజ్జి పాపమ్మ బట్టలు పెట్టాల!"

వర్ధనికి వళ్ళు మండిపోయింది.

వాళ్ళ చేతుల్లో మిలమిలలాడుతోన్న క్యారియర్లను లాక్కొని, వాటితోనే వాళ్ళ మొహాలు పచ్చడి చేయాలనిపించింది.

అందరూ మాత్రం అవేవో పెద్ద నవ్వొచ్చే మాటలన్నట్లుగా పగలబడి నవ్వారు.



పురి పక్కనే వున్న మంచంమీద నిద్రపోతోన్న వర్ధనిని వేణు మెల్లిగా లేపాడు. వర్ధని కళ్ళు తెరిచి చూడగానే వర్ధని చేయి పట్టి లేపి మంచంమీదే కూర్చోబెట్టాడు.

"వర్ధనీ... మేము పొలానికెళుతున్నాం. నువ్వూ వస్తావా? " అని అడిగాడు.

వర్ధని నిద్రమత్తులో అయోమయంగా చూస్తూ... వస్తానన్నట్లుగా తలాడించింది.

ఉదయాన్నే వేణు ఇంత తీరికగా వచ్చి, అంత మృదువుగా మాట్లాడతాడని వర్ధని ఊహించలేదు. కలకాదని సీమచింతచెట్టు కొమ్మలమీద గెంతుతున్న పిచ్చుకల కలకలలు చెపుతూనే వున్నాయి.

"నేను ఇంకెవర్నీ తీసుకువెళ్ళట్లా. నిన్నొక్కదాన్నే! వాణి, పాప ఎవరినీ తీసుకురాను. సరేనా? "

వర్ధని అలాగేనంటూ తల గబగబ ఆడిం




చింది.

వేణు వర్ధనిని మంచంమీద నుంచి దింపి, కింద నిల్చోబెట్టాడు.

"తొందరగా తయారయిరా! వాళ్ళిద్దరితో మాత్రం చెప్పద్దు! ఈ లోపల నేను ట్రాక్టర్ తుడిచిపెడతాను" వేణు పైకి లేచాడు.

"మనం వెళ్ళాల్సింది ట్రాక్టరు మీదా అన్నాయ్? " వర్ధని ఉత్సాహంగా అడిగింది.

"ఆ...!" వేణు మాట నోట్లోవుండగానే వర్ధని చెంగుచెంగున గెంతుతూ జయమ్మ దగ్గరకి వెళ్ళింది.

జయమ్మ వర్ధనికి స్నానం చేయించి, ఇడ్లీలు తినిపించింది. తలంటి వున్న వర్ధని జుట్టును పాయలుపాయలుగా చిక్కుదీసింది. జడగంటలు పెట్టి కూర్చు జడ వేసింది. ముదురాకుపచ్చమీద ఎర్ర పూలున్న బండారులంక లంగా, ఎర్ర బుట్ట చేతుల జాకెట్టు వేసింది. కళ్ళకు కాటుక తీర్చిపెట్టింది. జడలో ఓ గులాబీ తురిమింది. కళకళలాడుతోన్న వర్ధనికి మెటికలు విరిచి, ముద్దుపెట్టుకుంది.

వర్ధని జయమ్మ ప్రవర్తనని అనుమానంగా గమనిస్తోంది.

నిన్నతను కోళ్ళగంప కిందనుంచి రాగానే తనేమంది? ఆవిడగారి ఇష్టమొచ్చినట్టు చేసుకోమను అంది కదూ? ఆవిడగారు అంటే లలితేగా! మళ్ళీ ఇప్పుడెందుకింత హడావుడి చేస్తోంది? మామూలుగా ఎప్పటిలా రెండు జళ్ళేసి, ఓ గౌను తొడిగి పంపచ్చుగా?

"ఎందుకే అమ్మా అంతపొడవు లంగా వేశావ్? ట్రాక్టర్ ఎక్కుతుంటే తట్టుకోదూ? "

వేణు గడపలో నిల్చుని అన్నాడు.

"నేను వేయమనలా? !" వర్ధని వేణువంక బిక్కుబిక్కుమంటూ చూస్తూ అంది.

"పోనీలేరా! ఏదో ముచ్చటపడి వేశాను. రాగానే మార్చేస్తాలే!"

"సరి... సర్లే! పదమ్మా... పద... పద!" తొందర చేశాడు వేణు.

వర్ధని జయమ్మవంకైనా చూడకుండా వేణు చేయిపట్టుకొని గబగబ బయటకు నడిచింది.

వెళ్తోన్న వర్ధనిని చూసి జయమ్మ కళ్ళు వత్తుకొంటూ అనుకొంది, "పిల్ల ఎంత చలాకీగా తుళ్ళుతూ గెంతుతూ వుండేది! వొట్టి బెదురుగొడ్డులా తయారయ్యిందే!"

వేణుతో నడుస్తోన్న వర్ధని కూడా అనుకొంది, "పెద్దమ్మకి తనంటే నిజంగానే ఇష్టం! ఆ పిల్లపిశాచి అంటే వుత్తిత్తి ఇష్టం! పొలం నుంచి తిరిగి వచ్చాక చెప్తా... వాళ్ళిద్దరి సంగతి!"

★ ★ ★

"అన్నాయ్ నేనక్కడ కూచోను! పడిపోతాను!" వేణు డ్రైవర్ సీటువెనకే వేసిన చెక్కను చూసి వర్ధని కంగారుగా అరిచింది.

"నువ్వు ఇక్కడ కూర్చో" వేణు వర్ధనిని ట్రాక్టరు వెనక టైర్లమీదే సీటులాగా వుండే చోట కూర్చోబెట్టాడు.

"ఇదుగో ఈ చువ్వలు రెండూ గట్టిగా పట్టుకో! దారంట తుమ్మచెట్లు వస్తాయి. నేను చెప్పగానే కిందికి వంగాలి... తెలిసిందా? "

వర్ధని అలాగేనంటూ తలాడించింది. చువ్వల్ని గట్టిగా పట్టుకుంది.

టూల్‌బాక్స్‌మీద కాళ్ళు పెట్టుకుంది. పొడవులంగా అంచులను కుచ్చిళ్ళలా చేసి, జాగ్రత్తగా కాళ్లమధ్య అదిమిపెట్టింది.

వేణు సీట్లో కూర్చుని ట్రాక్టర్ తాళం తిప్పాడు.

"రైట్! రైట్!" వర్ధని ఉత్సాహంగా అరిచింది.

వాణి పాపని ఎత్తుకొని పందిట్లోకి పరిగెత్తుకుంటూ వచ్చింది. వర్ధని వాళ్ళవైపు వంగి, నాలుక బయటకుపెట్టి వెక్కిరించింది.

వేణు ట్రాక్టరును బయటవున్న వేపచెట్టు

దగ్గరకు రాగానే ఆపాడు.

వర్ధని కుతూహలంగా ఎందుకన్నట్లు చుట్టూ చూసింది.

చెట్టుకింద నిల్చుని వున్న ముకుందం వచ్చి, వేణు వేసిన చెక్కమీద జాగ్రత్తగా కూర్చున్నాడు.

"నా బరువుకి విరిగిపోదు కదరా?" ముకుందం నవ్వుతూ అడిగాడు.

"లేదులే చిన్నాన్నా... మన కురుపవాళ్ళు ఇద్దరిద్దరు ఎక్కుతారు. ఇప్పటిదాకా ఏవీ అవ్వలా మరి!"

"అంతేనంటావా?" ముకుందం నవ్వుతూ సరిగ్గా కూర్చున్నాడు.

వేణు ట్రాక్టరును రోడ్డుమీదికి పోనిచ్చాడు.

వర్ధనికి ముకుందాన్ని చూడగానే ఉత్సాహమంతా చప్పున చల్లారిపోయింది. మొహం ముడుచుకు కూర్చుంది.

కొంతదూరం పోయాక ట్రాక్టరు రోడ్డును వదిలి, కాలువ గట్టమ్మటే వున్న మట్టి రోడ్డులోకి తిరిగింది.

ఓ పక్క తుమ్మచెట్ల వరుస. మరోపక్క నిండుగా, తళతళలాడుతోన్న కాలువ. వర్ధనికి ఆ ఎగుడుదిగుడు రోడ్డును ఆనుకొని వంకరటింకరల కాలువని చూస్తే భలే భయమేసింది.

"మనం రోజూ తాగే మంచినీళ్లు తెచ్చేది ఈ కాలువ నుంచే వర్ధనీ!" వేణు చెప్పాడు.

వర్ధని కుదురుగా కూర్చునే అవకాశమే రావట్లేదు. కాస్త కుదురుగా కూర్చుని చుట్టూ చూడబోయేసరికి... ట్రాక్టరును ఏదో గుంటలో పడకుండా వేణు నేర్పుగా పక్కకు తిప్పుతున్నాడు.

ఆ వేగానికి వర్ధని ఆ చువ్వకూ ఈ చువ్వకూ మధ్య వేగంగా కదులుతోంది.

ముకుందం, వేణు వర్ధనికి అర్థంకాని మాటలేవో మాట్లాడుకొంటూ వున్నారు.

"వర్ధనమ్మా... అదుగో ఆ దూరాన కనిపించేదే మన చేను" వేణు తుమ్మచెట్ల వెనకగా చూపించాడు.

చిక్కటి చీకటిలాంటి నల్లరేగడి భూమి మీద కళకళలాడుతున్న పచ్చటి చేను. ట్రాక్టరు శబ్దానికి రెక్కలు ఆడించుకొంటూ లెక్కకు అందనన్ని తెల్లకొంగలు అక్కణ్ణించి ఒక్కసారిగా పైకిలేచాయి.

వర్ధని అద్భుతమైన దృశ్యాన్ని చూస్తున్నట్లుగా కళ్ళప్పగించి చూస్తూవుండిపోయింది. ట్రాక్టరును ఓ పెద్ద తుమ్మచెట్టుకింద ఆపాడు వేణు. వర్ధనిని జాగ్రత్తగా కిందికి దింపాడు. ముకుందం అప్పటికే చాలా ముందుకెళ్ళిపోయాడు.

కాలువమీదికి వంగివున్న తుమ్మ చెట్టును, దాని నిండా వున్న చిన్ని చిన్ని పసుపుపచ్చ పూలను, దాని కొమ్మలకు వేళ్ళాడుతోన్న పెద్ద పెద్ద పిచ్చుక గూళ్లను వర్ధని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది.

ఆ వాణి తిక్క కుదిరింది! ఇంటికి వెళ్ళగానే అన్నీ ఊరించి ఊరించి చెప్పాలి.

పొడుగు లంగాని జాగ్రత్తగా రెండు చేతుల్తో ఎత్తి, వర్ధని ఆ గట్లంట పడుతూ లేస్తూ నడుస్తోంది. వేణు ఆగి వర్ధని చేయి పట్టుకున్నాడు. పొలాల్లో పనిచేసుకొంటున్న వాళ్లు పనాపి, వేణుని ఆప్యాయంగా పలకరిస్తున్నారు. వర్ధని ఎవరని ఆరా తీస్తున్నారు. వర్ధనికి వేణుకి అక్కడ వున్న పలుకుబడికి ఏదో తెలీని గర్వం కలిగింది. అయితే వేణు తనని ఆయన చెల్లెలుగా కాక ముకుందం కూతురిగా పరిచయం చేయడం ఏమాత్రం నచ్చలేదు. ఎవరైనా మళ్ళీ ఆ ప్రశ్న అడగగానే వర్ధని తనే కావాలని 'అన్నాయ్, అన్నాయ్' అని ఒకటికి నాలుగు సార్లు అంటోంది.

వీళ్లను చూడగానే అక్కడేవున్న గుడిసె లోనుంచి సవారమ్మ, తిమ్మడు వచ్చారు. వాళ్ళిద్దర్నీ చేనుకి కాపలాగా వుంచారు. ముకుందం, వేణు పనుల గురించి ఆరా తీశారు. తిమ్మడు గబగబ ఓ నులకమంచం





తెచ్చి అక్కడున్న పెద్ద తుమ్మ చెట్టుకింద వేశాడు.

వర్ధనిని దానిమీద కూర్చోబెట్టి ముకుందం, వేణు చేలోకి వెళ్లారు. తిమ్మడు వారిని అనుసరించాడు.

వర్ధని సవారమ్మ అడిగే ప్రశ్నలన్నింటికీ జవాబులిచ్చింది. ఇప్పుడే వస్తానంటూ సవారమ్మ గుడిసెలోకి దూరింది.

వర్ధని చుట్టూ చూసింది. ఈ తుమ్మచెట్టు లాంటిదే పెద్ద పెద్దవి మరో రెండు ఉన్నాయి. వాటికిందుగా దూరంనుంచి ఓ సన్నటి కాలువ వస్తోంది. తన ముందుగా వెళ్ళి చివర ఎక్కడో మాయమవుతోంది. కనుచూపుమేరా పచ్చదనం. చేలల్లో నిలిచిన నీళ్లు సూర్యకిరణాలు పడి అప్పుడప్పుడూ తళుక్కుమంటున్నాయి. చేలను విభజిస్తున్న నల్లని గట్లు రీవీగా చూస్తున్నాయ్.

వర్ధని మంచంమీదనుంచి దిగి కాలువ పక్కకెళ్లి నిల్చుంది.

రాలిన తుమ్మపూలు, కాయలు, ముళ్ళూ చెల్లాచెదురుగా పడివున్నాయి. వర్ధని జాగ్రత్తగా చూసి, కాలవపక్కనే గరికమీద చతికిలబడింది.

నీళ్లు కాలువలో వున్నాయో లేవోనన్నంత స్వచ్ఛంగా వున్నాయి. అడుగున వున్న చిన్న చిన్న రాళ్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. చిన్న దుబ్బు ఒకటి నీళ్లల్లో వేగంగా కొట్టుకువచ్చింది.

వర్ధని మెల్లిగా కాలివేళ్లతో నీళ్లని తాకింది. చల్లగా జిల్లుమంటున్నాయి నీళ్లు. 'తలెత్తి చూడలేనంత ఎండ మండిపోతోంది. ఈ నీళ్లు ఇంత చల్లగా ఎలా వున్నాయి? '

వర్ధని ఆలోచిస్తూనే కాలవ లోపలికి దిగి నిల్చుంది. లంగా చివర్లు తడవకుండా రెండు చేతులతో పైకి ఎత్తిపట్టుకొంది. నీళ్లల్లో కాళ్లు దబదబా ఆడించింది. అక్కణ్ణించి బురద పైకి లేచింది.

వర్ధని లంగాని వదిలేసి, చేతులను నీటి ఒరవడికి అడ్డం పెట్టింది. వేళ్ల సందుల్లోంచి వేగంగా దూసుకుపోతున్న చల్లటి నీళ్ళతాకిడికి సంబరంగా కేరింతలు కొట్టింది.

సవారమ్మ లబలబలాడుతూ వచ్చింది. తుమ్మ ముళ్ళుంటాయ్... గుచ్చుకుంటాయ్ అంటూ.

వర్ధని ఆమె మాటలు పట్టించుకోకుండా దోసిళ్లతో నీళ్లు ఎత్తి ఆమెమీద పోస్తూ పగలబడి నవ్వింది.

సవారమ్మ అటు గెంతి, ఇటు గెంతి బతిమిలాడి బామాడి వర్ధనిని బయటకు తీసుకొచ్చింది.

వేణు ట్రాక్టరు సీటుమీద తువ్వాలు వేసి వెళ్ళాడు. సవారమ్మ గబగబ దాన్ని తెచ్చింది. వర్ధని తడిబట్టలు విప్పేసి, ఒళ్లు, తల తుడిచింది. దాన్నే వంటికి చుట్టింది. తడిబట్టలని పిండి, గాలివాలున ఆరేసింది.

వర్ధని సవారమ్మతోపాటు గుడిసెలోకి వెళ్లింది.

అక్కడ పెనం పొయ్యిమీద పెట్టుంది. సవారమ్మ జొన్నరొట్టెలు చేస్తూ చేస్తూ బయటకు వచ్చినట్లుంది.

పొయ్యి సెగకు ఎందుకు లెమ్మని వర్ధనిని బతిమిలాడి, బయటకు తీసుకువచ్చి మంచంమీద కూర్చోబెట్టింది సవారమ్మ.

మొదటి రొట్టె చేయగానే, వేడివేడి పప్పు వేసి వర్ధనికి ఇచ్చి వెళ్ళింది సవారమ్మ. ఎందుకనో వర్ధనికి విపరీతమైన ఆకలి వేసింది. నోట్లో నీరూరాయి. వర్ధని చుట్టూ చూసింది.

వేణు, ముకుందం ఎక్కడో దూరాన వున్నారు. పిలుపుకు ఆనేట్టు లేరు.

వర్ధని సవారమ్మని బెదిరిస్తూ ఓసారి వేణుని కేకవేసింది.

సవారమ్మ గబగబ బయటకు రాగానే పగలబడి నవ్వింది.

వర్ధనికి జొన్నరొట్టె తినడం ఇదే మొదటి సారి. ఎలాగో తంటాలు పడుతూ తినడం

మొదలెట్టింది. పెద్దమ్మ, పెదనాన్నా కూడా ఉంటే ఎంత బావుండేదో! ఆ వాణికి అన్నీ వర్ణించి చెప్పాలి. అది లేకపోతే తనెంత బాగా వుంటుందో చెప్పాలి. ఆ సరళ తమ ఇంటిముందే పేద్ద జమ్మి చెట్టుందని బడా యిలు పోతుందిగా! ఇక్కడున్న పెద్ద పెద్ద తుమ్మచెట్లు గురించి, పిచ్చుగ్గూళ్ల గురించి ఊరించి ఊరించి చెప్పాలి.

వర్ధని తినడం పూర్తయ్యేసరికి సవారమ్మ రొట్టెలు చేయడం పూర్తయింది. రోటి దగ్గ రకి వెళ్ళి ఏవో దంచుతోంది.

వర్ధని కాలువలోకి వంగి చేతులు నీటిప్ర వాహానికి ఎదురుగా పెట్టింది. చేతులు అవే శుభ్రం అయ్యాయి.

వర్ధని కాలువ పక్కకి వెళ్ళడం చూసి నూరుతున్న వాటిని రోట్లోనే వదిలి నెత్తీ నోరూ కొట్టుకొంటూ వచ్చింది సవారమ్మ. ఆరిన వర్ధని బట్టలు తీసి, తొడిగింది.

వర్ధని దృష్టి కోడిపిల్లల గుంపుమీద పడింది. తల్లికోడి వెనకే వరసకట్టి వదల కుండా తిరుగుతున్నాయవి. రంగురంగుల చిన్న చిన్న కోడిపిల్లలు. ఎంతో ముచ్చటగా వున్నాయి.

పెద్దమ్మ కూడా గుడ్లు పొదగేస్తానంది కదూ! ఇంత చక్కటి పిల్లలు వచ్చేవేమో! పెదనాన్న గుడ్లన్నీ ఏ రోజుకారోజు తననే తినేయమన్నాడుగా! అయినా, తనిప్పుడు ఇక్కడ వుండడం లేదుగా. మరి ఆ గుడ్లన్నీ పెదనాన్న ఎవరికి ఇస్తున్నాడు? ”

వర్ధని మనసులో కేరింతలు కొడుతున్న పాప ప్రత్యక్షమైంది.

వర్ధని పాపమొహాన్ని మనసులోంచి తుడిచేసుకొని, కోడిపిల్లలవైపు దృష్టి సారిం చింది. ఒకసారి వాటి వెంట తరుముతూ పరిగెత్తింది.

సవారమ్మ వచ్చి వర్ధని గుప్పిటనిండా జొన్నలు పోసింది, వాటికి తినిపించేటం దుకు.

"బ్బా... బ్బా... బ్బా..." అంటూ వర్ధని గింజలున్న దోసిలి చాచి వాటి వెంట పడింది.

కొద్దిసేపు వర్ధనివంకే చూసి, సవారమ్మ మళ్లీ రోటి దగ్గరకి వెళ్లింది.

వర్ధని వాటివెనకే పరిగెత్తి పరిగెత్తి, ఎలా గోలా చివరిదాన్ని పట్టుకొంది. అది పారి పోవాలని గుంజుకుంటున్నా... ఒడుపుగా పట్టుకొని చేతిలోని గింజల్ని తినిపించింది.

వర్ధనికి ఏదైనా తినగానే నీళ్ల తాగాలన్న విషయం గుర్తొచ్చింది. గబగబ కాలవ దగ్గ రకి వెళ్లి, దాని ముక్కు నీళ్ళల్లోకి వంచింది. అది చివ్వున తల ఎత్తింది.

"నా బుజ్జీ, గబగబ నీళ్లు తాగమ్మా!" అంటూ ఏదైనా తిన్నాక ఎందుకు నీళ్లు తాగాలో జయమ్మ తనకు చెప్పే కారణా లన్నీ చెప్పి, బతిమిలాడి, కోప్పడి నీళ్లు తాగించింది. రెండు నిమిషాలున్నాక నీళ్ళ ల్లోంచి తీసి, "ఇంక పడుకో!" అంటూ కోళ్ళ గంప కింద పడుకోబెట్టింది. అది కూడా బుద్ధిగా కదలకుండా పడుకుంది.

వర్ధని ఒక్కో కోడి పిల్లని పట్టుకొని, గింజలు తినిపించి, నీళ్లు తాగించి పడుకోబె ట్టింది. వాటిని చూసి తృప్తిగా నవ్వుకొంది.

ఇంతలో వేణువాళ్లు తిరిగొచ్చారు.

వర్ధనికి కోడిపిల్లలన్నీ ఒక్కసారే పడుకోవ డంతో విసుగేస్తోంది. ఓసారి వెళ్లి అవి నిద్ర లేచాయో లేవో చూసి వచ్చింది. అవి మంచినిద్రలో వున్నాయి.

సవారమ్మ హడావుడిగా వేణువాళ్లకు మర్యాదలు చేస్తోంది.

వర్ధని మళ్ళీ వెళ్ళి గంప ఎత్తిచూసింది. కాసేపటికి ఏదో అనుమానం వచ్చి, వాటిని మెల్లిగా కదిల్చిచూసింది. అయినా అవి నిద్ర లేవలేదు. వర్ధనిలో ఏదో భయం మొదలయ్యింది. ఇవి ఎందుకిలా పడుకు న్నాయి? ఎంత లేపినా నిద్ర లేవవేం? ఇవి ఎప్పటికీ లేవవా?' వర్ధని చిట్టిబుర్రకి ఎంతకీ తట్టలేదు.

వర్ధని ఏమీ ఎరగనట్లు గంపను మళ్ళీ




మూసేసి, వేణు పక్కన నిల్చుంది. వేణు వర్ధనిని దగ్గరికి తీసుకొని, ఏవేవో ప్రశ్నలడుగుతున్నాడు. సమాధానాలు చెపుతూ వున్నా... వర్ధని కళ్ళముందు కోడిపిల్లలే కదులుతున్నాయి. వేణు వాటి గురించి ఏమైనా అడుగుతాడేమోనని బిక్కచచ్చిపోయి ఎదురుచూస్తోంది.

సవారమ్మ వీళ్ళందరూ తిన్న పళ్ళాలు తీసుకెళ్ళి కడుక్కుంటోంది.

'అయిపోయింది! సవారమ్మ అవి కడగగానే గుడిసెలో పెట్టి, కోడిపిల్లలకోసం వెళుతుంది. కోళ్ళగంప ఎత్తి చూడగానే అన్నీ కదలకుండా పడుకొని కనిపిస్తాయి. అందరికీ తనే ఏదో చేశానని చెప్పేస్తుంది. అయిపోయింది! అదుగో వెళ్తోంది. పళ్ళాలు కడగడం అయిపోయింది. పళ్ళాలు తీసుకొని గుడిసెలోకి వెళుతోంది. అదుగో వెళ్ళిపోయింది. ఈపాటికి పళ్ళాలు సర్దేసివుంటుంది. ఇంక బయటకు వచ్చేస్తుంది. తిన్నగా కోళ్ళగంపవైపు వెళ్తుంది. అదుగదుగో సవారమ్మ గుమ్మంలోకి వచ్చేసింది. వర్ధనికి తలనరాలు చిట్లిపోతున్నట్లుగా వుంది. కళ్ళమ్మట నీళ్ల కారడం మొదలెట్టాయి.

"వర్ధనమ్మా... ఎందుకురా ఏడుస్తున్నావ్?" వేణు ఆశ్చర్యంగా అడిగాడు, "ఇక్కడ నీకు నచ్చలేదా?"

'ఎంతో నచ్చింది. ఆ కోడిపిల్లలు లేచి ఎప్పటిలా చెంగుచెంగున తిరుగుతోంటే ఇంకా నచ్చుతుంది' వర్ధని మనసులో అనుకొంది. పైకి ఏమీ మాట్లాడలేదు. మెల్లిగా గొంతు పెగల్చుకొని అంది, "పెదనాన్న! పెద్దమ్మ..."

"ఏరా చిన్నా... ఇంటికి వెళదామా?" వేణు మళ్ళీ అడిగాడు. వర్ధని బిక్కమొహం పెట్టుకొని గబగబ తలాడించింది. ముకుందం, వేణు తిమ్మడికి పనులన్నీ అప్పజెప్పి మళ్ళీ వస్తామని చెప్పి బయలుదేరారు. వర్ధని భయంభయంగా కోళ్ళగంప వైపూ సవారమ్మ వైపూ చూస్తుండగానే ట్రాక్టరు కాలువమీదికి వచ్చింది. వర్ధని చువ్వలు పట్టుకొని, కళ్ల గట్టిగా మూసుకొంది.

సవారమ్మా తిమ్మడూ చేతులు ఊపుతూ, కేకలుపెట్టి తనను ఆపేస్తున్నట్లుగా అనిపిస్తోంది మాటిమాటికీ. వర్ధని ఉలిక్కిపడి, సర్దుకొని కూర్చుంది.

ఇంటికి రాగానే తిన్నగా వెళ్ళి మంచం ఎక్కింది. గట్టిగా కళ్ల మూసుకొని పడుకొంది. ఎవరెన్ని సార్లు లేపాలని ప్రయత్నించినా లేవలేదు.

వర్ధనికి సవారమ్మ కోడిపిల్లల దగ్గరకి వెళ్ళడం, తిమ్మడితో సంగతంతా చెప్పడం, తిమ్మడు రంకెలు వేసుకొంటూ ఇక్కడికి రావడం అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. పొలానికి, ఇంటికి ఎంతదూరం వుందో, ఎంత వేగంతో వస్తే తిమ్మడు ఇక్కడికి ఎప్పటికి రాగలడో జాగ్రత్తగా అంచనాలు వేస్తోంది వర్ధని. వర్ధని ఎప్పటికో తనకి తెలీకుండానే నిద్రపోయింది.

తెల్లవారుఝామున అందరూ లేచి తయారవుతూ వర్ధనిని లేపగానే వర్ధనికి మెలకువ వచ్చింది. కళ్ల తెరవకుండా అలాగే పడుకొంది.

జయమ్మ, కోటయ్య చెరోపక్కకు వచ్చి మహబూబ్‌నగర్‌లో తను ఎలా ప్రవర్తించాలో, లలిత మాట ఎంత బుద్ధిగా వినాలో, వాణిని ఎంత చక్కగా చూసుకోవాలో ఉద్బోధిస్తుంటే టక్కున ఓ ఆలోచన వచ్చింది వర్ధనికి.

సవారమ్మ చీకటి పడింది లెమ్మని రాత్రి తిమ్మణ్ణి రానిచ్చి ఉండదు. తెల్లారాక తప్పక పంపుతుంది! అంతే, వర్ధని టక్కున లేచి గబగబ తయారయింది.

వేణు ట్రాక్టరుకు ట్రక్కు తగిలించాడు. ట్రక్కులో దుప్పటి పరిచి, సామానంతా సర్దుతున్నాడు. వాణి, లలిత, ముకుందం

కూర్చున్నారు. వర్ధని గబగబ వెళ్లి ట్రక్కులో ఎక్కింది.

జయమ్మ, కోటయ్య వర్ధని తమ మాట మన్నించినందుకు ఎంతో సంతోషించారు. లలిత, ముకుందం కూడా వర్ధని ప్రవర్తనకు ఆశ్చర్యపోతూనే ఆనందించారు. వాణి పాపకి వీడ్కోలు వచనాలు పలుకుతోంది.

వర్ధని మనసంతా ఆందోళనగా, కంగారుగా ఉంది. ఏ చిన్న అలికిడి అయినా తిమ్మడు వస్తున్నట్లుగా అనిపిస్తోంది. వేణు ట్రాక్టరును రోడ్డుమీదికి మళ్లించగానే కొంచెం నెమ్మదించింది. కోటయ్య వాళ్లను చూస్తూ చేతులూపింది.

అలంపూర్ చౌరస్తాకు తీసుకొచ్చి కర్నూలునుంచి మహబూబ్‌నగర్ వెళ్లే బస్సు ఎక్కించాడు వేణు. వర్ధనికి ఎప్పుడు ఆ పరిసరాల్లోంచి దూరంగా పోదామా అని ఆత్రంగా ఉంది. ఎలాంటి గొడవా చేయకుండా బస్సెక్కింది. ఆశ్చర్యంగా తననే చూస్తోన్న వేణుకేసి హడావుడిగా చేయి ఊపింది. వేణు ఆశ్చర్యంలోంచి తేరుకోకుండానే తనూ చేయి ఊపాడు.

బస్సు కదలగానే వర్ధని మనసు తేలికపడింది. చల్లగాలి తగలగానే నిద్ర ముంచుకొచ్చింది. కిటికీకి తల ఆన్చి నిద్రపోయింది.

వర్ధనికి మెలకువ వచ్చేసరికి కిటికీలోంచి ఎండ పడుతోంది. బస్సు కృష్ణానదిమీద పోతోంది. లలిత వాణికి ఏదో వివరించి చెపుతోంది. ముకుందం పేపర్ చదువుకుంటున్నాడు. అందరి మొహాలు తేటగా ఉన్నాయి.

హఠాత్తుగా వర్ధనికి ఏదో గుర్తొచ్చింది. తిమ్మడు నిజంగానే వచ్చుంటాడా? ఆ కోడిపిల్లలు ఇప్పటికీ నిద్రలేచి ఉండవా? అవి నిద్రలేవకపోతే తిమ్మడు వచ్చి ఆ సంగతి పెదనాన్నతో, పెద్దమ్మతో... అందరితో... అందరితో చెప్పేసి ఉంటాడా...? చెపితే వాళ్లు ఏమంటారు? అవును! ఏమంటారు? ఏమీ అనరు!

వర్ధనికి తను మరోసారి ఘోరంగా మోసపోయానని అర్థమయింది.

'తనెందుకు అంత భయపడింది? అసలు అంత అమాయకంగా ఎలా ఆలోచించింది? పెద్దమ్మకి తనంటే నిజంగా ఇష్టం! పెదనాన్నకి మరీ ఇష్టం! వేణన్నాయి ఎప్పుడైనా కోప్పడుతాడుగానీ, తనకీ తనంటేనే ఎంతో ఇష్టం! లేకపోతే వాణిని, పాపని వదిలి తనొక్కదాన్నే పొలానికి ఎందుకు తీసుకెళతాడు?

అక్కడి ఇల్లూ, బడి, వాణి చాడీలు, లలిత దెబ్బలు అన్నీ ఒక్కసారిగా గుర్తొచ్చాయి. పెద్దపెట్టున ఏడుపొచ్చింది.

బస్సు కిటికీలోంచి తల బయటకు పెట్టి, చేతులు వెనక్కు చాచి, గట్టిగా ఏడుస్తూ, బిగ్గరగా అరవడం మొదలెట్టింది.

"పెదనాన్నా... పెద్దమ్మా... వేణన్నాయ్..."

లలిత విసురుగా తలతిప్పి వర్ధనిని కొరకొరా చూసింది.

వర్ధని ఆ నాలుగ్గోడల మధ్యకు మళ్ళీ వచ్చిపడింది.

అదే అసంతృప్తి! అదే అశాంతి! అదే ఆవేదన!

వెలితి! వర్ధని గుండెలనిండా వెలితి!!

ఎవరూ తీర్చలేని వెలితి! కనీసం ఎవరి గుర్తింపుకూ నోచుకోని వెలితి!

వర్ధని మొదటిరోజు బడికి వెళ్ళడానికి నానా యాగీ చేసింది. వర్ధని ఏడ్చింది ఏడ్చినట్టుగానే వుంటోంది. ఏడుపుతోనే కడుపు నింపుకుంటోంది. ఏడుపుతోనే కాలం గడుపుతోంది.

వీళ్ళతో తను ఎలా వచ్చేసింది? తను అసలు మనసువిప్పి ఎవరితోనైనా మాట్లాడిందా? పెద్దమ్మా పెదనాన్న లేకపోతే తనెంత క్షోభపడుతుందో ఎవరికైనా వివరించి చెప్పిందా? తను ఎందుకిలా




చేసింది? తన నెత్తిన ఏదో భూతం ఎక్కినట్లుంది! లేకపోతే తను ఒక్కమాటైనా పెదనాన్నతో చెప్పకుండా వుంటుందా? ఆ చాడీకోరు తిక్క కుదర్చకుండా వుంటుందా?

ఊరెళ్ళినప్పటి సంగతులన్నీ వర్ధనికి ఒక్కొక్కటిగా గుర్తొచ్చాయి. ఊపిరాడనీయకుండా ఉక్కిరిబిక్కిరి చేశాయి.

లలిత లోపల పని చేసుకుంటోంది.

వర్ధని మెల్లిగా లేచి ముందుగదిలోకి వెళ్ళింది. గది తలుపులు గడి వేసివున్నాయి. గడి వర్ధనికి అందలేదు. అక్కడే వున్న కుర్చీ లాక్కొని గడి తియ్యొచ్చు. వర్ధని దుఃఖమంతా తుడిచిపెట్టినట్లు మాయమయింది. ఇంతకన్నా మంచి అవకాశం దొరకదు. వర్ధని గబగబ కుర్చీకోసం వెళ్ళబోయింది.

"అమ్మా... నీకు పుణ్యముంటుంది... ఓ ముద్ద అన్నం పెట్టు తల్లీ!" అని ఎవరో దీనంగా అరుస్తున్నట్లనిపించింది.

వర్ధని కిటికీలోంచి గేటువైపు చూసింది. అక్కడ ఎవరూ లేరు.

మళ్ళీ మళ్ళీ ఆ పిలుపు వినిపిస్తూనే వుంది హృదయవిదాకరంగా.

చింపిరిజుట్టుతో, చీమిడిముక్కుతో, మురికిగుడ్డలతో చీపురు పుచ్చుకొని ఓ రూపం వర్ధని కళ్ళముందు మసక మసగ్గా ప్రత్యక్షమైంది. ఇందాకటి పిలుపు ఆ రూపంలోంచే వస్తోంది. ఆ పిలుపు వర్ధని చెవులు చిల్లులు పడేలా గదిలో ప్రతిధ్వనిస్తోంది.

వర్ధని చెవులు గట్టిగా మూసుకొంది. ఎందుకోగానీ వళ్ళంతా చల్లగా అయ్యింది. కుర్చీదాకా వెళ్ళలేకపోయింది.

ఇంతలో వాణి బడినుంచి తిరిగివచ్చింది. వాణి రిక్షా దిగుతూ గేటు దగ్గర చేస్తోన్న సందడికి వర్ధని ఈ లోకంలోకి వచ్చిపడింది. వర్ధనికి ఒక్కసారిగా భారం దిగిపోయినట్లనిపించింది. గబగబ కళ్ళు తుడుచుకొని లలిత పనిచేసుకోవడానికి లోనికి వెళ్ళే ముందు తనెక్కడ వుందో అక్కడికి వెళ్ళి అలాగే కూర్చుంది.

ఇంతలో వాణి తలుపులు దబదబా బాదడంతో లలిత గబగబ ముందుగదిలోకి వెళ్ళింది. వాణి ఉత్సాహంతో బిగ్గరగా మాట్లాడుతూ వచ్చింది. ఇవాళ మొదటి రోజు కాబట్టి పాఠాలే చెప్పలేదట. ఎంతో సరదాగా గడిపారట.

వాణి పడీపడీ నవ్వుతూ విశేషాలన్నీ చెప్తోంది. లలిత మళ్ళీ మళ్ళీ అడిగి చెప్పించుకుంటోంది. వద్దనుకొన్నా వర్ధని చెవిలో కూడా పడుతున్నాయి.

ఛ! తను కూడా వెళ్లండాల్సింది. తమ తరగతి పిల్లలు కూడా సరదాగా నవ్వుతూ తుళ్లుతూ గడిపుంటారు! ఎన్ని కథలు చెప్పుకున్నారో? ఏవేం పాటలు పాడుకున్నారో? ఎలాంటి ఆటలు ఆడుకున్నారో? ఖచ్చితంగా మేడం కూడా వచ్చి కథ చెప్పివుంటుంది. వర్ధని రాలేదేమి అని అడిగి వుంటుందా ఆవిడ? అయినా ఆవిడ అడగాలనేముందిలే! అంతమందిలో వర్ధని ఒకతి. అంతే! తను ఆ బడికి తిరిగి వెళ్ళకూడదని నిశ్చయించుకొందిగా? మరి ఆవిడ తన గురించి ఏమైనా ఆరాతీస్తే ఏమి? తీయకపోతే ఏమి? తనింక ఆ బడికి వెళ్ళకూడదు! మేడం గురించి ఆలోచించకూడదు! వర్ధని గట్టి నిర్ణయానికి వచ్చింది.

కానీ, ఆ సాయంత్రం వాణి చేసిన హడావుడికి ఆ నిర్ణయం మెత్తబడడం మొదలెట్టింది. మర్నాడు కూడా వర్ధని బడికి వెళ్ళలేదు. ఒక్కరోజు బడికి వెళ్ళినా ఎప్పటికీ వెళ్ళాల్సి వస్తుందేమోనని భయపడింది.

వాణి బడికెళ్ళాక, ముకుందం బయటకెళ్ళాక లలిత పనిలో మునిగిపోయింది. ఇంట్లో నిండుకొని వున్న నిశ్శబ్దం వర్ధనిని నిలవనీయకుండా చేసింది. తన మనసు నిండా వున్న ఒంటరితనమే చుట్టూ వున్నట్టుగా వుంది. ఊరిలో పెద్దమ్మ, పెదనాన్నల ఆప్యాయతలతో పాటు సరోజ వెట

కారం, మురళి నిర్లక్ష్యం గుర్తొచ్చి ముల్లులా గుచ్చుకొంటున్నాయి.

ఆ సరోజ వదినకన్నా ఈ లలితే మేలు! తను గొడవ చేసినప్పుడే కోప్పడుతుంది. మురళన్నాయి మంచాడే! ఎప్పుడూ తనని ఏమననివాడు ఈసారి విసుక్కున్నాడంటే ఆవిడగారి మహిమే అయ్యుంటుంది. పాపకి మంచిగౌను తీసుకురమ్మని చెపుతూనే వాళ్ళకెందుకూ? అని దీర్ఘాలు తీసివుంటుంది. మురళన్నాయి ఎవరిమాటైనా ఇట్టే వినేస్తాడు. ఆవిడ ఓ జిత్తులమారి! ఆ పాప ఓ పిల్లరాక్షసి! ఛ! వద్దు బాబూ... మళ్ళీ వాళ్ళిద్దర్నీ తలుచుకోనే తలుచుకోకూడదు!

వర్ధని ఆలోచనలు ఒక కొలిక్కి రాక ముందే వాణి బడినుంచి వచ్చేసింది. ఒక్కసారిగా సందడి మొదలయ్యింది. మళ్ళీ వాణి నోటిమీద మూతపడకుండా బడికబుర్లు చెప్పడం మొదలెట్టింది. బడినుంచి ఏరుకొచ్చిన పొన్నపూలను మాల కట్టమని లలితను వేధిస్తోంది. తన తరగతి పిల్లలందరూ పండక్కి ఏవేం పిండివంటలు చేశారో చెప్పారుట. మర్నాడు తనూ కొన్ని అప్పచ్చులు బడికి తీసుకెళ్తానంటోంది. లలిత బడికి అలాంటివి తీసుకెళ్ళకూడదని నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తోంది. వాణి మారాం చేస్తోంది.

వర్ధనికి వేణన్నాయి ఇక్కడికి వచ్చినప్పుడు తను సంచిలో పెట్టుకొని తిరిగిన అరిసెముక్క గుర్తొచ్చింది. దానితోపాటు పుస్తకాలు, పలక, బలపాలు, రంగుపెన్సిళ్లు అన్నీ గుర్తొచ్చాయి.

వూరెళ్ళేప్పుడు తను అన్నీ విసిరివిసిరి కొట్టి వెళ్ళిందిగా! అవన్నీ ఏమైపోయాయో! ఆ వాణి తన వాటన్నిటినీ ఆ లలితకు అప్పచెప్పి హాయిగా వుంటుంది. తన వాటి సంగతి ఎవరు చూడాలి? అయినా ఈ పుస్తకాలతో తనకేం పనిలే! పంతులు బడిలో చెప్పేది పెద్దబాలశిక్షేగా! వర్ధని ఎందుకో సమాధానపడలేకపోయింది.

వాణి, లలిత వంటింట్లో వున్నారు. వర్ధని మెల్లిగా శబ్దం రాకుండా వెళ్ళి, పుస్తకాల అరలో తన సంచికోసం చూసింది. వాణి సంచి పక్కనే తన సంచి భద్రంగా వుంది. వర్ధని తనను ఎవరైనా చూస్తున్నారేమోనని చుట్టూచూసింది.

వాళ్ళిద్దరి గొంతులు ఇంకా వంటింట్లో నుంచే వినిపిస్తున్నాయి.

వర్ధని మునివేళ్లమీద నడిచెళ్లి, సంచిని తీసుకొంది. గోడపక్కగా చతికిలపడి, సంచిని ఒళ్లోపెట్టుకొంది. అన్ని పుస్తకాలు చక్కగా సర్దివున్నాయి. ఎన్నాళ్ల ఎడబాటు తరువాతో ప్రియస్నేహితుడ్ని కలిసిన అనుభూతే వర్ధనిని చుట్టుముట్టింది.

ఒక్కో పుస్తకం తీసి చూసుకొంది. పలక, బలపాలు, రంగు పెన్సిళ్లు... అన్నీ తీసి మళ్ళీ లోపల పెట్టేసింది. "పంతులు బడికి వెళితేనేం! తను ఈ పుస్తకాలు చదువుతుంది. అంతేకదా!" వర్ధని తనకైతనే సమాధానం చెప్పుకుంది.

పుస్తకాల సంచిని తీసుకెళ్ళి దిండుకింద పెట్టి, దుప్పటి కప్పేసింది. ఆ రాత్రి ఆ పుస్తకాల సంచిమీద చేయివేసి పడుకొంది. వాణి రెండురోజుల్నించీ ఏకబిగిన చెప్తున్న బడికబుర్లు వరుసగా గుర్తొస్తున్నాయి. ఎప్పటికో ఓ ఆలోచన వర్ధని మనసులో ప్రవేశించింది.

తను ఒక్కరోజు బడికి వెళితే ఏం కొంప మునుగుతుంది? వెళ్ళి అందరితో ఇంక ఎప్పటికీ ఈ బడికి రాను! మా వూర్లోని పంతులు బడికే వెళ్తానని గట్టిగా చెప్పేసి వస్తుంది. అందర్నీ చూసినట్టూ వుంటుంది. వీడ్కోలు చెప్పినట్లు వుంటుంది. అంతేకానీ ఇంకేమీ జరగబోదుకదా! వర్ధని మనసు తేలికపడింది.

ఆరోజు పెద్దగా గొడవ చేయకుండా రిక్షా ఎక్కింది వర్ధని.




ప్రతిరోజు ఉదయం అన్ని తరగతుల వాళ్లు వరుసలుగా నిలబడి ప్రార్థన చేస్తారు. ఆరోజు జాతీయగీతం, ప్రతిజ్ఞ అయ్యాక మేడం మాట్లాడింది. మృదుగంభీరమైన ఆమె స్వరం వర్ధని సంశయాలన్నిటిని దూరం చేసింది. ఆవిడ ఏం మాట్లాడిందో వర్ధని పట్టించుకోలేదు. కానీ ఎలా మాట్లాడిందో... ఆ విధానం వర్ధనిని ఆకర్షించింది. పిల్లలందరూ చెవులు అప్పగించి వింటు న్నారు.

ఆ తరువాత శశిరేఖ టీచర్ మాట్లాడింది. ఒక్కోరి పేరు పిలుస్తారు. వాళ్ళు మేడం దగ్గరికి రావాలి అని చెప్పింది.

మొదట తెలుగుమీడియం ఒకటవ తరగతినుంచే! రెండవ తరగతిలో మొదటి పేరు వర్ధనిదే!

శశిరేఖ టీచర్ పిలిచిన మూడవసారిగానీ వర్ధనికి తనను వాళ్ళు పిలుస్తున్నట్లుగా అర్థం కాలేదు. తడబడే అడుగులతో భయం భయంగా వాళ్ళ దగ్గరకి వెళ్ళింది. వర్ధని నడుస్తోంటే పిల్లలు కొడుతోన్న చప్పట్లు వర్ధనిలో ఏదో ఆందోళనని కలగజేశాయి. లోపలినుంచి సన్నని వొణకు ప్రారంభమైంది.

మేడం వర్ధనిని ఆప్యాయంగా దగ్గరకి పిలిచి, భుజాల చుట్టూ చేతులువేసి అభినందించింది. పిల్లలందరి కరతాళధ్వనుల మధ్య వర్ధనికి ప్రోగ్రెస్ కార్డు అందించింది. వర్ధని జరుగుతోన్న తతంగాన్ని బిత్తర పోయి చూస్తోంది. అరచేతులు చెమట్లు పట్టాయి. వణుకుతున్న చేతులతో ఆ కార్డును అందుకుంది.

మేడం వర్ధని తలమీద మృదువుగా, అభినందిస్తున్నట్లు తట్టింది.

వర్ధనికి తమ వూరికి జీపులో వచ్చినావిడ తన బుగ్గను మెల్లిగా తట్టినప్పుడు కలిగిన లాంటి అనుభూతే ఇప్పుడూ కలిగింది. వర్ధనికి ఆ కార్డుముక్కలో అంతటి మహత్యం ఏముందో అర్థం కాలేదు. అయోమయంగా దానివంకే చూస్తూ తన స్థానంలోకి మళ్ళీ వచ్చి నిలబడింది. తమ తరగతి వరసలో ముందు నుంచున్నవాళ్లు వెనక్కు తిరిగి, వెనక నుంచున్న వాళ్లు ముందుకు వంగి వర్ధని కార్డువంక ఆసక్తిగా చూస్తున్నారు. వాణి వాళ్ళ తరగతివాళ్లు గుసగుసలుగా "వాణి వాళ్లక్క.... వాణి వాళ్లక్క" అనుకోవడం వర్ధని చెవినపడింది. వాణి తలెగరేస్తూ ఏంటో చెప్తూందందరితో. వర్ధనికి విషయం అర్థం కావడానికి సమయం పట్టింది. క్లాసుటీచర్ గద్దించడంతో పిల్లలందరూ మళ్ళీ సరిగ్గా నిల్చున్నారు.

వాణికి నాలుగోర్యాంకు వచ్చింది. మొదటి రెండు ర్యాంకులు వచ్చినవారికి ప్రార్థనా సమయంలోనే కార్డులు పంచారు.

వర్ధనికి అందరూ తనవంక మెచ్చుకోలుగా చూస్తుంటే తెలీని ఉత్సాహం కలిగింది. తనమీద తనకే ఏదో విశ్వాసం కలిగింది. ఆ సాయంత్రానికి ఆ విశ్వాసం బలపడింది. ఆరోజు బడిలో వర్ధని చాలా ఉల్లాసంగా గడిపింది.

రిక్షావాడి దగ్గర, ఇంటికి వచ్చిన తరువాత వాణి వర్ధనికి మొదటిర్యాంకు రావడం గురించి లలిత దగ్గరా, ముకుందం దగ్గర, తన మిత్రమండలి దగ్గర ఊదర గొట్టేసింది. వర్ధనికి లోలోపల సంతోషంగా వున్నా పైకి మాత్రం తనకు సంబంధించిన విషయమే కానట్టు గంభీరంగా వుండిపోయింది.

అందరూ చూశాక అంతటి మహిమగల ఆ కార్డును భద్రంగా తెలుగువాచకంలో పెట్టి, సంచిలో దాచింది. ఎంతయినా అది ఇంద్రజాలం తెలిసిన కార్డుముక్క! అందరి అభిమానాన్ని ఇట్టే సంపాదించి పెట్టింది. సంచిలో పెట్టింది పెట్టినట్లే వుంటుందా? ఎక్కడికైనా మాయమైపోదుకదా? వర్ధని అనుమానంగా అనుకొంది.

★ ★ ★

పుస్తకం పట్టదు, అక్షరం వ్రాయదు. ఈ ర్యాంకు ఎలా తెచ్చుకుంది?

ముకుందం, లలిత కార్డును చూసి ఆశ్చర్యంలో మునిగిపోయారు.

ముకుందం మరుసటిరోజు ఆ కార్డు తీసుకొని బడికి తనే స్వయంగా వెళ్ళాడు. వాళ్ళ టీచర్లందరితో మాట్లాడాడు.

వర్ధని పాఠం శ్రద్ధగా వింటుందనీ, అడిగిన ప్రశ్నలకు టక్కున సమాధానాలిస్తుందనీ, అందుకే హోంవర్కు రాసినా రాయకపోయినా చూసీచూడనట్లు వుంటున్నామన్నారు. తామందరూ వర్ధనికి ఇంటిదగ్గర మంచి తర్ఫీదు ఇస్తున్నారని భావిస్తున్నామన్నారు. అందరూ వ్యక్తపరిచిన అభిప్రాయం ఒకటే - వర్ధనికి అద్భుతమైన గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి ఉన్నాయన్నది!

ముకుందంకి నమ్మబుద్ధి కాలేదు. నేరుగా వెళ్లి మేడంని కలిశాడు.

ముకుందం వర్ధని ఫలితాలపై ఆశ్చర్యం ప్రకటిస్తూ, ఆవిడతో వర్ధని చదువు గురించి, వారి టీచర్ల అభిప్రాయాల గురించి వివరించాడు. వర్ధని ఇంటిదగ్గర చేసే గొడవని విపులంగా వర్ణించాడు. ఆవిడ సావధానంగా అన్నీ వింది.

"వర్ధని విషయాలు ఎవరు చూస్తారు? " మామూలుగా అడిగిందావిడ.

"వాళ్ల అమ్మే చూసుకుంటుంది. అయినా మేమేదో పిల్లలకు కావలసినవి సమకూర్చడం వరకేగానీ వారి బాగోగులు పట్టించుకోవల్సినది ఆడవాళ్లే కదండీ!" ముకుందం కూడా మామూలుగానే అన్నాడు.

కానీ, ఆవిడ తీవ్రంగా స్పందించింది.

"ఇంత తెలిసినవారు మీరే అలాగంటే ఎలాగండీ ముకుందంగారూ? పిల్లల పెంపకం అనేది ఏదో ఆడవాళ్ల పనిలెండి అంటూ చులకనగా ఎందుకు తీసివేస్తారు? అసలు ఆడపనులు, మగపనులు అంటూ గీసుకున్న విభజన రేఖ రోజురోజుకీ హద్దులు చెరిపేసుకుంటుంటే మీరింకా అలా అంటున్నారేమిటి? ఆడవారు చేస్తున్నారు కాబట్టి అవి తేలిక పనులుగా భావించాల్సిన అవసరం ఉంటుందంటారా? "

ముకుందం ఆవిడవంక ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు.

"నిజానికి పిల్లల పెంపకం అనేది వ్యక్తిగతమైన విషయం మాత్రమే కాదు. ఇది ఒక సామాజిక విషయం. ఒక డాక్టరువల్ల, ఒక ఇంజనీరువల్ల, ఒక టీచరువల్ల ఈ సమాజానికి ఎంత మేలు జరుగుతుందో అంతకన్నా ఎక్కువే ఓ తల్లి వల్ల జరుగుతుంది. తల్లి సామాజికుల్నే తయారుచేస్తుంది. అయితే, ఆ తల్లి వారిని శాస్త్రీయ దృక్పథం కలవారిగా తీర్చిదిద్దడం అంత సామాన్యమైన విషయమేమీకాదు. అందుకు ముందు మనం సిద్ధంకావాలి. పిల్లల పెంపకంపట్ల శాస్త్రీయ అవగాహన పెంపొందించుకోవాలి. అందమైన, ఆరోగ్యమైన భవిష్యత్తును నిర్మించాలని ఆశించేవారు ఆరోగ్యకరమైన పునాది నిర్మాణంలో బాధ్యత పంచుకోకపోతే ఎలా? " ఆవిడ ఆగింది.

"ఏమైనా పిల్లల్ని పెంచగల నేర్పూ, ఓర్పూ వారికే సాధ్యమనీ..."

"అవును సుమండీ! నేనూ మర్చేపోయాను! మాతృదేవత అంటూ ఓ అందమైన పట్టం కట్టి, ఆ బాధ్యతలనుంచి మీరంతా సులువుగా చేతులు దులిపేసుకున్న సంగతి!"

ఆవిడ ఓ క్షణం ఆగి, మళ్లీ అంది. కోపంతో జేవురించిన మేడం మొహంవంక ముకుందం ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు.

"పిల్లలు మంచివారవడానికి, చెడ్డవారవడానికి తల్లిది ఎంత బాధ్యత ఉందో తండ్రిదీ అంతే వుంది. ముఖ్యంగా పిల్లల తొలి సంవత్సరాలలో వారి ప్రభావం చాలా ఎక్కువ! దాదాపు జీవితకాలం! ఆ తరువాత ఉపాధ్యాయులుగా మాదీ, ఆ తరువాత




సమాజానిదీ! మంచీ చెడుకు మధ్య విచక్షణ నేర్పి, మంచిని స్వీకరించేట్టు వారిని తీర్చిదిద్దాల్సిన బాధ్యత మీది, మాది, మనందరిదీ. అందుకే ఇదొక సమిష్టి బాధ్యత. ఒక ధృఢమైన నిశ్చయంతో, నిబద్ధతతో, అవగాహనతో సున్నితంగా నిర్వహించాల్సిన బాధ్యత"

ముకుందం మౌనంగా వింటూ ఉండిపోయాడు. ఇంతలో కాఫీలు రావడంతో ఆవిడ కాస్త నెమ్మదించి, ముకుందానికి కాఫీ అందించింది. తనూ కప్పు చేతిలోకి తీసుకొని నెమ్మదిగా చెప్పడం మొదలుపెట్టింది.

"నిజం చెప్పమంటారా ముకుందంగారూ! ఈ పిల్లలతో కలిసి తిరుగుతూంటే స్వచ్ఛమైన అనుభూతులు అనుభవానికొస్తాయి. మనలోని కల్మషాలు వారి అమాయకపు చిరునవ్వులముందు కరిగిపోతాయి. మన లోపాలు మనకు ఎదురుగా నిలిచి సరిదిద్దుకోమని హెచ్చరిస్తాయి. పిల్లలు వ్యక్తీకరించే స్వచ్ఛమైన, సున్నితమైన భావాలను వారితో స్వేచ్ఛగా కలిసి అనుభూతించలేని మీరంటే నాకెప్పుడూ జాలే!"

కాసేపు మౌనం తరువాత వార్తల్లో విశేషాల గురించి, జిల్లాలో రాజకీయాల

గురించి చర్చించాక ఆవిడ మృదువుగా, ఎప్పటిలా అంది.

"పిల్లలు అర్థం చేసుకోవాలని ప్రయత్నించేకొద్దీ అర్థంకాని విషయాలు! ఎందుకంటే ఇన్ని వందలమంది పిల్లల అభిమానం, సాన్నిహిత్యం నాకు లభిస్తున్నా... నా పిల్లవాడిని నేనెంతవరకు అర్థం చేసుకోగలిగానో నాకే అర్థంకాదు. వర్ధనిని నేను కూడా గమనించాను. వర్ధని తీవ్రమైన వత్తిడికి లోనవుతున్నట్లుగా అనిపిస్తుంది. ఏమైనా వర్ధని వజ్రంలాంటి అమ్మాయి. కాస్త మెళకువగా సానపట్టాలి"

ముకుందం తలాడిస్తూ వెళ్లడానికని కుర్చీలోంచి లేచాడు.

"ముకుందంగారూ! పిల్లల్ని చేయి చేసుకోకూడదని గట్టి నిర్ణయం తీసుకున్నా... అదేంటోగానీ నా పిల్లవాడి విషయంలో ఒక్కోసారి ఆవేశం అదుపు తప్పుతుంది. కోపతాపాలు మానవసహజం కాబట్టి లలిత గారిని కాస్త నిదానించడానికి ప్రయత్నించమనండి" ఆవిడ నవ్వుతూ అంది.

ముకుందం ఆవిడకు కృతజ్ఞతలు తెలుపుకొని, బడి బయటికి వచ్చాడు. ముకుందం ఆలోచనలన్నీ ఒక్కదగ్గరికే చేరుతున్నాయి. వర్ధనిని అర్థం చేసుకునేదెలా అన్న దగ్గరికి. ముకుందం మనసులో పిల్లలిద్దరూ మెదిలారు.

వాణి చక్కగా వేళకు తన పనులు చేసుకొని, వీధిలో పిల్లలతో ఆడుకోవడానికి వెళుతుంది. వర్ధని ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నదాన్లా ఎక్కడ పడితే అక్కడ కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తూ ఉంటుంది. ముకుందంకి వర్ధనిని అంచనా వేయడం ఎలాగో, అర్థం చేసుకోవడం ఎలాగో అర్థంకావట్లేదు.

ఆవిడ అన్నదాంట్లో తప్పేమైనా ఉందా? ముకుందం మళ్లీ మళ్లీ ఆలోచించాడు. తను వర్ధనిని అర్థం చేసుకోవడానికి ఆలస్యం చేశాడా? ఊర్లో ఉన్నప్పుడు వర్ధని అన్నావదినలకు సంబంధించిన విషయం అనుకొన్నాడు. ఇప్పుడు లలితకు సంబంధించినదని! ఊరినుంచి తీసుకొచ్చి బడిలో చేర్పించడంతోనే తన బాధ్యత తీరిపోయిందా? ఇప్పుడు తనేం చేయాలి? ముకుందం ఆలోచనలలోంచి తేరుకోకముందే ఇల్లు వచ్చేసింది.



వర్ధని మరుసటిరోజు బడికి వెళ్లేటప్పుడు ఎంతో ధీమాగా వెళ్లింది.

ఎవరు ఏం మాట్లాడుకుంటున్నా తన గురించే మాట్లాడుకుంటున్నట్లుగా అనిపించింది వర్ధనికి. తను ఆ దర్పంలో మునిగి వుండగానే మొదటి రెండు క్లాసులు అయిపోయాయి. వర్ధని ఇంటర్వెల్ అవగానే అలవాటు ప్రకారం తురాయి చెట్టువైపు నడిచింది.

వర్ధనికి మేడం గదిలోంచి బయటకు వస్తున్న ముకుందం కనిపించాడు.

'ఈయన ఇక్కడికెందుకు వచ్చాడు?' వర్ధని భ్రుకుటి ముడివడింది.

ముకుందం అటూ ఇటూ చూడకుండా ఓ రిక్షా కేకేసి దాంట్లో కూర్చుని వెళ్లాడు.

'ఏదో కొంపలు మునిగినట్లు ఆ మొహమేమిటి?' వర్ధని ఆశ్చర్యంగా అనుకుంది. ఆ రోజంతా వర్ధని ఆలోచిస్తూనే ఉండిపోయింది, ముకుందం బడికి రావడం గురించి. వర్ధనికి కారణం ఏమై ఉంటుందో ఎంత ఆలోచించినా తట్టలేదు.

ఇంటికి వెళుతున్నప్పుడు వాణి రిక్షా అత




నితో వర్ధనికి వచ్చిన మార్కుల గురించి చెపుతోంది. వర్ధని అతనికి కార్డు చూపిద్దామని తెలుగు వాచకాన్ని సంచిలోంచి బయటకు తీసింది. దాంట్లో కార్డు కనిపించలేదు. పేజీ పేజీ తిరగేసి మళ్లీ మళ్లీ చూసింది. వర్ధని గుండెల్లో రాయి పడినట్లయింది.

కార్డు తను ఇక్కడే కదూ పెట్టింది! ఏమైనట్లు? వర్ధని వాణిని అడిగింది. వాణి "నాకు తెలీదు బాబోయ్" అంటూ చేతులు పైకి ఎత్తేసింది.

వర్ధనికి దిగులు ప్రారంభమైంది.

తనేమనుకొంది అసలు? ఈ కార్డును ఊరికి తీసుకెళ్లి అందరికీ గర్వంగా చూపిద్దామనుకోలా? చూపించి మేడం ప్రశంసల గురించి, పిల్లల గుసగుసల గురించి వివరిద్దామనుకోలా? ఆ సరోజ వదిన ఎప్పుడూ వెటకారాలు పడుతూంటుందే... ఇక టక్కున నోరు మూసుకొనేది కాదూ? ఆ కుళ్లుమోతు సరళకి తను ఎంత బాగా చదువుతుందో తెలియచెప్పాలనుకోలా? ఆ సరళ మళ్లీ నోరెత్తేదేనా? ఇంతకీ అది ఏమైనట్లు? దానికి ఏమైనా మంత్రశక్తి వుందా మాయమైపోవడానికి! ఏమో? ఉండినా ఉండొచ్చు! లేకపోతే తను పొద్దుట్నించి సంచిని కిందైనా పెట్టలేదు. మరి అది ఏమైనట్లు? ఇంద్రజాలంతో రెక్కలొచ్చి ఎగిరిపోయుంటుందా? అది సాధ్యమేనా?

వర్ధనికి టక్కున ఏదో గుర్తొచ్చింది. ఈ ముకుందం పొద్దున బడికి వచ్చాడు కదూ? ఖచ్చితంగా ఇతనే ఏదో చేసుంటాడు! బళ్లో చేర్పించడానికి వచ్చిన రోజు కూడా మేడంతో ఎంతో పరిచయమున్నట్లు మాట్లాడాడు కదూ! అంటే ఇదంతా ఈ ముకుందం తనను ఇక్కడే ఈ బళ్లోనే... ఈ ఊళ్లోనే... ఎప్పటికీ ఉంచేయడానికి పథకం ప్రకారం చేసిన కుట్రన్నమాట! మేడం... తన ప్రియమైన మేడం... ఆవిడ కూడా ముకుందం మాయలోకి వచ్చేసింది. ఆ కార్డు... అంతా అబద్ధం! అంతా... వొట్టి అబద్ధం! వర్ధనికి ఏడుపు పొర్లుకుంటూ వస్తోంది. బలవంతంగా దిగమింగి లోపలి గదిలోకి పరిగెత్తింది. సంచిని ఓ మూలకి విసిరికొట్టి, మంచంమీద బోర్లాపడి, వెక్కి వెక్కి ఏడ్చింది.

ఎక్కడినుండో లయాత్మకంగా వినబడుతున్న చిన్ని చేతుల చప్పట్లు వర్ధనిని పిచ్చి దాన్ని చేస్తున్నాయి. వర్ధని మంచంమీద నుంచి దిగ్గున లేచి కూర్చుంది. ఎదురుగా సంచిలోని పుస్తకాలు చెల్లాచెదురుగా పడివున్నాయి. వర్ధని తెలుగు వాచకం చేతిలోకి తీసుకొని ఆశగా గబగబ వెతికింది. మళ్ళీ మళ్లీ! ఉక్రోషంతో ఆ పుస్తకాన్ని పరపరా చింపి ముక్కలు చేసింది. వర్ధని ఆవేశం చల్లారింది.

మంచంమీద వెల్లకిలా పడుకొని దిండు మొహాన పెట్టుకుంది.

అసలు తనకి ఏదో అవుతోంది! లేకపోతే పిచ్చిదాన్లా ఆ సరళతో ఇక్కడి బడి గురించి అంత పొగరుగా ఎందుకు వాగుతుంది? తనకి ఈ బడీ నచ్చలేదు! ఏవీ నచ్చలేదు! తను ఊరికి వెళ్లిపోవాలి... వెళ్లిపోవాలి! పంతులు బడిలోనే చేరిపోవాలి! ఇక్కడంతా మోసం! అంతా అబద్ధం!

వర్ధని కళ్లముందు ఒక్కో దృశ్యం కదలాడుతోంది. ఒకదాంట్లో ఒకటి నెమ్మదిగా కలిసిపోతోంది. తను తుమ్మచెట్లకింద చిన్ని చిన్న బుజ్జి బుజ్జి కోడిపిల్లల్ని పట్టుకోవడానికి ప్రయత్నిస్తూ పరుగులు తీస్తోంది. అందులో ఓ బుజ్జి కోడిపిల్ల హఠాత్తుగా వెనక్కి తిరిగి, మెడ నిక్కించి వర్ధని కళ్లల్లోకి సూటిగా గుచ్చి గుచ్చి చూస్తోంది. వర్ధని దిమ్మెరపోయి చూస్తుండగానే అది వర్ధని కన్నా ఎత్తయిపోయింది! దానిలాగే ఒక్కసారిగా మిగిలినవన్నీ! చిక్... చిక్... చిక్... మంటూ. అవి వర్ధనిచుట్టూ ముక్కులు విసురుతూ చేస్తున్న ధ్వని వర్ధని చెవుల్ని

చిల్లులు పడేలా చేస్తోంది. ఆ కోడిపిల్ల మొహంలోంచి వికృతంగా అరుస్తూ రైల్లో పూనకం వచ్చినామె ప్రత్యక్షమైంది. వర్ధనికి వళ్లంతా చెమట్లు పట్టాయి. గబుక్కున లేచి కూర్చుంది.

వర్ధనికి ఆ కోడిపిల్లలు తనను చుట్టుముట్టడం కలో నిజమో అర్థంకావట్లేదు. మొహాన పట్టిన చెమట్లు తుడుచుకొని, మంచం దిగబోయేసరికి వాణి వచ్చింది, అమ్మ భోజనం వడ్డిస్తోంది రమ్మంటూ.

వర్ధని వాణి వెనకే బుద్ధిగా వెళ్లి భోంచేసి వచ్చి, మళ్లీ పడుకుంది.

ముకుందం తెల్లవారుఝామున నిద్రలేచి, ఎప్పటిలా పుస్తకాలు పట్టుకోకుండా పిల్లల దగ్గరికి వచ్చి కూర్చున్నాడు.

నిద్రపోతున్న వాణి మొహం ప్రశాంతంగా ఉంది.

వర్ధని ఒకచేత్తో దుప్పటిని గట్టిగా పట్టుకొని ఉంది. తన చేతిని తీసి గుండెలమీద పెట్టుకుంది. నొసలు ముడిపడ్డాయి. అసహనంగా కాసేపు అటూ ఇటూ దొర్లింది. వర్ధని తాబేలులాగా కాళ్లు చేతులు ముడుచుకుని తనలో తాను ఒదగడానికి ప్రయత్నించింది. నెమ్మదిగా అలాగే జరుగుతూ గోడదాకా జరిగింది. పెదవులు సన్నగా కంపిస్తున్నాయి. ముకుందానికి వర్ధని మొహాన అభద్రతాభావం కొట్టొచ్చినట్టు కనిపించింది. ఇంతకుమునుపు ధీమా దర్పం తొణికిసలాడే వర్ధని మొహంలో పిరికితనం, ఒంటరితనం తాండవిస్తున్నాయి.

అడుగుల చప్పుడు విని ముకుందం వెనక్కి తిరిగి చూశాడు.

లలిత మౌనంగా వచ్చి తన వెనకే నిల్చుంది. వర్ధనివంక నిస్సహాయంగా చూస్తున్న లలిత మొహంలో కూడా ముకుందం తన మనసులోని భావాలే చదవగలిగాడు.

ముకుందం లలితవంక పరిశీలనగా చూశాడు.

లలితలో చిరాకు, అసహనం, మాట్లాడితే మండిపడడం ఈమధ్య ఎక్కువే అయ్యాయి.

ఎంతో చదువుకున్నాడు, ఉద్యోగం చేసి, పట్నాలన్నీ తిప్పుతాడని అనుకొన్నా, తను ఇక్కడెక్కడో పొలాలమధ్య ఒంటరి బతుకు బతకడానికి రమ్మన్నప్పుడూ లలిత వెనకాడలేదు.

అయినవాళ్లందర్నీ అక్కడెక్కడో వదిలేసి, చూరట్టుకు జారుతున్న పాములమధ్య, తేళ్ల మధ్య కాపురం చేస్తున్నప్పుడూ తొణకలేదు.

సవారమ్మతో కలిసి పొలం గట్లమ్మట కూలీల బాగోగులు చూడటానికి విసుగు పడలేదు.

వేణుతో కలిసి దొరువును పూడ్చి, ఇల్లు కట్టేటప్పుడు చికాకుపడలేదు.

ఇప్పుడిప్పుడే చుట్టాలు, ఊరివాళ్లు ఒక్కొక్కరు వచ్చి ఆ పొలాలమధ్య ఇంటినే చిన్న ఊరిలా మార్చి, వారితోపాటు తెచ్చిన చిక్కుల్ని విడదీయాల్సి వచ్చినప్పుడు కలవరపడలేదు.

కష్టపడి సృష్టించుకున్న పరిసరాల్ని వదిలి ఇక్కడ... మళ్లీ కొత్త జీవితం మొదలుపెట్టానన్నప్పుడూ బెదరలేదు.

అప్పుడు అందరం కలిసి పని పంచుకున్నాం! సమస్యల్ని కలిసి పరిష్కరించుకున్నాం! సంతోషాల్ని కలిసి అనుభూతించాం!

అలాంటి సామరస్యంకోసమే లలిత ఇప్పుడూ ఎదురుచూస్తోందా? పిల్లల విషయంలోనూ అలాంటి సహకారాన్నే కోరుకుంటుందా? పిల్లల్ని తీర్చిదిద్దే క్రమంలో ఆడవాళ్లందరూ లలితలానే ఇలాంటి వత్తిళ్లకే గురవ్వుతూ ఉంటారా? నిజానికి లలిత వర్ధని విషయం ప్రస్తావించినప్పుడల్లా తనేం చేశాడు? మరేదో ముఖ్యమైన సమస్యలో మునిగి ఈ విషయాన్ని పెడచెవిన పెట్టాడు. తనకసలు వర్ధని విషయం కూడా వాటిలాగే... వాటికన్నా ముఖ్యమైన విష




యమని ఎందుకు అనిపించలేదు? లలిత లోని సంఘర్షణను తను సానుభూతితో ఎందుకు అర్థం చేసుకోలేకపోయాడు? ముకుందంలో అపరాధభావన తలెత్తింది.

లలిత ముకుందం మొహంలో వేగంగా మారుతున్న భావాలను అయోమయంగా చూసింది. కాసేపు అలానే నిల్చుని, ముకుందం నోరు విప్పకపోవడంతో ఆ రోజుటి కార్యక్రమం మొదలుపెట్టడానికి వంటింట్లోకి వెళ్లింది.

ముకుందం వర్ధనివంకే చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు.

తామందరూ రేయింబవళ్లు ఆ పొలాల్లోనే, ఆ మట్టిమీదే పడివుండినా, ఈ గడ్డకు పరాయివాళ్లమన్న భావనను వదలడానికి ఎంత సమయం పట్టింది? ఎంత సంఘర్షణ పడ్డారు మానసికంగా! తమ కష్టార్జితం కళ్లముందు కదలాడిన నాడు రాలేదని! స్థానికులు తమ శ్రమను గుర్తించి విలువనిచ్చిన నాడు - అభిమానంతో, గౌరవంతో తమలో ఒకరిగా ఆహ్వానించిన నాడు - వారి సంస్కృతిలో - వారి హృదయాల్లో స్థానం సంపాదించిననాడు వచ్చింది! అదే తామూ ఇక్కడి జీవన వాహినిలో భాగమన్న భావన!

లలిత, వేణు కొత్త గడ్డమీద సులువుగానే ఇమిడిపోయాడు. పని... పని... పని! ఆ పనే వారిలో పరాయిభావనను పోగొట్టింది.

అన్నయ్యా, వదినా ఇప్పటికీ ఎప్పుడో వదిలివచ్చిన ఆ ఊరి జ్ఞాపకాలతోనే బతుకుతున్నారు. ఆ పరిసరాలను ఇక్కడ సృష్టించుకోవడానికే ప్రయత్నిస్తున్నారు.

నిజానికి, ఏదో చెయ్యాలన్న ఆరాటమే ఆపకపోతే తను ఏనాడో తమ ఊరికి తిరిగిపోయేవాడు కాదూ? మరి ఈ చిన్నపిల్ల ఇన్నాళ్లు అన్నయ్యా, వదినలనే లోకంగా బతికింది. ఒక్కసారిగా తననూ, లలితనూ వారి స్థానంలో ఉంచగలదా? అసలే వర్ధనికి అభిమానం ఎక్కువ. అహాన్ని చంపుకొని పరాధీనతను సహించగలదా? తమకు సన్నిహితం కాగలదా?

వర్ధని విషయంలో లలిత కూడా ఎంత నలిగిపోయింది! ఎంత కఠినంగా మారిపోయింది! ముకుందం వర్ధని మొహంలోకి చూస్తూ ఉండిపోయాడు.

ఎందుకోగానీ వర్ధని గబగబ తల బాదుకుంటూ ఓ క్షణం, మరోక్షణంలో వెర్రి నవ్వులు నవ్వుతూ ముకుందం కళ్లముందు కదలాడింది. అదీ అచ్చం తమ ఊళ్లోని పెద్దమ్మాయిలా! ముకుందం విలవిలలాడిపోయాడు. అమ్మో! అలా జరగడానికి వీల్లేదు!

ముకుందంకి ఎక్కడినుండో మేడం స్వరం గంభీరంగా వినపడింది.

"చాలా మంది తండ్రులు భలే తెలివిగలవాళ్లండి ముకుందంగారూ! పిల్లల పెంపకంలో అతి ముఖ్యమైన క్లిష్టమైన సమయాన్ని తల్లిమీద వదిలేస్తారు చివరకు వాడు ప్రతిభావంతుడైననాడు వీడికి అంతా నా పోలికేనంటూ గర్వంగా చాటుతారు. సమాజం కూడా తల్లి ప్రస్తావన లేకుండానే వారిని ఫలాన అతని పిల్లలుగానే గుర్తిస్తుంది. గౌరవిస్తుంది. అదే తారుమారయితే పండితుడి పుత్రుణ్ణి పరమశుంఠలా తయారుచేసిందని భార్యమీద విరుచుకుపడతారు. బిడ్డల్ని నిర్లక్ష్యం చేసే తల్లులూ ఉన్నారు. శ్రద్ధవహించే తండ్రులూ వున్నారు. ఇంతకీ నే చెప్పేది ఏమిటంటే - ఇది ఇద్దరూ సమన్వయంతో నెరవేర్చుకోవాల్సిన బాధ్యత అని!"



ఆ శనివారం ఎప్పటిలాగానే పిల్లలందరినీ చెట్టుకిందికి పిలిపించింది మేడం. పిల్లలందరూ సర్దుకొని కూర్చున్నాక తన కమ్మని కంఠంతో చక్కటి కథ ఒకటి వినిపించడం మొదలెట్టింది. మధ్యమధ్యలో

పాడుతూ, కథలోని పాత్రలకనుగుణంగా కంఠం మారుస్తూ చెపుతోంది. చెల్లాచెదురుగా కూర్చున్న పిల్లలందరూ నెమ్మదిగా ఆవిడ చుట్టూ చేరారు. వర్ధని ఆవిడ కోమల కంఠ మాధుర్యానికి ముగ్ధురాలైంది. కథకు అనుగుణంగా మారుతోన్న మేడం ముఖ కవళికలు హృదయాన్ని కదిలించి వేస్తున్నాయి.

ఆ కథ బాణం దెబ్బ తగిలి గాయపడ్డ హంసను సిదార్థుడు చేరదీసిన కథ. కరుణ రసభరితంగా సాగుతోన్న ఆ కథ మధ్యలో దయార్ద్రహృదయుడైన సిద్ధార్థుడే గౌతముడనీ, బుద్ధుడనీ చెప్పింది మేడం.

వర్ధనికి టక్కున గౌతం గుర్తొచ్చాడు. అంత గొప్ప మనిషి పేరు పెట్టుకున్న గౌతం నిర్దాక్షిణ్యంగా అన్ని తుమ్మెదల రెక్కలు ఎలా పీకేయగలిగాడు? మేడం ఈ కథ గౌతంకి చెప్పివుండదా? తుమ్మెద రెక్కలతో పాటే వర్ధనికి వరుసగా పడుకున్న కోడిపిల్లలు గుర్తొచ్చాయి. అశాంతిగా తల విదిల్చింది. అయినా తను వాటినేం బాధపెట్టలేదుగా! గింజలు తినిపించి, నీళ్లు తాగించి పడుకోబెట్టింది. అవి హాయిగా నిద్రపోయాయి. అంతే!

వర్ధని మనసు కుదుటపడింది. మళ్లీ మేడం కథవైపు చెవి వొగ్గింది. కథ అంతా చెప్పడం అయ్యాక ఆవిడ పిల్లలనెవరినైనా కథ చెప్పమని ప్రోత్సహించింది. పిల్లలంతా నువ్వు చెప్పంటే నువ్వు చెప్పు అని వంతులు వేసుకుంటున్నారు.

ఆవిడ నవ్వుతూ, "పోనీ, నే చెప్పిన వాళ్లు చెప్పండి" అంటూ గీతవైపు తిరిగింది. "ఏమ్మా గీతా!... నువ్వు చెప్తావా? "

గీత మొదట తటపటాయించి తరువాత రాజు - ఏడు చేపల కథ చెప్పింది.

మేడంమీది గౌరవంతో అందరూ బుద్ధిగా విన్నారు. కానీ, అది అందరికీ తెలిసినకథే! కొత్తది విన్నంత ఉత్సాహం పాతకథలో ఏముంటుందీ! వర్ధని విసుగ్గా అనుకొంది.

మేడం కథ అంతా అయ్యాక అందరితో చప్పట్లు కొట్టించింది. తనూ సంతోషంగా చప్పట్లు కొట్టింది.

వర్ధనికి గీతంటే అసూయగా అనిపించింది. 'తనే చెపితేనా? అసలు ఈ పాత చింతకాయ పచ్చడి జోలికే వెళ్లదు! ఆ మొహం చూడు! ఏదో గొప్ప కథ వినిపించినట్టు!'' వర్ధని గీతవంకే చూస్తూ అనుకొంది.

★ ★ ★

ఆరోజు ఆదివారం. ముకుందం ఆ ఉదయాన్నే ఊరినుంచి వచ్చాడు.

వాణి తలంటించుకొని, చిక్కు తీయించుకొంటోంది. వర్ధని తలస్నానం ఎగ్గొట్టడానికి గదిలో ఓ మూల నక్కి పథకాలు వేస్తోంది.

ముకుందం వాణిని పిలిచి, వర్ధనిని పిలుచుకు రమ్మన్నాడు. లలిత వాణికి గబగబ జడ అల్లి పంపింది.

వాణి ఎంత బతిమిలాడినా వర్ధనిని ఉన్న చోటనుంచి ఒక్క అంగుళం కూడా కదల్చలేకపోయింది. తను ఏమాత్రం మెత్తబడినా ఏం జరుగుతుందో వర్ధనికి తెలుసు. నేరుగా బాత్రూంలోకి లాక్కెళ్తారు.

ముకుందం తనే వర్ధని కూర్చున్న గదిలోకి వచ్చాడు. అక్కడే ఉన్న మంచంమీద కూర్చున్నాడు. వాణిని దగ్గరకి పిలిచాడు.

"ఇదుగో వాణీ, నువ్వు నా చేతిని మోచేయి దగ్గర వంచావనుకో నీకో మంచి బహుమానం!" ముకుందం పిడికిలి మూసి, చేతిని కర్రముక్కలా బిగించి, ముందుకు చాచాడు.

వర్ధని ఎటో చూస్తున్నా, చెవుల్లో ఈ మాటలు పడుతూనే ఉన్నాయి. కను చివరలనుండి తతంగాన్నంతా గమనిస్తోంది.

వాణి ముప్పుతిప్పలు పడినా ముకుందం చేతిని వంచలేకపోతోంది.

ముకుందం ఓసారి వాణిని చేయి గట్టిగా బిగదీయమని, తను సులభంగా వంచి




చూపాడు. వర్ధనికి కూడా ఆసక్తి కలిగింది. వాణి ప్రయత్నాలు విఫలమవుతున్న కొద్దీ తను వంచగలదా అని అనుకొంది వర్ధని.

ముకుందం హఠాత్తుగా వర్ధనివైపు తిరిగాడు.

"నువ్వు రా వర్ధని! నువ్వైతే, సులువుగా వంచేయగలవుకదా! వాణికి ఏమీ చేతగాదు!" వాణి నాలుక బయటకు పెట్టి ముకుందాన్ని వెక్కిరించింది.

వర్ధనికి ముకుందం తనపై వ్యక్తపరిచిన విశ్వాసానికి ఆశ్చర్యం వేసింది.

వర్ధనికి పెదనాన్న మాటలు గుర్తొచ్చాయి. ఎక్కడున్నా, ఏం చేసినా వర్ధనమ్మవి వర్ధనమ్మలానే ఉండాలి! అవును. తను తన ప్రత్యేకతను నిలబెట్టుకోవాలంటే ఈ వాణి చెయ్యని, చెయ్యలేని పనుల్ని చేయాలి! వర్ధని అప్పటికప్పుడు నిశ్చయించుకొంది.

ఇంతలో వాణి ఉక్రోషంగా అంది, "ఎందుకు నాన్నా నువ్వు వర్ధనక్కని సులువుగా చేయగలదని అన్నావ్? తనేమో అక్కణ్ణించి కదలనైనా కదలదాయె!" కాసేపాగి, బతిమిలాడుతూ అంది వాణి, "చిన్న పిల్లని కదా నాన్నా ఆ బహుమానం ఏదో నాకు ఇచ్చేయవా? "

వర్ధని చివ్వున తలెత్తింది. ముకుందం మరోసారి వాణి మాటలు వల్లిస్తూ, వర్ధనిని పిలిచాడు. వాణి ఇద్దర్నీ వెక్కిరించింది.

వర్ధని మొహం ఎర్రబడింది. ముక్కుపుటాలు ఎగరేస్తూ వచ్చి ముకుందం ఎదురుగా నిల్చుంది. తనకై తను ముకుందానికి ఇంత దగ్గరగా రావడమే అరుదు. అందులోనూ చేయి వంచాలంటే ముకుందాన్ని ముట్టుకోవాలి. వర్ధని కాసేపు తటపటాయిస్తూ అలాగే నిల్చుండిపోయింది.

మళ్లీ వాణి, ముకుందం వర్ధనికి పౌరుషం తెప్పించారు.

వర్ధని మొదట ముకుందం పిడికిలి దగ్గర పట్టుకొని వంచాలని ప్రయత్నించింది. కుదరలేదు. ఓ క్షణం ఆగి, హఠాత్తుగా ముకుందానికి చక్కిలిగింతలు పెట్టింది. ముకుందం అప్రయత్నంగా చేయి బిగువు సడలించాడు. వర్ధని గబుక్కున చేయి వంచేసింది.

వాణి సంబరంతో చప్పట్లు కొట్టి, ఆనందంగా అరుస్తూ హంగామా చేసింది.

ముకుందం వర్ధని సమయస్ఫూర్తికి మెచ్చుకోలుగా చూశాడు.

వర్ధని మౌనంగా గోడపక్కకెళ్లి నిలబడింది.

ముకుందం ఆరోజు ఊరినుంచి తెచ్చిన బ్యాగులోంచి ఓ పెద్ద ప్యాకెట్టు తీసి వర్ధనికి అందించాడు. దానిమీద ఎర్రరంగు కాగితం చక్కగా చుట్టివుంది.

వర్ధని అందుకోవడానికి చేయి చాచలేదు. నిర్లిప్తంగా నిలుచుండిపోయింది. అంతే... వాణి గబుక్కున దానినందుకొంది. దాని బరువుకి కింద కూలబడింది.

ముకుందం నవ్వుతూ వాణి నెత్తిన ఓ చిన్న మొట్టికాయ వేసి, బయటికి వెళ్లిపోయాడు. వాణి గబగబ ప్యాకెట్టు చింపి, లోపల ఏముందో చూసింది.

బోలెడన్ని పుస్తకాలు! రంగురంగుల బొమ్మల పుస్తకాలు! కమ్మని కథల పుస్తకాలు!

వాణి ఆనందంతో ఓ పొలికేక పెట్టింది. వర్ధనికి కూడా కుతూహలంగా ఉన్నా బింకంగా వాటివంక చూడకుండా నిల్చుంది.

"అబ్బ! ఎన్ని బొమ్మల పుస్తకాలో! అక్కా... అక్కా... నాక్కూడా కథలు చదివి వినిపించవా? మా మంచి అక్కవి కదూ!" వాణి బతిమిలాడుతూ అంది.

వర్ధని ఏమీ మాట్లాడలేదు.

వర్ధని పదాలు కూడబలుక్కొని కథ చదవగలదని వాణికి తెలుసు.

మురళి, వేణు ఎప్పుడైనా కథల పుస్తకం తెస్తే వర్ధనే గట్టిగా చదివేది. తామందరూ

నోరు తెరుచుకొని వినేవాళ్లు. సరళ, తను... ఇంకా బళ్లోని పిల్లలు. వాణి అందుకే రెండు మూడుసార్లు వర్ధనిని చదివి వినిపించమని అడిగింది. వర్ధనిలో చలనం లేకపోయేసరికి పుస్తకాల్ని విసురుగా వర్ధని వళ్లో పడేసి విస విసా నడుచుకొంటూ బయటకు వెళ్లింది.

వర్ధని ఆ పుస్తకాలవంక పరిశీలనగా చూసింది.

పైనున్న పుస్తకం మొదటి పేజీ తిప్పగానే వర్ధని పేరు రాసివుంది. ప్రతి పుస్తకం లోనూ వర్ధని పేరే ఉంది. వర్ధనికి ఆశ్చర్యం వేసింది. పందెంలో తనే గెలుస్తానని ముకుందంకి ఎలా తెలుసు? వర్ధనికి తనపై ముకుందానికి ఉన్న నమ్మకానికి గర్వం కలిగింది.

ఆ పుస్తకాల్ని తను స్వయంగా సంపాదించుకొన్న అపురూప నిధిలా పొదివి పట్టుకొని, తన బడి పుస్తకాల వెనక దాచింది, వాణికి కనిపించకుండా.

పుస్తకంలో ముకుందం రాసిన అక్షరాలు గుంభనంగా, గంభీరంగా నవ్వుకున్నాయి.

అలాగే తలుపు అవతల నిల్చుని ఉన్న లలిత, ముకుందం కూడా!

బడిలో కార్డు ఇచ్చినప్పుడల్లా పండగలకి, పబ్బాలకి, ఏవో కల్పించబడిన సందర్భాలకి ముకుందం నుంచి వర్ధనికి బొమ్మల పుస్తకాలు బహుమతులుగా అందుతూనే ఉన్నాయి.

వాణి వర్ధనితో కథలు చెప్పించుకోవడానికని వర్ధనితో సఖ్యంగా ఉండటానికే ప్రయత్నిస్తోంది. లలిత కూడా పిల్లలిద్దరూ ఎక్కువగా కలిసివుండేట్టు చూస్తోంది.

ముకుందంపట్ల వర్ధనికి అంతకుముందున్న అయిష్టత కొంచెం తగ్గింది.

అప్పుడప్పుడూ కథలలోని కఠిన పదాల అర్థాలకోసం వర్ధని ముకుందంనో, లలితనో సహాయం కోరాల్సివస్తోంది. అలాంటప్పుడు వర్ధని వాణిద్వారా ఆ పని చేయిస్తోంది. లేదా శశిరేఖ టీచర్ సహాయం తీసుకొంటోంది.

లోలోపల వర్ధని తనని తాను పుస్తకాలలోని రాకుమారిలాగానో, ఓ తెలివైన కుందేలులాగానో ఊహించుకుంటోంది. అలాగే ముకుందాన్ని ఓ టక్కరి నక్కలా, లలితను ఓ మంత్రగత్తెలా, వాణిని ఓ జిత్తులమారి తోడేలులా భావించడం మొదలెట్టింది.

ఆ ఊహల్లో మునిగిన వర్ధనికి కాలం తెలీనంత వేగంగా గడిచిపోతోంది.

తనలోని అసంతృప్తి, ఆవేదన వర్ధని ఎంతగా అణిచిపెడుతున్నా కప్పులు పగలగొట్టినప్పుడు, అన్నం పళ్లెం విసిరికొట్టినప్పుడు, పక్కలు తడిపినప్పుడు, వాణిని కొరికినప్పుడు బయట పడుతూనేవుంది.

అలాగే కొత్త పుస్తకం చదివిన అనుభూతి, మిగిల్చిన ఉత్సాహం, ఆనందం ఎప్పుడైనా వాణికి చదివి వినిపించేటప్పుడు బయటపడుతూనే ఉంది. సకల భోగభాగ్యాల మధ్య ఉన్నా కూడా... ఒంటిస్తంభం మేడలోని రాకుమారి ఎంతటి పరాధీనురాలో చిన్నారి వర్ధనికి ఏం తెలుసు పాపం!

★ ★ ★

ఆ శనివారంనాడు మేడం కథనాన్ని వర్ధని నిశితంగా పరిశీలించింది.

వర్ధని ఆ మర్నాడు వాణికి కథ వినిపించేటప్పుడు మేడంని జాగ్రత్తగా అనుకరిస్తూ చెప్పింది. వర్ధనికి పుస్తకం చూస్తూ కూడబలుక్కుని చదవడంకన్నా ముందు చదివేసి, మేడంలా పుస్తకం పట్టుకోకుండా చెప్పడమే నచ్చింది. వాణికి, ఆమె మిత్రబృందానికి కూడా!

చివరికి ఓరోజు వర్ధనికి మేడం ముందు కూడా కథ చెప్పాల్సి వచ్చింది.

వర్ధని సంకోచిస్తూ కూర్చున్న చోటినుండి కదలకుండా తలని వంచేసి కూర్చుంది. మేడం, పిల్లలు అందరూ కథ చెప్పాలని ఒత్తిడి చేయడంతో మెల్లిగా చెప్పడం మొదలెట్టింది. కథ మొదలుపెట్టిందోలేదో వర్ధని గొంతు బొంగురుపోయింది. పిల్లలంతా







వెక్కిరింతగా ఫక్కుమన్నారు.

వర్ధని కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి. మూతి బిగించి కూర్చుంది.

మేడం అంగరినైపు కళ్లు పెద్దవి చేసి చూడగానే వారు టక్కున నవ్వులాపారు.

వర్ధని తను కథ ఎందుకు చెప్పలేకపో తోందో అర్థంకాలేదు. ఈ కథ ఎన్నోమార్లు వాణికి చెప్పింది. దానిలోని జంతువుల అరుపులన్నీ వినిపిస్తూ మరీ చెప్పేది. ఇప్పుడు ఎందుకనో నోరే పెగలడంలేదు. వర్ధనికి తను కూర్చున్నచోటినుండి మాయ మైపోతే బావుండుననిపించింది. ఎంత అవ మానం!!

మేడం నెమ్మదిగా వర్ధని దగ్గరికి వచ్చింది. వర్ధనిని చనువుగా వళ్లోకి తీసు కొని, ధైర్యం చెప్పినట్లుగా వీపు తట్టింది. వర్ధని చెవిదగ్గరకు వంగి, గుసగుసలాడిన ట్లుగా అంది, "నీవు కథ చక్కగా చెప్పగలవు కదూ! నాకు తెలుసు!"

వర్ధనికి ఏదో లోకంలో ఉన్నట్లుగా ఉంది. తన సంశయాలన్నీ పటాపంచల య్యాయి. మేడం తనపట్ల ప్రకటించిన విశ్వాసంతో వర్ధనిలో ఏదో ధైర్యం మొదల యింది. మేడం వళ్లో కూర్చుంటే సింహా సనం ఎక్కినట్లుగా ఉంది.

మేడం మళ్లీ వర్ధనిని కథ మొదలుపెట్ట మని ప్రోత్సహించింది.

వర్ధని తల ఎత్తి ఆవిడ మొహంలోకి చూసింది. మేడం చిరునవ్వుతో తననే చూస్తోంది. వర్ధని మెల్లిగా మొదలుపెట్టి, ఎప్పుడూ వాణికి చెప్పినట్లే కథ చెప్పడం మొదలుపెట్టింది.

ఆ కథ సోమరితనం కన్నా శ్రమశక్తిలోనే ఆనందం ఉందని చాటిచెప్పే వాసిరెడ్డి సీతాదేవిగారి కథ. సింహం-గాడిద కథ. తన బుజ్జి కథల్లోని కథ. వాణికి ఎంతో నచ్చిన కథ. తనూ, వాణి అభినయించి ఆనందించే కథ.

సింహంలా గర్జించి, గాడిదలా ఓండ్రపెట్టి అందర్నీ ఆకర్షించింది వర్ధని కథనం. కళ్లు వెడల్పు చేసి, చెవులప్పగించి, మంత్రము గ్ధుల్లా పిల్లలంతా కథ విన్నారు. సింహాల రాజునంటూ సింహంనే బురిడీకొట్టించి, దానితో పోటీపడి, దానిలా చెట్టు దూకలేక బడాయి గాడిద కొమ్మమీద పడి అటూ ఇటూ ఊగుతూ పడిన తంటాలకి అందరూ పగలబడి నవ్వారు.

మేడం చెప్పకుండానే అందరూ చప్పట్లు కొట్టారు, సంబరంగా!

వర్ధని సిగ్గుతో తల దించుకుని నేలచూ పులు చూసింది.

మేడం వర్ధనిని తనవైపుకు తిప్పుకొని కళ్ల ల్లోకి చూస్తూ, మృదువుగా నవ్వుతూ అంది, "నేను చెప్పలా! నువ్వు కథ బాగా చెప్పగల వని!"

ఆ కథలపుస్తకం రాసినావిడమీదా, దాన్ని తెచ్చి తనకిచ్చిన ముకుందంమీదా వర్ధనికి తెలియకుండానే అభిమానం పెరిగిపో యింది.

ఆ తరువాత ప్రతి శనివారం మేడం కథ చెప్పడం అయ్యాక వర్ధనిని చెప్పమని పిల్ల లందరూ గొడవ చేసేవారు. వర్ధని శని వారంకోసం కొత్త కొత్త కథలు నేర్చుకోవాల్సి వస్తోంది.

మేడం ఇచ్చే చనువుతో పిల్లలందరికీ ఆవి డంటే భయం పోయి, ఇష్టం మొదల యింది. కొంతమంది పిల్లలు ఆవిడమీద చేతులు వేసి మాట్లాడటం కూడా మొదలె ట్టారు.

వర్ధనికి కూడా ఎంతో ఉత్సాహంగా ఉంటోంది. వర్ధని మేడం చెప్పని కథలు, మేడంలానే చెప్పాలనే ప్రయత్నంలో మునిగి ఉంటోంది ఖాళీ ఉన్నప్పుడల్లా!

★ ★ ★

ఇంటర్వెల్ అవగానే వర్ధని ఎప్పుడూ తను కూర్చొనే చోటికి వెళ్లి కూర్చుంది.

ఆ పక్కనే వున్న పెద్ద చెట్టు దగ్గర పిల్లలు కొందరు కోతికొమ్మచ్చి ఆటలోకి దిగారు. వర్ధని ఉత్సాహంగా వారివంకే చూస్తూ కూర్చుంది.

డాక్టరుగారి అబ్బాయి దొంగ. అందరూ గబగబ చెట్టుమీదికి ఎగబాకారు. కాళ్లు వేలాడేసి, నేలను మునివేళ్లతో తాకుతు న్నారు. చప్పట్లు కొడుతూ, దొంగని వెక్కి రిస్తూ అటూ ఇటూ ఊపిరి తిప్పుకోనీకుండా పరుగులెత్తిస్తున్నారు. నిజం కోతిపిల్లలు గుర్తొచ్చాయి వర్ధనికి.

అసలు డాక్టరుగారి అబ్బాయి అంటేనే అందరికీ వేళాకోళం. అతనికే ఓ చక్కటి పేరుంది. భాస్వంత్! కానీ ఎవరూ అలా పిలవరు. డాక్టరుగారి అబ్బాయి అనే అంటారు.

భాస్వంత్ ఇంటర్వెల్ అవగానే చిరుతిళ్ల దగ్గరికి పరిగెత్తుకొంటూ వస్తాడు. కొనుక్కో వడానికి కాదు. కొనుక్కోవడానికి వచ్చినవా ళ్లకి నీతిసూత్రాలు చెప్పడానికి.

కాయల్ని నీళ్లల్లో కడుక్కొని కానీ తినకూ డదట! తినేముందు చేతులు కడుక్కోవా లిట! ఏ నీళ్లు పడితే ఆ నీళ్లు తాగకూడదట! ఇంటినుంచి కాచి తెచ్చుకోవాలట! ఇలాంటివే ఏవేవో చెపుతూంటాడు. అందరూ అతను




చెప్పినప్పుడు శ్రద్ధగా వింటున్నట్లు చేతులు కట్టుకొని మరీ బుద్ధిమంతుల్లా నిల్చుంటారు. అవతలికి పోగానే నాలుక బయటకు పెట్టి వెక్కిరిస్తారు. భాస్వంత్ మాటలు విన్నామో అంతే సంగతులు! చక్కగా ఇసుకలో ఆడుకోకూడదు. చిరుతిళ్లు తినకూడదు. మరి ఎవరు వింటారు బాబూ అతని మాటలు!

కానీ భాస్వంత్ మాటలు నిజంగానే వినే వాళ్లు కూడా ఉన్నారు! వాళ్ల తరగతిలోనే రవి అనే అబ్బాయి. అతనూ కోతికొమ్మచ్చి ఆడుతున్నాడు. అతను భాస్వంత్ చెప్పినవన్నీ ఎంత బాగా పాటిస్తాడంటే, ఓసారి ఐస్‌ఫ్రూట్ కొనుక్కొని, తినేముందు కడుక్కోవడానికి ప్రయత్నించాడు. ఏమయింది? పుల్ల మిగిలింది! అందరూ పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు! ఒట్టి బడుద్ధాయి! వర్ధని వాళ్లెటుపోతే అటు దృష్టి మళ్లిస్తోంది. హఠాత్తుగా వర్ధని ఓ విషయం పసిగట్టింది. గౌతం చెట్టు వెనకపక్కనుండి పిల్లిలా పైగి ఎగబాకుతున్నాడు.

వర్ధనికి ఏదో అనుమానం వచ్చింది. గౌతంనే గమనించసాగింది. అసలు అందరూ ఇటుపక్కనుంటే తనక్కడేం చేస్తున్నాడు? వర్ధని ఆశ్చర్యంగా అనుకొంది.

వాణి వాళ్ల తరగతి అమ్మాయి చెట్టుమీద నక్కివుంది. కిందకే చూస్తోంది. గౌతం మెల్లిగా ఆమె రెండు జడల్నీ కొమ్మకు ముడేసి, రిబ్బన్ల పైనుంచి బిగించి, చప్పుడు చేయకుండా దిగిపోయాడు.

వర్ధని కంగారుగా లేచి, ఆ అమ్మాయిని హెచ్చరించబోయింది.

ఇంతలో దొంగ అటు రావడంతో, ఆ అమ్మాయి అమాంతం కిందకి దూకింది. జడలముడి కొమ్మకు బిగుసుకోవడంతో ఆ అమ్మాయి బరువుకు జుట్టుకుదుళ్ళు ఊడొచ్చినంత పనయ్యింది. ఆ అమ్మాయి బెంబేలెత్తిపోయి అరుస్తూనే, గబుక్కున చెట్టుకొమ్మను పట్టుకుంది.

భాస్వంత్ గబగబ చెట్టెక్కి ముడి విప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. రవి పరిగెత్తుకుంటూ మేడం గదిలోకి వెళ్లాడు. పిల్లలంతా గాబరాగా అరవడంతో పెద్ద తరగతుల పిల్లలు వచ్చారు. ఆ అమ్మాయి భయంతో గింజుకోవడంతో ముడి ఇంకా గట్టిగా బిగుసుకుంది. ఓ పెద్దమ్మాయి తనని కాళ్ళ దగ్గర పట్టుకొని పైకి ఎత్తింది.

ఇంతలో మేడం, శశిరేఖ టీచర్ పరిగెత్తుకొంటూ వచ్చారు. గబగబ ముడి విప్పి, జడ కుదుళ్ళదగ్గర వదులు చేసారు. ఆ అమ్మాయిని సముదాయించి, తనను తరగతి గదిలోకి పంపారు.

“ఎవరలా కట్టింది? ” మేడం అందర్నీ గద్దించి కోపంగా అడిగింది.

వర్ధని చెప్పడానికి మేడం దగ్గరికి వెళ్ళబోయింది.

ఇంతలో రవి, “గౌతం మేడం, తను ఇందాకే మాతో కచ్చి కొట్టి వెళ్ళాడు. కానీ, ఇందాక... అదుగో ఆ గోడమీద కూర్చుని వున్నాడు” గోడవంక చూపిస్తూ అన్నాడు.

పెద్ద చెట్టు కొమ్మలు గోడదాకా విస్తరించి వున్నాయి.

“నిజమే మేడం, నేను గౌతం చెట్టు మీంచి అటు దూకుతుంటే చూసా” భాస్వంత్ రవికి వత్తాసు పలికాడు.

ఒకరి తరువాత ఒకరు మెల్లిగా అక్కణ్ణించి తప్పుకున్నారు.

వర్ధనికి మేడంకి నిజం తెలిసినందుకు చాలా సంతోషం వేసింది. గౌతం తిక్క కుదురుతుంది. వర్ధనికి గౌతం చేసే అల్లరి పనులన్నీ ఒక్కసారిగా గుర్తొచ్చాయి.

బడిపిల్లల పుస్తకాలను వాళ్ల సంచుల్లోంచి లాక్కుని, వాటిలోని కాగితాల్ని చింపి పడవలు, విమానాలు చేస్తాడు. విమానాలకు చివర చిన్న కొబ్బరి పుల్లను గుచ్చి, వారి మీదికే దాడికి వదులుతాడు. జుయ్... జుయ్...మంటూ అవి ఎగురుకొంటూ వచ్చి ఎవరికో ఒకరికి గుచ్చుకుంటాయి. వాళ్ళు

నొప్పి పుట్టి ఏడవగానే, తను పగలబడి నవ్వుతాడు.

చాక్‌పీస్‌లు పొడి చేసుకొని గుప్పెట్లో పట్టుకుంటాడు. ఎవరైనా తనమాట వినక పోతే గుప్పిటను వారి మొహాన విప్పి, పొడిని కంట్లోకి వూదుతాడు. ఏంచేసినా ఎదుటివారు ఊహించలేనంత వేగంతో చేస్తాడు. లంబాడీలను ముప్పుతిప్పలు పెట్టడం అతని దినచర్యలో ముఖ్యభాగం.

అలాంటప్పుడల్లా వర్ధనికి గౌతం ఎంత గొప్ప వ్యక్తి పేరో, ఆ పేరు పెట్టుకున్నందుకు అతను తోటివారితో ఎంత దయగా వుండాలో చెప్పాలనిపిస్తుంది.

ఎందుకోగానీ సరిగ్గా అప్పుడే తను మరి నాయనమ్మలానే మంచిపేరు తెచ్చుకోగలుగుతుందా అన్న ప్రశ్న మనసులో పుట్టి, ములుకులా గుచ్చుకుంటుంది.

మేడం శశిరేఖతోపాటు వర్ధని పక్కనుంచే నడిచివెళ్తోంది.

"మీరొక్కళ్ళైనా వీడిలా తుంటరి పనులు చేస్తున్నాడని నాకు ఎందుకు చెప్పలేదు శశిరేఖా? " అంటోంది మేడం.

ఆమె కంఠంలోని బాధావీచిక వర్ధని కాళ్ళకు బంధాలు వేసింది. గౌతం గురించి ఏవేవో చెప్పాలనివున్నా గొంతు పెగల్లేదు.

ఆవిడ శశిరేఖ టీచర్‌తో మాట్లాడుతూనే తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ మర్నాడు ఇంటర్వెల్‌లో గౌతం మళ్ళీ రవివాళ్ళదగ్గరికి వచ్చాడు.

రావడం ఆలస్యం రవితో బాహాబాహి ముష్టాముష్టికి దిగాడు. భాస్వంత్ మధ్యలో దూరి, శాంతిసూత్రాలు వల్లిస్తూ అతికష్టం మీద ఇద్దర్నీ విడదీసాడు.

"ఏయ్! నువ్వు మా అమ్మకి నా గురించి ఏం చెప్పావ్? అమ్మ నాతో మాట్లాడనంది తెలుసా" గౌతం ఆయాసం అణుచుకుంటూ అరిచాడు "ఎప్పటికీ"





"మరి నువ్వలా ఎందుకు చేసావ్? నీ జుట్టులాగితే నీకు నొప్పేయదూ? " రవి ఇంకా గట్టిగా అరిచాడు.

వర్ధనికి ఏదో భయం మొదలయ్యింది. ఆ గౌతంతో తలపడితే అంతే సంగతులు! ఆరోజు తను ఏమన్నానని అన్ని తుమ్మెదల రెక్కలు పీకేసాడు? రవిని ఎదురు తిరగొద్దని చెప్పాలి. వర్ధని చటుక్కున కూర్చున్న చోటినుంచి లేచింది.

ఇంతలో గౌతం వేగంగా కిందికి వంగి, రాయినొకదాన్ని అందుకుని, బలంగా రవి మొహాన విసిరాడు. అది సూటిగా వెళ్లి రవి కంటికి తాకింది. కంట్లోంచి రక్తం కారడం మొదలు పెట్టింది.

గౌతం గిర్రున వెనక్కు తిరిగి, పరిగెత్తి వెళ్ళిపోయాడు.

భాస్వంత్ రవిని జాగ్రత్తగా కింద కూర్చో పెట్టాడు. రవి బిత్తరపోయి ఏడుపు లంకించుకున్నాడు. భాస్వంత్ కళ్ళు నులుముకోకుండా రవి చేతులు పట్టుకొని, ఏడవనీయకుండా ఏవేవో మాటలు చెపుతున్నాడు.

మిగిలిన పిల్లలు పరుగుపరుగున వెళ్లి మేడంని, మిగతా టీచర్లని పిలుచుకువచ్చారు. మేడం, టీచర్లు కలిసి అతనిని గబగబ డాక్టరు దగ్గరకు తీసుకెళ్లారు. వాళ్ళు గేటు దాటేంతవరకు పిల్లలందరూ వారి వెనకే వెళ్లారు. భాస్వంత్ రవికి ధైర్యవచనాలు చెప్తూనేవున్నాడు.

ఇన్నాళ్లు పిల్లలందరూ గౌతంని లోలోపలే తిట్టుకునేవారు. ఇప్పుడు గుసగుసలు పోతున్నారు. వర్ధనికెందుకోగానీ రవికి జరిగిన సన్మానం తనకు జరగబోయి తప్పిపోయిందనిపించింది.

మధ్యాహ్నానికి ఓ వార్త పిల్లలకి చేరింది. రవి కన్ను శాశ్వతంగా గుడ్డిదైపోయిందని! విషయం తెలవగానే పిల్లలు, టీచర్లు గౌతంను బాహాటంగా తిట్టడం మొదలెట్టారు. గౌతం చెడ్డపిల్లవాడనీ, పెంకి పిల్లాడనీ, పొగరుమోతనీ... ఇంకా ఇలాంటివే ఏవేవో అంటున్నారు. మొత్తానికి గౌతం

అంటే ఎవరికీ ఇష్టంలేదని, అందరూ అసహ్యించుకుంటారని వర్ధనికి అర్థం అయిపోయింది. వాళ్ళనే మాటల్లో కొన్ని పదాలను లలిత తరచు తనను ఉద్దేశించి అనడం వర్ధనిని ఉలిక్కిపడేట్లు చేసింది. తనంటే కూడా గౌతంలానే అందరికీ అసహ్యమేనా? మొదటిసారిగా అనుకొంది వర్ధని.



ఆ రాత్రి మళ్ళీ ఊరి జ్ఞాపకాలు ఒక్కొక్కటిగా వర్ధనిని చుట్టుముట్టాయి. వాటితో పాటే ఓ చేదునిజం వర్ధనిని ఈర్ష్యాద్వేషాలలో ముంచి కలవరపెడుతోంది. పాప ... పాప... పాప!

వర్ధని ఎప్పటికో ఆ జ్ఞాపకాల్లోంచి బయటపడింది. కలతనిద్రలో హఠాత్తుగా రైలులో పూనకం వచ్చినావిడ భీకరరూపం గుర్తొచ్చింది.

వర్ధని వణుకుతూ లేచి కూర్చుంది. పక్కనే పడుకొని వున్న వాణి నిశ్చింతగా నిద్రపోతోంది. వర్ధని ప్రశాంతంగా వున్న వాణి మొహాన్ని పరిశీలనగా చూసింది.

ఈ వాణి తనెంత విసుక్కున్నా, విదిలించిపడేసినా తన వెనకే తిరుగుతుందెందుకని? తనని ఎవరైనా చిన్నమాట అంటే తనకంత కోపం వస్తుందే! ఈ వాణికి కోపం, రోషం ఏవీలేవా?

వర్ధనికి బళ్ళో మేడం కార్డు ఇచ్చినపుడు వాణి తనని గర్వంగా చూపిస్తూ మా అక్క అని అందరితో చెప్పడం గుర్తొచ్చింది. తనూ అలా చెప్పినందుకు ఎంతో సంతోషపడింది కదూ? అలా చెప్పాలనే ఆశించింది కూడా! కానీ తనని వాణి అక్కా అని పిలిస్తే తనకెందుకు అంత చిరాకేస్తుంది? తను వీళ్ళెవరికీ సంబంధించిన దానిని కాదనే అని పిస్తుందేం ఎప్పుడూ? వర్ధనికి ఎంతకీ సమాధానాలు దొరకలేదు.

నిద్రలో ఏం కలవచ్చిందో కానీ వాణి మొహాన చిన్న నవ్వొకటి ప్రత్యక్షమైంది. ఎడం చేత్తో ముక్కును బరాబరా గోక్కుంది. వర్ధనికి నవ్వొచ్చింది. నవ్వుతో పాటే ఏదో ధైర్యం కూడా!

వర్ధని నెమ్మదిగా తన చేతిని వాణి చేతి మీద వేసింది.

ఈసారి ఎలాంటి పీడకలలు రాకుండానే వర్ధనికి నిద్రపట్టింది.

★ ★ ★

వర్ధని తెలుగువాచకం మళ్లీ చింపినందుకు లలిత వర్ధనిని ఏమీ అడగలేదు, ఏమీ అనలేదు.

ముకుందం ఊరినుంచి వచ్చాక ఆ కాగితాల కుప్ప తీసికెళ్ళి మౌనంగా అతని ముందు పోసింది. ముకుందం గంభీరంగా తలాడించి వర్ధనిని దగ్గరకి పిలిచాడు.

"పుస్తకం ఎందుకలా చింపావ్?"

వర్ధని మాట్లాడలేదు.

"పుస్తకం చింపేస్తే ఏం చదువుకుంటావ్? ఎలా చదువుకుంటావ్?"

వర్ధని తనని కాదన్నట్టుగా మౌనంగా వుండిపోయింది.

లలిత కోపాన్ని పంటి బిగువున ఆపుకుంటోంది. ముకుందం జేబులోంచి డబ్బులు తీశాడు.

"ఈ పుస్తకం ఎంత ఖరీదో తెలుసా?"

వర్ధని తెలీదన్నట్లు తల అడ్డంగా వూపింది.

"మీ బడి పక్కనే పుస్తకాల షాపు వుందిగా! వెళ్ళి నువ్వే కొనుక్కురా!"

ముకుందం రెండు కాగితాలు తీసి వర్ధని చేతిలో పెట్టాడు.

వర్ధని వాటివంకే కన్నార్పకుండా చూసింది. షాపుకి వెళ్ళి తను ఏ వస్తువు కొని ఎరగదు. ఊళ్ళో కోమిటమ్మ కొట్టు వున్నా ఏమైనా కావలిస్తే బీసితోనో, కురప తోనో తెప్పిస్తుంది పెద్దమ్మ. ఏం అడగాలి? ఎలా కొనాలి? వర్ధని సందేహంలో పడింది.

ఆ వాణే నయ్యం! ఎప్పుడైనా రేక్కాయలు అవీ కొనుక్కుంటుంది. వర్ధని వాణివంక చూసింది. వాణి తన ధ్యాసలో తానుంది.

"రెండోతరగతి తెలుగు పుస్తకం కావాలని అడుగు. వాళ్ళే యిస్తారు. చిల్లర జాగ్రత్తగా తీసుకురా!" వర్ధని సందేహాలు తెలిసినట్టే చెప్పాడు ముకుందం.

వర్ధని ఔనన్నట్టు కాదన్నట్టు అర్థం కాకుండా తలాడించి, డబ్బుల వంక చూస్తూనే తన పుస్తకాల సంచి దగ్గరకి వెళ్ళింది.

వర్ధనిని పోనిచ్చి లలిత ముకుందం మీద విరుచుకుపడింది.

"చిన్నపిల్లకి ఏం తెలుస్తుందని డబ్బు చేతి కిచ్చారు?"

"పుస్తకం విలువ! డబ్బు విలువ!"

"ఆ... అది కొన్నట్టే! మీ జేబులోంచి లోగడ ఓసారి డబ్బు కాజేసిన సంగతి మరి చిపోయారా ఏంటి? ఇప్పుడు తమరే స్వయంగా..."

"లలితా... జరిగిన విషయాన్ని మాటి మాటికి గుర్తుచేసి ఎత్తిపొడవద్దు! చూడు ఏం జరుగుతుందో!"

"ఆ... చూడాల్సిందే! ఇప్పటికే మూడు సార్లు ఆ తెలుగు వాచకం ఆవిడగారు చింపడం నేను తేవడం అయ్యింది!" లలిత విసురుగా అని లోపలికి వెళ్లింది.

వర్ధనికి డబ్బు చేతిలోకి రాగానే కాళ్ళూ చేతులు ఆడలేదు.

తను ఎవరికీ తెలియకుండా బస్సెక్కి ఊరికి వెళ్లిపోతే? ఈ డబ్బులు ఇచ్చేస్తే తనను బస్సెక్కించుకోరూ? వర్ధనికి ఆనాడె ప్పుడో వాణి అన్న మాటలు గుర్తొచ్చాయి. తమ ఊరికి వెళ్ళాలంటే చాలా డబ్బులు కావాలంట. ముకుందం ఇచ్చింది రెండుకాగి తాలే! మరి వీటితో ఊరికి ఎలా వెళ్ళ గలం? ఏమైనా ముందు వీటిని భద్రంచే యాలి! వర్ధని వాటిని జాగ్రత్తగా తీసుకెళ్ళి తన సామాన్యశాస్త్రంలో దాచింది.

వర్ధనికి ఏదో కలవరం మొదలయ్యింది. ఎవరూ తీయకుండా తన సంచిని కాపలా కాసుకుంది. బడికి వెళ్ళేపుడు సంచిని వాణికి ఇవ్వకుండా తనే పట్టుకుంది. భుజానికి సంచి తాడు తగిలించుకొని, సంచిని వళ్ళో పెట్టుక్కూర్చుంది రిక్షాలో. రిక్షా అతను బడి దగ్గర దించేపుడు సంచి అందుకోబోయినా అందివ్వలేదు. తనే స్వయంగా మోసు కొంటూ తరగతి గదిలోకి వెళ్ళింది.

పిల్లలందరూ తన దగ్గరున్న డబ్బును కాజేసే వాళ్ళలాగానే కనిపించారు. వర్ధని కాసేపటికి ఓసారి పుస్తకం తెరిచి, డబ్బుందో లేదో చూసుకుంటోంది. టీచర్ పాఠం చెపుతున్నా, ప్రశ్నలడుగుతున్నా వర్ధని మనసుమాత్రం ఆ కాగితాల చుట్టే తిరుగుతోంది. తను ఇంత భయంభ యంగా ఈ డబ్బును ఎన్నాళ్ళని భద్రంచే యగలదు? ఎవరినైనా భద్రంచేసి పెట్ట మంటే? అమ్మో... వాళ్ళు ఎంచక్కా రేక్కా యలు కొనేసుకోరూ?

ఇంతలో శశిరేఖ టీచర్ గదిలోకి వచ్చింది. రాగానే ఆవిడ వర్ధని పుస్తకం ఇమ్మని అడిగింది. వర్ధని సమాధానమేమీ చెప్పకుండా తెల్లబోయి చూస్తూ నిల్చుంది.

రోజూ ఆవిడ ఎవరో ఒకరి పుస్తకం తీసు కొని పాఠం చెపుతుంది.

దాదాపు పిల్లలందరి పుస్తకాలు నలిగి పోయి, పెన్సిళ్ళతో అడ్డదిడ్డంగా గీతలు గీసేసి వుంటాయి. వర్ధనిది ఎప్పుడూ కొత్త





పుస్తకమే! క్రితంరోజే శశిరేఖటీచర్ వర్ధని పుస్తకం తీసుకొని పాఠం చెప్పింది. చెప్పడం అయ్యాక వర్ధని పుస్తకాన్ని అందరికి చూపిస్తూ "చూసారా, పిల్లలూ! వర్ధని పుస్తకం ఎంత చక్కగా పెట్టుకుందో! మీరు కూడా తనలాగే పుస్తకాల్ని జాగ్రత్తగా వుంచుకోవడం నేర్చుకోవాలి!" అంటూ మెచ్చుకోలుగా అందరిచేతా చప్పట్లు కొట్టించింది.

అప్పుడే తనేమనుకొంది? మిగతా పుస్తకాల సంగతి ఎలా వున్నా తెలుగుపుస్తకంని మాత్రం చక్కగా వుంచుకోవాలనుకోలా? నిన్న సాయంత్రం వాణితో తగువేసుకొని తనే చింపి పోగులు పెట్టింది.

శశిరేఖ టీచర్ వర్ధనిని పుస్తకం మళ్ళీ అడిగింది.

"అదీ... అదీ..." వర్ధని నసిగింది.

"మర్చిపోయి వచ్చావా? పోనీలే! రేపు తప్పక తీసుకురా! గీతా, నీ పుస్తకం ఇలా ఇయ్యమ్మా!" శశిరేఖ టీచర్ గీతని అడిగింది.

గీత పుస్తకం అందివ్వగానే పాఠం మొదలుపెట్టింది.

వర్ధని మనసంతా అదోలా అయిపోయింది. ఛ! తను తెలుగువాచకం చింపకుండా వుండాల్సింది. ఆ గీత చూడు టీచర్ అడగగానే ఎంత గర్వంగా అందిస్తుందో పుస్తకాన్ని! తనే తెచ్చివుంటే టీచర్ మళ్ళీ అందరితో చప్పట్లు కొట్టించి వుండేది కాదూ? వర్ధనికి తనకు పుస్తకం తేనందుకు దిగులేసింది.

ఇంటర్వెల్‌లో వెళ్ళి పుస్తకం కొనుక్కుంటే...? పుస్తకం కొనేస్తే డబ్బులన్నీ అయిపోవూ? మరి ఊరెలా వెళ్లడం వర్ధని కొద్దిసేపు ఎటూ తేల్చుకోలేకపోయింది. పుస్తకం కొనడమా? ఊరెళ్లడమా? అని. ఊరెళ్ళడానికి ఈ డబ్బులు ఎలాగు సరిపోవు. ఇప్పటికి పుస్తకం కొనుక్కుంటే పోలా?

వర్ధని పుస్తకం కొందామని నిశ్చయించుకొన్నాక ఇంటర్వెల్ ఎప్పుడవుతుందోనని ఎదురుచూసింది. బెల్లు మోగగానే సంచి భుజానికి తగిలించుకొని పుస్తకాల షాపు దగ్గరకి వెళ్ళింది.

వర్ధని ఎన్నడూ బలపం ముక్క కూడా కొని ఎరగదు. వాణి చక్కగా లంబాడీలతో బేరం కూడా చేస్తుంది. వర్ధని వాణికోసం చుట్టూచూసింది. వాణి తన స్నేహితులతో కలిసి పొన్నపూలు ఏరుకుంటోంది. వర్ధని వాణిని పిలుద్దామని అటువైపు వెళ్లింది. ముకుందం తననే వెళ్లి కొనుక్కోమన్నాడుగా! వర్ధనికి అహం అడ్డొచ్చింది. తటపటాయిస్తూ అక్కడే నిల్చుని, పుస్తకాల షాపు వైపు దృష్టి సారించింది.

బడిపిల్లలు చాలామంది అక్కడ గుమిగూడి వున్నారు. బవిరిగడ్డం అతనికి డబ్బిస్తున్నారు. కళ్ళద్దాలు పెట్టుకున్నతను, రివటలా వున్నతను పిల్లలకు కావలసినది చకచక అందిస్తున్నారు. వర్ధనికి తమ తరగతి అమ్మాయి కనిపించిందక్కడ. ధైర్యం తెచ్చుకొని అటువైపు వెళ్ళబోయింది.

వాణి పొన్నపూల కాడల్ని బాకాల్లా వూదుతూ వచ్చింది, "ఏంటక్కా అలా నిల్చున్నావ్!" అంటూ.

"నిల్చుంటే నీకెందుకూ?" వర్ధని చిరాగ్గా అడిగింది.

"పొన్నపూలు కావాలా? ఎంత మంచి వాసనో! మా తరగతిలో ఓ అమ్మాయి వీటన్నిటినీ జడలాగా ఎంత చక్కగా అల్లుతుందో తెలుసా!" వాణి వర్ధని చిరాకును పట్టించుకోకుండా హుషారుగా చెపుతోంది.

"అయితే ఏంటట?" వర్ధని విసురుగా అంది.

వాణి ఏదో చెప్పబోయేంతలో ఇంకో అమ్మాయి కేకేసింది. "వాణీ, అదుగో అక్కడ పూలు రాలుతున్నాయి. వచ్చేయి!" వాణి అటు పరుగుదీసింది. పువ్వు రాలడం

ఆలస్యం పిల్లలు పోటీపడి, పరుగులుతీసి అందుకుంటున్నారు.

వర్ధనికి వాణి వెళ్లిపోవడంతో ఎక్కడలేని దిగులేసింది. వాణితో కాస్త నెమ్మదిగా మాట్లాడివుంటే తన సొమ్మేం పోయేది? ఇప్పుడు పుస్తకం ఎలా కొనుక్కోవడం? వర్ధని మళ్లీ షాపువైపు చూసింది. తమ తరగతిలోని అమ్మాయి ఇంకా అక్కడే వుంది. వర్ధని నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ, ఏం అడగాలోనని ఆలోచిస్తూ అక్కడికి వెళ్లింది.

గొంతు సవరించుకొని ఆ అమ్మాయితో మాట్లాడబోయేసరికి గణగణమంటూ గంట మోగింది. పిల్లలంతా లోపలికి పరుగులు పెట్టారు.

వర్ధని కూడా వారితోపాటే పరిగెత్తింది, షాపులో వరుసలుగా అమర్చిన పుస్తకాల వైపు, పలకలవైపు తిరిగితిరిగి చూస్తూ.

తరగతిలో పాఠం జరుగుతున్నా, వర్ధని మనసంతా సామాన్యశాస్త్రంలోని ఆ రెండు కాగితాల మీదేవుంది. సంచి వళ్ళోనే పెట్టుకుని వుంది. ఆ పలుచటి కాగితాలు మోయలేనంత భారంగా అనిపించాయి.

ఇంటి బెల్లు మోగగానే పరిగెత్తుకొని షాపుదగ్గరకి వెళ్ళింది. షాపులో ఉదయం వున్న బవిరిగడ్డం వాడులేడు. వర్ధని పెదాలు తడిచేసుకుంటూ షాపంతా కలియజూసింది. వర్ధని ఎత్తులో అద్దాల బీరువాలున్నాయి. వాటినిండా రంగురంగుల పెన్సిళ్ళు, రబ్బర్లు, కంపాస్‌బాక్స్‌లు చక్కగా అమర్చివున్నాయి.

కళ్ళజోడతను వర్ధనిని చూసి తనవైపు వచ్చాడు. "ఏం కావాలి పాపా?"

అతని కంఠంలోని గరుకుతనానికి వర్ధని వెనుకంజవేసింది. గొంతు పెగల్లేదు. కళ్ళు పెద్దవిచేసి అతనివంకే చూస్తూ వుండిపోయింది.

రివటలా వున్నతను అద్దాల బీరువా మీదుగా వంగి మెల్లిగా అడిగాడు, "ఏం కావాలి పాపా" అని.

వర్ధని తన మొహంలో మొహం పెట్టిన తనివైపు బెదిరినట్లుగా చూస్తూ తడబడుతూ చెప్పింది, "తె... తె... తెలుగువాచకం!"

"ఎన్నో తరగతి?"

వర్ధని రెండు వేళ్ళెత్తి చూపింది.

ఎందుకోగాని కళ్ళజోడతను వెనకనుంచి కిసుక్కున నవ్వాడు. వర్ధని బిక్కచచ్చిపోయింది.

"ఎన్నో తరగతి?" మళ్లీ అడిగాడు రివటలా వున్నతను.

వర్ధని ఈసారి మౌనంగా వుంది. కళ్లజోడతనే చెప్పాడు.

"డబ్బులు తెచ్చావా?" వర్ధని గబగబ తలాడించింది.

పుస్తకంలోంచి ఆ రెండు కాగితాలు తీసి జాగ్రత్తగా అతనికి అందించింది. అతను పుస్తకం అందించి, కొంత చిల్లర ఇచ్చాడు.

ఇంతలో రిక్షాఅతను వర్ధనిని వెతుకుతూ అక్కడికి వచ్చాడు. వర్ధనిని తీసుకొని రిక్షా దగ్గరకి వెళ్ళాడు.

వాణి వర్ధని చేతిలోని చిల్లరచూసి ఆశగా అడిగింది, "రేక్కాయలు కొనుక్కుందామా?"

వర్ధని నోట్లో కూడా నీళ్ళూరాయి. వర్ధని చెవిలో "చిల్లర జాగ్రత్తగా తీసుకురా!" ముకుందం కంఠం ఖంగుమంది.

వర్ధని చిల్లరని జాగ్రత్తగా కొత్తపుస్తకంలో పెట్టుకుంది. వాణి మూతి మూడువంకర్లు తిప్పి, అటువైపు తిరిగి కూర్చుంది. వర్ధని సంచిని తన వళ్లో గట్టిగా పెట్టుక్కూర్చుంది.

వీళ్ల బడినుంచి వెళ్ళేసరికి ముకుందం ఇంటిదగ్గరే వున్నాడు. వెళ్ళగానే వర్ధని పుస్తకంతో పాటు చిల్లర కూడా అందించింది. ముకుందం లెక్కచూసి, వర్ధని భుజాన మెచ్చుకోలుగా తట్టాడు. టేబిల్ మీదున్న పెన్ను తీసుకొని, వర్ధని పేరు రాసాడు. లలితను కేకేసి అట్టవేసి పెట్టమన్నాడు.





వర్ధనికి ముకుందం ఇచ్చిన డబ్బు తిరిగి సరిగ్గా అందించాక ఏదో బరువు తొలగినట్లనిపించింది. మొహం కడుక్కోవడానికి బాత్ రూంలోకి పరిగెత్తింది.

అట్టవేయడానికి పుస్తకం చేతిలోకి తీసుకున్న లలిత ఓ పొలికేక పెట్టింది. పుస్తకంలో దాదాపు పది పేజీలకు పైగా అచ్చు పడిలేదు. తెల్లకాగితాలున్నాయి.

"నేను చెప్తే విన్నారూ? ఆ దొంగవెధవ చిన్నపిల్లని చేసి ఎలా మోసం చేశాడో చూశారా! మీరేమో పేరు కూడా రాసేస్తిరి!' లలిత నిష్ఠూరంగా అంది.

లలిత అరుపుతో వారిదగ్గరకి రాబోయిన వర్ధని అక్కడే ఆగిపోయింది. అపరాధభావనతో అడుగుముందుకు పడలేదు.

"అయినా ఎంత తెలివితక్కువ దానివే! పుస్తకం చూసుకోకుండా తెచ్చుకుంటారా ఎవరైనా? " లలిత వర్ధని మీద విరుచుకుపడింది.

"నాకు రేక్కాయలు కొనీమన్నా కొనీలా? ' ' వాణి ఫిర్యాదు చేసింది.

"పోనీలే లలితా!" ముకుందం సర్దిచెప్పాడు, "వర్ధనీ! రేపు వెళ్లి ఆ షాపు వాడికిది చూపించి మంచి పుస్తకం ఇమ్మని అడుగు. సరేనా!"

వర్ధని గబగబ తలాడించింది. ఆ రాత్రంతా ఆ ఆందోళనతోనే గడిపింది. అంతమంది పిల్లలు కొంటూ వుంటారే ఎవరికీ జరగనిది తనకే ఎందుకు జరిగింది? వర్ధనికి బుర్రబద్దలు కొట్టుకున్నా అర్థంకాలేదు.

మర్నాడు బడిదగ్గర రిక్షా దిగగానే ఆ షాపు దగ్గరకి వెళ్ళింది. బవిరిగడ్డం అతను కూడా వున్నాడు. వర్ధని వస్తున్న ఏడుపును దిగమింగుకొని అడిగింది.

"ఏమండీ... మంచి పుస్తకం ఇవ్వండి" అంటూ పుస్తకం అతని చేతికి అందించింది.

"ఎవరిచ్చారు నీకిది? " వర్ధని రివటలా వున్నతని వైపు చూపించింది.

"అన్ని పుస్తకాలు ఇట్లానే వచ్చాయి! నీ పేరు రాసుకున్నావ్ ఇంకోటి ఎలా ఇవ్వాలి! తీసుకొనే ముందే చూసుకోకూడదూ!" అతను కసిరినట్లుగా అన్నాడు.

పుస్తకం విసిరినట్లుగా వర్ధని చేతిలో పెట్టాడు. వర్ధనికి అంతే వేగంతో అతని మొహాన విసిరికొట్టాలనిపించింది. కానీ ఏమీ చేయలేక వర్ధని గిర్రున వెనక్కు తిరిగి, పరిగెత్తుకొని తన తరగతిగదిలోకి వెళ్లింది. బెంచిమీద తల పెట్టుకొని ఏడ్చేసింది. ఎవరో పిల్లలు వస్తున్నట్లుగా అనిపించడంతో కళ్ళు తుడుచుకొని, సరిగ్గా కూర్చుంది.

ఆ సాయంత్రం ముకుందం వాళ్ళ తరగతిలో ఇంకెవరిదైనా తెలుగు పుస్తకం అడిగి తెమ్మన్నాడు. వర్ధని ఆ విషయంలో తర్కించదలుచుకోలేదు. మర్నాడు నామోషీ వదిలి గీతను బతిమిలాడి గీత పుస్తకం తెచ్చి ముకుందానికి ఇచ్చింది.

పొద్దున్నే నిద్రలేచేసరికి ముకుందం చక్కగా అట్టవేసివున్న కొత్త పుస్తకం వర్ధని చేతికందించాడు. అయోమయంగా చూస్తున్న వర్ధనితో పుస్తకం తెరిచి చూడమన్నాడు.

కొత్త పుస్తకంలోని తెల్లకాగితాలన్నీ చక్కగా రాసి వున్నాయి. కుదురుగా వున్న ఆ అక్షరాల వైపు అయోమయంగా చూసింది. ఏదో అనుమానం వచ్చి, గబగబ గీత పుస్తకం తెచ్చి దానిపక్కనే పెట్టిచూసింది. అవే పదాలు! అవే బొమ్మలు!

వర్ధనికి నోటమాట రాలేదు. నవ్వుతూ వర్ధనినే చూస్తున్న ముకుందంవైపు కన్నెత్తయినా చూడలేదు.

వాణి వర్ధని భుజం మీదనుంచి తొంగి చూసి అరిచింది.

"అబ్బ! ఎంత బాగా రాసావ్ నాన్నా!"

వర్ధని ఆ పుస్తకాలు రెండింటిని జాగ్రత్తగా తీసికెళ్ళి సంచిలో భద్రంగా దాచింది.

ఆ రోజంతా వర్ధని ఆలోచనలు వర్ధనికి తెలీకుండానే ఆ పుస్తకం వైపు మళ్ళాయి.

పెదనాన్న చక్కగా తాళ్లు పేనగలడు. దడి కట్టగలడు. పందిరివేయగలడు. కప్పు పరవగలడు. పాడిపనులు చేయగలడు. పొలం పనులు చేయగలడు. కానీ ఇంత కుదురుగా రాయగలడా? ఇంత వేగంగా రాయగలడా? వర్ధని మనసులో ఓ క్షణం పెదనాన్న మొహంలో నవ్వుతున్న ముకుందం మొహం కనిపించింది. ఈ టక్కరినక్క కొత్తజిత్తుల్లో తను మాయపడి పోవడం లేదుగదా? వర్ధని మనసులోంచి ముకుందం మొహాన్ని గబగబ చెరిపేసుకుంది. పెదనాన్న మళ్ళీ ఆప్యాయంగా నవ్వుతున్నాడు. అదేంటోగానీ, ఆ పుస్తకం చూసి తన తరగతి పిల్లలు ఆశ్చర్యంతో నోరు తెరిచినపుడు, తన టీచర్ మెచ్చుకున్నపుడు మాత్రం వర్ధని గర్వంగా తలెగరేసింది.

★ ★ ★

దాదాపు రెండువారాల తరువాత కన్నుకు దెబ్బతగిలిన అబ్బాయి బడికి వచ్చాడు. అందరూ కుతూహలంగా అతని చుట్టూ చేరారు.

భాస్వంత్, అదే డాక్టరుగారి అబ్బాయి ఇన్నాళ్ళు వర్ణించి చెపుతున్నట్లుగా రవి నల్ల కళ్ళద్దాలు పెట్టుకురాలేదు. పచ్చగుడ్డ కట్టుకురాలేదు. ఎప్పటిలానే వచ్చాడు కంటిదగ్గర మచ్చమాత్రం నల్లగా కనిపిస్తోంది.

భాస్వంత్ వేళ్ళు ముడిచి రవి కళ్లకెదురుగా పెట్టి, ఇవి ఎన్ని? అంటూ పరీక్ష చేశాడు.

రవి టకటక సమాధానాలిచ్చాడు.

అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. రవి అంతకంటే ఆశ్చర్యపోయాడు. ఎందుకని అందరూ తననలా చూస్తున్నారని!

చివరికి భాస్వంతే చెప్పాడు. రవికి కన్ను కనపడదని తామందరికీ తెలిసిపోయిందని! రవి తన కన్ను నిక్షేపంగా వుందనీ, దెబ్బ ఇంకొంచెం లోపలికి తగిలివుంటే అలా జరిగేదని డాక్టరుగారు అన్నారని చెప్పాడు.

అందరికి సంతోషం కలిగింది. ఏదో పెద్ద బరువు తొలగినట్లు అందరూ నిట్టూర్చారు. మళ్ళీ తమ ఆటల్లో పడిపోయారు రవితో సహా!

ప్రార్థనా సమయంలో మేడం రవిని అందరిముందుకు పిలిపించింది. రవికి తప్పిన ప్రమాదం గురించి వివరించింది. ఆ పని ఎవరు చేసారో తన దగ్గరకి రమ్మంది. ఒక్కళ్ళూ కదలలేదు. నోరు మెదపలేదు. అందరూ ఓరకంట గౌతంవైపు చూశారు. వర్ధని కూడా. గౌతం నిర్లక్ష్యంగా తలెగరేసి తనకేం పట్టనట్లు నిల్చున్నాడు.

ఒకటి రెండుసార్లు నెమ్మదిగా పిలిచాక ఆవిడ కోపంగా అరిచినట్లు పిలిచింది, "గౌతం!" అంటూ.

స్కూలు మైదానమంతా ఆ అరుపుతో దద్దరిల్లింది.

గౌతం క్రాపు ఎగరేసుకుంటూ మేడం దగ్గరకి వచ్చి నిల్చుని నిర్లక్ష్యంగా అన్నాడు, "ఏంటీ? "

పిల్లలందరూ ఏం జరగబోతోందోనన్న ఉత్కంఠతో ఊపిరి బిగబెట్టారు.

"నువ్వు రవిని కన్నుమీద రాయితో కొట్టావా? " నెమ్మదిగా అడిగింది మేడం. ఇన్నాళ్ళు కుతకుతలాడుతోన్న అగ్నిపర్వతం పేలడానికి సిద్ధంగా వున్నట్లు తోచింది అందరికీ. వర్ధని కళ్ళు విప్పార్చి జరిగే తతంగాన్ని గమనిస్తోంది.

"హా! అయితే? " గౌతం ఏమాత్రం తొణకకుండా, పెంకిగా అన్నాడు.

"ఎందుకు చేసావీ పని? " గౌతంనే సూటిగా చూస్తూ మేడం పంటి బిగువున అడిగింది.

కారణం ఏమీ లేదన్నట్లు భుజాలెగరేసి, పెదవి విరిచాడు గౌతం.

మేడం గబుక్కున గౌతం చేయిపట్టి తన





ముంగుకు లాగింది. అదేవేగంతో గౌతం నడుముకు వున్న లావాటి తోలుబెల్టును ఒక్క గుంజు గుంజి, గౌతం వంటిమీద దానిని నాట్యం చేయించింది.

గౌతం అరుస్తోన్న అరుపులు ఆ నిశ్శబ్ద ప్రార్థనా సమయంలో ఆ ఉదయాన్నే బెంబేలెత్తించాయి. సదాసౌమ్యమూర్తి అయిన మేడం రౌద్రరూపం వణుకు పుట్టిస్తోంది. టీచర్లు కూడా ఏమీతోచక ఎక్కడి వాళ్లక్కడే నిలబడిపోయారు.

శశిరేఖ టీచర్ మొదట తేరుకొని గబుక్కున మేడంకి అడ్డం పోయింది. మేడం చేతిలో వేగంగా లేచిన బెల్టు ఆవిడ వంటి మీద పడింది. గౌతం గబుక్కున వెళ్ళి ఆవిడను వాటేసుకొని ఏడవడం మొదలెట్టాడు.

"శశిరేఖా, నువ్వు అడ్డులే!" మేడం ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది.

"పోన్లెండి మేడం, ఏదో చిన్నపిల్లాడు! ఇప్పటికే దెబ్బలు బాగా తగిలాయి" శశిరేఖ అంటుండగానే మిగతా స్టాఫు కూడా వచ్చి ఆవిడను శాంతింపచేశారు.

పిల్లలు ఎక్కడి వాళ్లక్కడే ఊపిరి పీల్చడం కూడా మరచినట్లుగా రాతిబొమ్మల్లా నిలబడిపోయారు.

మేడం గొంతు ఖంగుమంది.

"గౌతంని ఈ బడిలోంచి తీసేస్తున్నాను! గౌతంలా ఆగడాలు చేసే ఏ పిల్లవాడికైనా అదే శిక్ష!"

వర్ధనికి ఎందుకో ఆ మాటలు చెళ్ళున తగిలాయి, ఇందాకటి బెల్టు దెబ్బల్లా...

గౌతం ఆ తరువాత ఎవరికీ ఆ బడిలో కనిపించలేదు.

ఎక్కడో దూరాన హాస్టల్లో వుండి చదువుకుంటున్నాడని ఎప్పటికో తెలిసింది వర్ధనికి.

★ ★ ★

తెల్లవారుఝామున లయబద్ధమైన స్వరం వినిపించి లేచి కూర్చుంది వర్ధని. కలో నిజమో అర్థంకాలేదు. చెవులు రిక్కించింది. ముకుందం ఏదో పుస్తకంలోని పద్యాలు గట్టిగా చదువుతున్నాడు.

వర్ధని తనకు తెలియకుండానే ఆ స్వర మాధుర్యానికి ఆకర్షితురాలైంది. ముకుందం కంఠంలో ఏదో మహత్యం వుంది. ఎక్కడెక్కడి వాళ్ళను కట్టిపడేసే శక్తి వుంది.

వర్ధనికి మేడం స్వరం గుర్తువచ్చింది. కోపంగా వున్నపుడు కూడా మేడంది కోమలస్వరమే. ఆ కంఠంలో లాలిత్యం వుంది. ఈ కంఠంలో గాంభీర్యం వుంది. ఆ కంఠంలో లాలన వుంది. ఈ కంఠంలో ఏదో మాయ వుంది.

వర్ధనిని ఇంకా ఆశ్చర్యంలో ముంచేట్టుగా ముకుందం వర్ధని పుస్తకం చదవడం మొదలుపెట్టాడు. వర్ధని పక్కమీదనుంచి కదలకుండా అలాగే వుండి, చెవులు అప్పగించింది.

తను మరలా కథ చెప్పాల్సివచ్చినప్పుడు ముకుందం బాణీని, మేడం బాణీని కలిపి కొత్తరంగులద్ది చెప్పింది. అందరికీ ఎంతో నచ్చింది.

మళ్లీ పరీక్షలు వచ్చేశాయి. పోయినసారి జరిగినదంతా వర్ధనికి ఇప్పుడిప్పుడే జరిగినట్లుగా వుంది. ఈసారి కూడా ప్రార్థనా సమయంలోనే కార్డు అందుకోవాలి. లేకపోతే ఏం గొప్ప? వర్ధని అందుకై గట్టికృషి చేయాలని నిశ్చయించుకుంది.

ఇంతకుముందు కన్నా పాఠాలు పెరిగాయి కూడా వర్ధని తనకైతను బుద్ధిగా పుస్తకాలు ముందేసుకు కూర్చుంది. వాణినిగానీ, లలితనుగానీ దగ్గరకు రానీయలేదు. ఏదో ఒకటి లెమ్మని లలిత దూరాన వుండే వర్ధనిలోని మార్పుకు సంతోషిస్తోంది.

వర్ధని ఈసారి పరీక్షలు తెలిసే బాగా రాసింది.

చూస్తుండగానే పరీక్షలు అయిపోయాయి. సంక్రాంతి సెలవులు వచ్చేశాయి.

వర్ధనికి మునుపటిలా ఊరికి వెళ్లాలన్న ఉత్సాహమూలేదు. ఇక్కడే వుండిపోవాలని



ఊహామాత్రం భావించడం లేదు. వర్ధనిని నీరవత, స్తబ్ధత ఆవహించాయి.

వాణి ఎప్పటిలాగే సందడిచేస్తూ బట్టలు, రిబ్బన్లు, గాజులు కొనుక్కొచ్చింది. వర్ధనిలో ఎప్పటికో ఓ చిన్న ఆశ మొదలయ్యింది. పెదనాన్న, పెద్దమ్మ మళ్లీ తన వారిలా మారిపోయుంటారేమోనని! ఆ చిన్ని ఆశ మెల్లిగా వర్ధనికి తెలియకుండానే తన మన సంతా ఆక్రమించింది. నీరవత మాయ మైంది. స్తబ్ధత పటాపంచలైంది. వర్ధని ఉత్సాహంతో తన కథల పుస్తకాలన్నిటిని కూడా సర్దుకుంది.

ఈసారి నేరుగా ఒకే బస్సులో వూరికి చేరుకున్నారు.

బస్సుదిగాక వర్ధని అందరికన్నా ఒకడుగు వెనకే నడుస్తూ, చుట్టూ చూస్తోంది. వాణి ఓ సంచి భుజాన తగిలించుకొని పడుతూ లేస్తూ ఇంట్లోకి పరుగుతీసింది. లలిత బస్సుదిగి నాలుగడుగులు వేయగానే సరోజ దడిదగ్గరకి వచ్చి సామానందుకొంది.

"వేణు వాళ్లేరి?" లలిత అడిగింది.

"మాస్టూలు చేస్తన్నారత్తయ్యా... పొలాని కెళ్లారు" అంటూనే సరోజ లోపలికి వెళ్లింది.

"ఏమమ్మోయ్... ఇప్పుడేనా రావడం?" పక్కింటి వెంకాయమ్మ పలకరించగానే లలిత అటువైపు వెళ్లింది.

కోటయ్య ఎక్కడినుంచి వచ్చాడోగానీ, గబ గబ వచ్చి వర్ధనిని ఎత్తుకున్నాడు. వర్ధనిని ఆప్యాయంగా పలకరించి, బడి గురించి ఏవేవో ప్రశ్నలడిగాడు.

ఇంతలో జయమ్మ విప్పారిన మొహంతో పరిగెత్తుతున్నట్లుగా వచ్చేసింది,

"ఏంటే అమ్మాయి వస్తున్నట్లు కబురైనా చెయ్యలేదేమే?" అని అంటూ.

జయమ్మ వర్ధని సన్నబడిందని బాధ వ్యక్తం చేస్తూనే, పొడవయిందని సంతోషప డుతూ మెటికలు విరిచింది.

వాళ్లిద్దరి ధోరణి ఎలా వుందంటే కళ్లల్లో వత్తులు వేసుకొని ఎదురుచూడడం అంటారే అచ్చం అలాగే వుంది. నిజంగా వాళ్లు తనకోసం అంతలా ఎదురు చూసివుం టారా? వర్ధని అనుమానంగా పాపకోసం చుట్టూ చూసింది. పాప ఎక్కడా కనబడ లేదు. కనీసం గొంతు కూడా వినబడలేదు. వర్ధనికి పెదనాన్న, పెద్దమ్మలపై తనకున్న విశ్వాసం వమ్ముకానందుకు కొండంత ఉత్సాహం వచ్చేసింది.

వర్ధని ఉల్లాసంగా తన బడి సంగతులు, కొత్త బొమ్మల పుస్తకాల విశేషాలు అన్నీ ఏకబిగిన చెప్పడం మొదలెట్టింది. జయమ్మ, కోటయ్య చెవులప్పగించి వింటున్నారు. ఆశ్చర్యం, ఆనందం కలబోసిన భావమేదో వారి మొహాల్లో కదలాడుతోంది.

వర్ధని ఆనందంతో ఆవరణంతా పరు గులు తీసింది.

జయమ్మతో కలిసి తను పెట్టిన కారబ్బం తులు, చిట్టిచేమంతులు విరగబూసివు న్నాయి. సీతమ్మవారి జడబంతులు గాలికి విలాసంగా వూగిసలాడుతున్నాయి. రంగు రంగుల చిలకముక్కు పూలు వర్ధనిని పల కరిస్తూ కిలాకిలా నవ్వుతున్నాయి. పొగడ చెట్టు వర్ధని ఎత్తు ఎదిగింది.

వర్ధని కోటయ్యని, జయమ్మని చెరో చెయ్యి పట్టుకొని అక్కడికి లాక్కెళ్లింది. ఇద్ద రితో కలిసి మళ్లీ ఇంకోసారి వాటన్నిటినీ చుట్టేసింది.

"పెదనాన్నా, పెద్దమ్మ అన్ని పూలు పూయించిందే?"

"నీకోసమేనే తల్లీ! పండక్కి నువ్వొస్తావనే ఇన్ని పూలు పూయించింది!" జయమ్మ ముసిముసిగా నవ్వుతూ అంది.

వర్ధని కోటయ్యని చావిట్లోకి లాక్కెళ్లింది. కొత్తగా ప్రత్యక్షమైన లేగదూడను చూసి సంబరంతో చప్పట్లు కొట్టింది. దాని వళ్లంతా వున్న పట్టులాంటి జుట్టును ఆప్యా యంగా తడిమింది. కోటయ్య వర్ధనివంకే మురిపెంగా చూస్తున్నాడు.




"పెదనాన్నా... మరి నాకు జున్నేది?" గారాలు పోతూ అడిగింది వర్ధని.

"నీకోసం వుంచాలేవే! పద మరి పెడ తాను" అప్పుడే అక్కడికి వచ్చిన జయమ్మ నవ్వుతూ అంది.

"వస్తాలే వుండు!" అంటూ కోటయ్య వీపు ఎక్కి, మెడను వాటేసుకొని ఊయ్యాల వూగడం మొదలుపెట్టింది.

కోటయ్య, జయమ్మ ముచ్చట్లు మొదలె ట్టారు.

ఇంతలో వాణి చేయిపట్టుకొని, చిరున వ్వులు చిందిస్తూ, గునగునా నడుస్తూ వచ్చింది పాప.

వర్ధని ఉత్సాహం చప్పున చల్లారిపో యింది. మానుతున్నపుండును కెలికినట్ల యింది. కోటయ్య మెడను వదిలి, నెమ్మ దిగా కిందికి దిగింది.

గులుకుగులుకుమంటూ పాప కాలిగజ్జెలు చేస్తోన్న సన్నని ధ్వని వర్ధనికి కర్ణకఠోరంగా అనిపించింది.

వాణి వర్ధని వాళ్ల దగ్గరకి రాగానే పాప, "నామ్మా... నామ్మా" అంటూ జయమ్మని ఎత్తుకోమని చేతులు చాచింది.

"అబ్బ వుండవే.. వర్ధనత్త వచ్చాక నిన్ను ఎత్తుకోనని చెప్పలా?" జయమ్మ ముద్దుగా విసుక్కుంది.

పాప వర్ధనివైపు చూసి సిగ్గుగా నవ్వింది. బుగ్గలు సొట్టలుపడి ముద్దుగా వుంది పాప. వర్ధని మొహం చిట్లించింది.

పాప మళ్లీ జయమ్మవైపు చూసింది. "మా నామ్మా మంచిదంత... నన్ను ఎత్తు కుంతుందంత!" పాప ముద్దుముద్దుగా అంటూనే జయమ్మ చంకెక్కింది.

"తెలివికేం తక్కువలేదుగానీ ముందు నాయనమ్మని సరిగ్గా పిలవడం నేర్చుకోవే!" అంటూ కోటయ్య పాప నెత్తిన ఓ చిన్న మొట్టికాయ వేశాడు.

వాణి, జయమ్మ ముసిముసి నవ్వులు నవ్వారు.

'అంత నవ్వొచ్చే విషయం ఏవుందనీ?' వర్ధని చిరాగ్గా అనుకుంది.

"చూడవే నామ్మా!" పాప ధీర్ఘాలు తీస్తూ, గునుస్తూ అంది.

"పోనీలేవే!" జయమ్మ పాపని సముదా యించింది.

వర్ధనికి వళ్లంతా కారం రాసినట్లనిపిం చింది.

వాణి వర్ధనికి ఎలా మంచి ర్యాంకులు వస్తున్నాయో, మేడం ఎంత బాగా మెచ్చు కుంటుందో కళ్లకు కట్టినట్లుగా వర్ణించి చెపు తోంది. కోటయ్య, జయమ్మ ఆనందంగా వింటున్నారు. పాప కూడా ఏదో అర్థమవు తున్నట్లు దీక్షగా వింటోంది. వర్ధని ఆ విష యాలేవీ తనకి సంబంధించినవి కానట్లు నిర్లిప్తంగా వుండిపోయింది. ఈ వాణికి బడ బడా వాగడం ఒకటి తెలుసు! దసరా సెల వలకి వచ్చినపుడూ ఇలాగే ఈవిడగారు, లలిత చాటభారతం చెప్పారుగా! వీళ్లూ ఇలాగే... ఇంత ఆసక్తితోనే విన్నారుగా!

వాణి చెపుతోందంతా విని కోటయ్య సంతోషంగా అన్నాడు, "నే చెప్పలా! వర్ధన మ్మంటే ఏమనుకున్నావ్? వర్ధనమ్మే! మా అమ్మ మా ముఠా అంతటికి తెలివిగలదని అందరిలో ఎలా పేరు తెచ్చుకుందో, ఈ చిన్ని వర్ధనమ్మ కూడా అంత మంచి పేరే తెచ్చుకోవాలి"

వర్ధని ఆ మాటలు వినిపించుకోకుండా మౌనంగా, వేగంగా అక్కడికి దూరంగా పరి గెత్తింది.

"అప్పుడే ఊరిమీద పెత్తనాలా? నాలుగు మెతుకులు తిని వెళ్లవే!" జయమ్మ వెనక నుంచి అంటోన్న మాటలు గాలివాటున వర్ధని చెవిలోపడి, ఆ గాలిలోనే కలిసిపో యాయి.

వర్ధని పెద్దక్కాయిని పలకరించడానికి నేరుగా వాళ్లింటివైపు వెళ్లింది.

* * *

వర్ధని ఇంట్లోకన్నా చెరువుగట్టుమీదే ఎక్కువ సమయం గడుపుతోంది. తనతో పాటు తన కథల పుస్తకాలు తీసికెళ్లి అక్కడే చదువుకుంటోంది. గులకరాళ్లను నీటిలోకి విసురుతూ, ఆ నీటి వలయాల్లోకి చూస్తూ గడుపుతుంది. ఆశ్చర్యంగా వర్ధని కథల్లోని పాత్రలు అక్కడ ప్రత్యక్షమయ్యి కథ నడిపిస్తుంటాయి.

ఓరోజు వర్ధని దగ్గరకి సరళ వచ్చింది. ఈసారి ఎలాగైనా సరళతో సరిగ్గా మాట్లాడాలని సరళని అల్లంత దూరాన చూడగానే వర్ధని నిశ్చయించుకొంది.

"నీ దగ్గర బోలెడన్ని బొమ్మల పుస్తకాలున్నాయంటగా?" సరళ ఆరా తీసింది. వర్ధని ఔనన్నట్లు తలాడించింది.

"వాణికి ఆ కథలన్నీ చెప్పావటగా? నాకూ చెప్పవా?" సరళ ఆశగా అడిగింది.

వర్ధనికి ఎలాగూ పొద్దుపోవడం లేదు. ఇంట్లో కాలు నిలవడంలేదు.

సరళ మొదట అడగగానే బింకంగా వుండి, బతిమిలాడగా బతిమిలాడగా మూడో సారికి అలాగే చెప్తాను లెమ్మనింది వర్ధని.

సరళ మొహం చాటంతయింది. వర్ధని పక్కనే చతికిలపడింది.

ఆ వాణి ఆ పిల్లరాక్షసితో తిరగడం మొదలెట్టాక కథల ఊసే ఎత్తడం లేదుగా! సరళతో వాణిని జట్టులో చేర్చుకోవద్దని చెప్పేస్తే సరి! వాణి తిక్క కుదురుతుంది. ఇక ఎప్పటికీ నంగినంగి మాటలు చెపుతూ ఆ పాపతో వుండిపోవాల్సిందే!

వర్ధని వెంటనే నిర్ణయానికి వచ్చింది. ముందు తను సరళతో బాగుండాలి!

వర్ధని తనకెంతో ఇష్టమైన సింహం గాడిద కథ చెప్పడం మొదలెట్టింది. కథను సాగదీసి సాగదీసి సగందాకా చెప్పి, మిగిలింది మర్నాడు చెప్తాను పొమ్మంది.

సింహాలకే రాజునని బడాయిలు పోయిన ఆ గాడిదని నిజం సింహం ఏం చేసింది! తినేసిందా? వదిలేసిందా? చెట్టుమీద నుంచి దూకితే ఆ గాడిద కాళ్లు విరక్కుండా ఎలా వున్నాయి? సరళకి ఇలాంటివే వెయ్యిన్నొక్క సందేహాలు పుట్టుకొచ్చాయి. వర్ధని తన ధోరణిలో ఆపి ఆపి ఊరించి ఊరించి నాలుగు రోజులకు సాగదీసి కథ పూర్తి చేసింది.

ఈ లోపల సరళ వర్ధనిని తన ఉయ్యాలమీద ఇష్టమొచ్చినంత సేపు ఊగమని బతిమిలాడి తీసికెళ్లింది. ప్రతిపూటా ఏవేవో తాయిలాలు తెచ్చిస్తోంది. పండక్కి గోరింటాకు తెచ్చిస్తానంది. వర్ధని తానా అనక ముందే తందానా అంటోంది. వర్ధనికి ఈ పద్ధతి సరదాగా వుంది. సరళని ఆటలు పట్టించినా సరళ తేలిగ్గా నవ్వేస్తోంది.

సరళ ఓ రోజు వర్ధని దగ్గరకు వస్తూ వస్తూ, తమింట్లో నిమ్మ చెట్టు కింద రాలిన నిమ్మకాయల్ని ఏరుకొచ్చింది. ఇద్దరూ వాటితో కాసేపు బంతుల్లాగా ఆడుకున్నారు.

వర్ధనికి వాటిని చూడగానే తొనలు వలిస్తే ఎలా వుంటుందన్న ఆలోచన వచ్చింది. రావడం ఆలస్యం కాయలు చేతిలోకి తీసుకొని, చెరోదాని తొక్క వలవడం మొదలెట్టారు. పలుచటి తొక్క వలవడం ఎంత కష్టమో. ఇద్దరు సరదాగా నవ్వుతూ తొనలు వలిచారు. నిమ్మతొనలు చూడగానే నోట్లో నీళ్లూరాయి.

"బత్తాయి కాయల తొనలు తింటారు కానీ ఇవి ఎవరైనా తింటారా?" సరళ వాటి వంక అనుమానంగా చూస్తూ అంది. వర్ధనికీ అలాంటి అనుమానమే ఉంది. పైకి అనలేదు. సందేహిస్తూనే చెరోటి నోట్లో పెట్టుకున్నారు. పుల్లటిపులుపు! పళ్లు పులిసినట్లుగా వున్నా ఇద్దరూ పందేలు వేసుకొని తిన్నారు. సరళ మర్నాడు మరిన్ని కాయలు తెస్తానని తమ యింటికి వెళ్లింది.

వర్ధనికి ఆ రాత్రి అన్నం తినడానికి వీలు కాలేదు. అంగలి, నాలుక పూసినట్లు మంట




పుడుతున్నాయి. పళ్ల సంగతి సరేసరి.

జయమ్మ వర్ధనిని భోజనం చేయమని బతిమిలాడింది. వర్ధని విషయం చెప్పలేదు. మర్నాడు ఆ మర్నాడు కూడా నిమ్మతొనలు తినడానికే నిర్ణయించుకొంది.



వర్ధని నిద్రలేవగానే మరిన్ని నిమ్మతొనల కోసం సరళ దగ్గరకి వెళ్లాలని నిర్ణయించు కుంది.

పళ్లపొడిని అరచేతిలో వేసుకొంది. చూపుడు వేలుకు పళ్లపొడిని అద్దుకొని చక చక పళ్లుతోముతూ నీళ్ల గాబు దాకా వెళ్లింది. నోట్లో నీళ్లు పోసుకొని పుక్కిలిం చింది. నీళ్లతోపాటు ఏదో కిందపడినట్ల యింది.

వర్ధని వంగి పరీక్షగా చూసింది.

తెల్లగా... చిన్నగా...

వర్ధనికి ఏదో అనుమానం వచ్చింది. చుట్టూ చూసింది.

వాణి అటువైపే వస్తోంది.

వర్ధని మళ్లీ ఆ తెల్లటి దానివైపు చూసింది. అప్రయత్నంగా దవడలు వత్తు కుంది. నీళ్లగాబుపైకి వంగి, నోరుతెరిచి నీళ్లల్లో తన ప్రతిబింబం చూసుకుంది.

పళ్లమధ్యలో ఖాళీ... వాణి కిసుక్కున నవ్వింది.

వర్ధని మళ్లీ నీళ్లల్లో నీడను చూసుకుంది. అస్పష్టంగానైనా విషయం అర్థమవుతోంది.

"తొర్రిపళ్ల ముసలమ్మ! తొర్రిపళ్ల ముస లమ్మ!" వాణి చప్పట్లు కొడుతూ వర్ధని చుట్టూ గెంతింది.

వర్ధని ఉక్రోషంతో వాణిని కసురుకోబో యింది. మాట పెగల్లేదు. గాభరాగా అద్దం దగ్గరకి పరుగుతీసింది.

పైపన్ను వూడిపోయింది. పన్ను వూడినచోట ఎర్రగా కనిపిస్తోంది. వర్ధని మెల్లిగా నాలుకతో అద్దింది. చిగురు మెత్తగా తగిలింది. ఇప్పుడేమిటీ చెయ్యడం? ఆందోళన పడింది.

వర్ధని కంగారుగా వంటింట్లోకి పరిగె త్తింది. వాణి వర్ధని వెనకే వచ్చి అందరికీ టాంటాం వేసింది.

"బోసినోరు బామ్మవై పోతావ్‌లే!" మురళి వెక్కిరించాడు. అందరూ నవ్వారు.

వర్ధనికి ఏడుపు ముంచుకొచ్చింది.

తన పళ్లన్నీ వూడిపోతాయా? మళ్లీ వస్తాయో? రావో? ఇంక తనని అందరూ తొర్రిపళ్ల వర్ధని అనే అంటారేమో!

వర్ధని బుంగమూతి పెట్టుకొని అందరి వైపూ చూసింది.

ఎవరి పనుల్లో వారు నిమగ్నమై వున్నారు.

ఎవరూ చిన్నమెత్తు సానుభూతి చూపక పోవడం వర్ధనికి నిరాశ కలిగించింది. తిన్నగా గాబు దగ్గరకి వెళ్లింది. నెమ్మదిగా మోకాళ్లమీద వంగి కూర్చుంది. జాగ్రత్తగా వూడిన పన్నును తీసుకొంది. రెండు వేళ్లతో ఎత్తిపట్టుకొని, అటుఇటు పరీక్షించింది.

చిన్నగా, తెల్లగా, ముద్దుగా వుంది. మళ్లీ ఇలాంటిదే వస్తుందో రాదో?

వర్ధని వూడిన పన్నును గుప్పిట్లో పెట్టు కొని సరళ దగ్గరకి పరుగుతీసింది.

సరళ జమ్మిచెట్టుకిందే ఆడుకుంటోంది. వర్ధనిని చూడగానే విప్పారిన మొహంతో ఎదురొచ్చింది. వర్ధనిని చెట్టు దగ్గరే వుండ మని, సరళ ఇంట్లోకి పరుగుతీసింది.

వర్ధని గోలలో వర్ధని వుంది. దిగాలుగా

ఓ రాయిమీద కూర్చుంది.

సరళ వెళ్లినంత వేగంగా తిరిగి వచ్చింది. రెండు గుప్పెళ్లతో కారపు శనగలు, బఠా ణీలు పట్టుకొచ్చింది. రెండింటిని కలబోసి వర్ధని వళ్లో పోసింది.

వర్ధని పలకరించబోయే లోపలే మళ్లీ ఇంట్లోకి పరిగెత్తుకెళ్లింది సరళ.

వగర్చుకుంటూ వచ్చి వర్ధని పక్కన కూర్చుంది. ఈసారి తెచ్చిన పటిక బెల్లం ముక్కల్ని వర్ధనికి ఒకటిచ్చి తనొకటి తీసు కుంది.

సరళ వాలకానికి వర్ధనికి నవ్వొచ్చింది. ఫక్కుమంది.

"అరె వర్ధనీ... నీ పన్నేది? " సరళ ఆశ్చ ర్యంగా అంది.

"వూడిపోయింది" వర్ధని వూడిపోయిన గొంతుతో అంది.

సరళ సానుభూతిగా అలాగా అన్నట్లు తలాడించింది.

"సరళా... మళ్లీ వస్తుందా? " వర్ధని బేలగా అడిగింది.

"ఓ!" సరళ తలాడించింది. కాసేపాగి మళ్లీ అంది, "మరి ఆ పన్నును ఏం చేశావ్? "

"ఇదుగో" వర్ధని గుప్పిట తెరిచి వూడిపో యిన పన్నును చూపించింది.

సరళ పరీక్షగా చూసి అంది, "ఈ పన్నుని బంగారుపన్ను చేసేయనా? "

"ఎలా? " వర్ధని ఆశ్చర్యంగా అడిగింది

"నీ పన్ను ఇలా ఇవ్వు. ఏం చేయాలో చెప్తాగానీ!"

వర్ధని మౌనంగా పన్నును సరళ చేతిలో పెట్టింది.

సరళ వర్ధనిని తిన్నగా చావిట్లోకి తీసుకె ళ్లింది. పన్నును పేడలో గుచ్చింది. పేడ మీద గడ్డి కప్పెట్టింది.

"ఇక నీ పన్ను బంగారు పన్నై పోతుంది!" సరళ హామీ ఇచ్చింది.

"నిజం!" వర్ధని కళ్లు విప్పార్చి అంది.

"ఆ మా తాతయ్య చెప్పాడు. ఆయన నోట్లో బంగారు పన్ను కూడా ఇలానే అయిందట. రేప్పొద్దున వచ్చి మళ్లీ చూద్దాం. పదపద" సరళ హడావుడి చేసింది.

వర్ధని వెనక్కి తిరిగి చూస్తూ, సరళను అనుసరించింది.

పటికబెల్లం ముక్కలు చప్పరిస్తూ, మెల్లిగా నడుస్తూ చెరువుగట్టుదాకా వెళ్లారు ఇద్దరూ.

సరళ బతిమిలాడుతున్నట్లుగా అంది, "వర్ధనీ... వర్ధనీ... నీ కథల పుస్తకం నాకొ కసారి చూపించవా? రంగు రంగుల బొమ్మలు ఓసారి చూస్తాను... వర్ధనీ వర్ధనీ!" ఆశగా తనవంక చూస్తోన్న సర ళను చూసి వర్ధని చప్పున వప్పేసుకొంది. ఇద్దరూ చకచక తినేసి వర్ధని వాళ్లింటికి పరుగుతీశారు.

ఇంటదడ దగ్గరకి రాగానే ఇద్దరూ ఆగారు. వర్ధని సరళను అక్కడే వుండమని నెమ్మదిగా ఇంట్లోకి వెళ్లింది.

సరోజ పందిరి గట్టుమీద కూర్చుని బియ్యం ఏరుతోంది.

జయమ్మ చిక్కుళ్లు గిల్లుతోంది.

వర్ధని ఒక్క పరుగున గదిలోకి వెళ్లింది. వెళ్లింది వెళ్లినట్లే కీచుమని ఓ కేకేసింది. వర్ధని కథల పుస్తకాలన్నీ చిందరవందరగా పడివున్నాయి. పాప ఓ నలిగిపోయిన పుస్త కంమీద కూర్చుని వుంది. ఇంకో పుస్తకాన్ని తీరిగ్గా చింపుతూ కాగితం చిరుగుతోన్న శబ్దానికి ఆనందిస్తోంది.

వర్ధని అరిచిన అరుపుతో ఉలిక్కిపడి చేతిలో కాగితాల్ని పాప వదిలేసింది. పాప వర్ధనివంక చూసి చిరునవ్వు నవ్వింది. మళ్లీ వంగి ఇంకో కాగితం చింపి వర్ధని వైపుచూ సింది.






వర్ధని ఒక్క వుదుటున పాప దగ్గరకి వెళ్లింది. పాప జబ్బ పట్టుకొని పుస్తకాల మీద నుంచి బరబరా పక్కకు లాగింది. పాపను వంగదీసి దభీదభీ గుద్దింది. పాప ఆరున్నొక్కరాగం ఎత్తింది. వర్ధని శివాలెత్తినట్లు పాపను కొడుతూనే వుంది.

ఇంతలో వర్ధని చెంపమీద పడ్డ దెబ్బ వర్ధనిని ఈ లోకంలో పడేసింది.

"నీకేవయినా పిచ్చెక్కిందంటే!" అంటూ జయమ్మ వర్ధని ఆ చెంపా ఈ చెంపా వాయించేసింది. వర్ధని చెవి మెలిపెట్టి పందిట్లోకి లాక్కెళ్లింది.

సరోజ గబుక్కున పాపను ఎత్తుకొని సముదాయించడానికి తీసికెళ్లింది.

వర్ధని జయమ్మ చేతివాటం ఎరుగదు. దెబ్బకు మొదలు నరికిన చెట్టులా కూలబడింది. వర్ధని కిమ్మనకుండా వాల్చివున్న మంచం మీద కూర్చుంది.

ఎందుకోగానీ వర్ధని కళ్లముందు మేడం చేతిలో దెబ్బలు తింటోన్న గౌతం మెదిలాడు. వర్ధని ఆ మంచంమీదే ముడుచుకొని నిద్రపోయింది.

వర్ధనికి ఏవేవో కలలొస్తున్నాయి.

తెగిపోయిన తుమ్మెద రెక్కలు, కదలకపడివున్న కోడి పిల్లలు, రైల్లో పూనకం వచ్చి

నామె... వాణి... పాప... లలిత... జయమ్మ... ఒక చిత్రంలోంచి ఒక చిత్రం.

వర్ధని ఉలిక్కిపడి లేచి కూర్చుంది. చుట్టూ చూసింది.

వర్ధని పక్కనేవున్న మంచంమీద వాణి, పాప పడుకొని వున్నారు.

మంచు తెరల చాటున తారలు మిణుక్కుమిణుక్కు మంటున్నాయి.

తెరలను తొలగించుకొని జాబిల్లి అప్పుడప్పుడూ తొంగి చూస్తోంది. వర్ధని మెల్లిగా లేచి, ముంగిట్లోకి వెళ్లింది.

మసక వెన్నెల్లో ముద్దబంతులు ముగ్ధమనోహరంగా నవ్వుతున్నాయి. మంచుతో తడిసి బరువెక్కిన పూలు తలలు వాల్చి వున్నాయి.

జయమ్మకు అవి ప్రాణంలో ప్రాణం.

వర్ధని ఆ మొక్కల వరుసముందు నిలబడింది.

పూలను తాకి చూసింది. చల్లగా, మెత్తగా తగిలాయవి.

పూలను తాకిన క్షణంలోనే వర్ధనికి ఏం అయిందో ఏమోకానీ పూలను అందిన వాటిని అందినట్లుగా పీకి కింద పడేసింది. పూలమొక్కలన్నిటిని అడ్డదిడ్డంగా తొక్కుతూ ఆకుల్ని మొదలంటా చెరిగేసింది. కాసేపటికే పూల మొక్కలన్నీ బోసిగా కాండాలతో నిలబడి పోయాయి.

వర్ధని కిందపడిన పూలను, ఆకులను చిందరవందర చేసి కసాపిసా తొక్కింది. గంతులేసింది. రొప్పుతూ రోజుతూ కారబ్బంతుల్ని, చేమంతుల్ని నేలరాసింది. కొన్నింటిని మొదలంటా పీకి పడేసింది. అక్కడక్కడా మిగిలిన పూలను కసుక్కున తెంపి రెక్కలు ఛిన్నాభిన్నం చేసింది.

మంచు కురుస్తున్నా వర్ధని మొహాన చెమట బిందువులు ప్రత్యక్షమయ్యాయి. ఆవేశం తగ్గాక, వూపిరి పీల్చుకొని, గౌనుతో చెమట తుడుచుకుంది. మెల్లిగా వచ్చి తన మంచంలో ఎప్పటిలా పడుకొంది.

ఉద్రేకం తగ్గాక కళ్లు తెరిచి చుట్టూ చూసింది. వాణి మెడచుట్టూ చేయివేసి పాప నిశ్చింతగా నిద్రపోతోంది. నిద్రలోనే వాణి పాప చేతిని పక్కకి తీసేసి, ఇంకోవైపు తిరిగి పడుకుంది.

వర్ధని మంచంమీద నుంచి దిగ్గున లేచి నిల్చుంది. కళ్లు చికిలించింది. ఊపిరి బలంగా పీల్చి వదిలింది. నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ పాప మంచం దగ్గరకి వచ్చి నిల్చుంది. నిద్రలో ఏం కల వచ్చిందో ఏమో పాప మొహాన చిరునవ్వు కదలాడింది. వర్ధని అప్రయత్నంగా పిడికిళ్లు బిగించింది. పాప వంక తీక్షణంగా చూసింది. గుండెల నిండా ఊపిరి పీల్చుకుంది. ఒక్కసారిగా మంచం మీదకు వంగి, పాపను రెండు చేతులతో బలంగా పట్టుకొని మంచంమీద నుంచి అమాంతం కిందకు తోసేసింది.

ఇన్నాళ్ల కోపం, కసి, అసూయ, ద్వేషం అన్నీ ఆ ఒక్క తోపులోనే చూపించింది. బుసలు కొడుతూ, పళ్లు పటపట కొరుకుతూ, ఉద్రేకంతో వూగిపోతూ పాపమీదకు ఒక్కసారిగా లంఘించబోయింది.

ఇంతలో పాప కెవ్వుమని అరిచిన అరుపు, దబదబమని పాదాల చప్పుడు వర్ధని చెవులను ఒకేసారి చేరాయి.

వర్ధని ఆవేశం చప్పున చల్లారిపోయింది. బుర్ర తిరిగి వచ్చింది. అరచేతులు చెమట్లు పట్టాయి. వెనక్కు తిరిగి ఒక్క పరుగున దడి దగ్గరకు వెళ్లింది. నెమ్మదిగా దడికి వున్న తాటాకు తడికను నెట్టుకొని.. చీకట్లోకి రివ్వున పరుగుతీసింది, తిన్నగా రోడ్డు మీదికి!

ఏదో వాహనం లైట్ల శక్తివంతమైన వెలుతురు వర్ధని కళ్లమీద పడి, కాళ్లకు బంధాలు వేసింది.

వర్ధని గబుక్కున కళ్లకు చేయి అడ్డం పెట్టుకుంది.




వర్ధనికి ఏం చేయాలో తోచక రోడ్డుమీదే నిల్చుండి, కంగారుగా అటూ ఇటూ కదులు తోంది. భయంతో కళ్లు గట్టిగా మూసు కుంది. తన మీదకు వేగంగా దూసుకువ స్తోన్న ఆ వాహనం దగ్గరవుతోన్న కొద్దీ వర్ధని గుండె గొంతులో కొట్టుకుంటోంది. అది కిర్రున శబ్దం చేస్తూ వర్ధనికి నాలుగ డుగుల దూరంలో ఒక్క కుదుపుతో ఆగింది.

ఆ శబ్దానికి వర్ధని కళ్లు తెరచి చూసింది. విపరీతమైన వెలుగు కళ్లల్లోకి సూటిగా గుచ్చుకుంటోంది.

ఆ వాహనంలోంచి ఎవరో దిగి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వర్ధనివైపే వస్తున్నారు.

వర్ధని బుర్రలోకి ఒక్కసారిగా ఏవేవో ఆలోచనలు వచ్చేశాయి.

చీపురు పుచ్చుకున్న చింపిరి జుట్టమ్మాయి వర్ధని కళ్లముందు మెరుపులా మెరిసి మాయమైంది.

వర్ధని ప్రాణాలు పైనే పోయాయి. వర్ధని 'పెదనాన్నా' అంటూ సహాయం కోసం వేయబోయిన కేక వర్ధని గొంతులోనే వుండిపోయింది.

ఆ వ్యక్తి వర్ధని దగ్గరకి వచ్చేశాడు.

వర్ధని గిర్రున వెనక్కు తిరిగి, వచ్చినంత వేగంతో ఇంటివైపు దూసుకుపోయింది.

ఆ వ్యక్తి కూడా వర్ధనిని అదే వేగంతో వెంబడించాడు.

తన వెనకే బరువుగా పడుతోన్న అతని అడుగుల శబ్దానికి వర్ధనికి కాళ్లు చచ్చుబడి పోతున్నట్లుగా వుంది. వంట్లోని బలా న్నంతా కూడదీసికొని పంటిబిగువున పరిగె త్తడం మొదలెట్టింది. ఆ వెనకే అతనూ!

"వర్ధని ఎందుకిలా చేసింది?" ముకుందం గొంతు ఖంగుమంది. ముకుందం కంఠంలో తొణికిన తీవ్రతకు అందరూ తెల్లబోయారు. ఎలాంటి సమస్య నైనా పరిష్కరించే సమయంలో ఏమాత్రం చలించకపోవడమే ముకుందం ప్రత్యేకత. కానీ ఈ రోజు అతనిలోని ఆందోళన మొహంలోనూ, కంఠంలోనూ కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

"వళ్లు కొవ్వెక్కి!" సరోజ నోట్లోనే గొణు క్కుంది.

"చిట్టితల్లికి ఏ పాడుగాలి సోకిందో!" జయమ్మ ముక్కు ఎగబీల్చి, కళ్లు అద్దు కుంది.

"నేనసలు వర్ధనమ్మ పడుకొనేదాకా అక్కడే వున్నాను... ఎప్పుడు లేచిందో ఏమో!" కోటయ్య వణుకుతోన్న గొంతుతో అన్నాడు.

లలిత తనవల్ల ఏదో తప్పు జరిగినట్లుగా దోషిలా తల వంచుకొని కూర్చుని వుంది. తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు ఆమె ముఖకవళి కలు చెప్పకనే చెపుతున్నాయి.

"అసలు వర్ధనమ్మనే విషయమేంటో కను క్కుంటే?" వేణు నెమ్మదిగా అడిగాడు.

"అక్కడ కనుక్కునేది ఏముంది? నాలుగు వాయిస్తే తనే చెపుతుంది! దానికి ఇంత ఆలోచన అనవసరం!" మురళి సమ స్యను తేల్చిపారేస్తూ అన్నాడు.

"పదిమంది పిల్లల్ని కని పెంచావ్ కదూ! భలే చెపుతున్నావ్!" వేణు వ్యంగ్యంగా అన్నాడు. మురళి కోపంగా తల తిప్పుకు న్నాడు.

"అయినా ఇప్పుడు మనం తెలుసుకోవా ల్సింది వర్ధని అర్ధరాత్రి సమయంలో నడిరో డ్డుమీద అలాంటి స్థితిలో ఎందుకుంది అని! నేనే ఆపకపోతే ఏమయివుండేది?" ముకుందం అందరివంకా ప్రశ్నార్థకంగా చూశాడు.

కోటయ్య, జయమ్మలలోని అలజడి వంట్లో వణుకులా ప్రారంభమైంది. లలితకి ఆలోచించడానికేం మిగల్లేదు.

"ఎంత గండం తప్పింది! బంగారంలాంటి బిడ్డ..." ఏదో అనబోయిన జయమ్మ గొంతు ఆ పైన పెగల్లేదు.

కోటయ్య పెదవి బిగించి, గంభీరంగా కూర్చుని వున్నాడు.

ముకుందం ఎవరైనా మాట్లాడతారేమోనని అందరివైపూ చూశాడు. అందరూ మౌనంగా వున్నారు.

"అసలు మహబూబ్‌నగర్ వెళ్లినప్పటి నుంచే వర్ధని ప్రవర్తన మారింది. ఏదో మీమీద దిగులులే బడికివెళ్తే తనే మాయపడిపోతుందనుకొన్నాను. వర్ధని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుండడం నేనూ గమనించాను. పరధ్యానంగా వుంటోందని అనుకున్నానేగానీ ఇంత అర్థంకాని విషయంలా తయారవుతుందనే నేను ఊహించలా!" ముకుందం మొట్టమొదటసారిగా సంజాయిషీ చెపుతున్నట్లుగా అన్నాడు.

అందరూ ఆశ్చర్యంగా ముకుందం వంక చూశారు.

ముకుందం కోటయ్యవంక చూసి, తల దించుకున్నాడు.

అక్కడే మంచంమీద పడుకొనివున్న వర్ధని కొద్దిగా కదిలింది. అందరూ ఆత్రుతగా వర్ధనివైపు చూశారు. వర్ధని కళ్ళు తెరిచి చుట్టూచూసింది. అందరూ వర్ధని మొహంలోకే గుచ్చిగుచ్చి చూస్తున్నారు. కోటయ్య, జయమ్మ ఆందోళనగా చూస్తుంటే, ముకుందం గంభీరంగా చూస్తున్నాడు. లలిత నీరసంగా చూస్తోంది. వర్ధని చిట్టి బుర్రలో రాత్రి జరిగిన సంఘటన మెదిలింది.

అంతే! వర్ధని దిగ్గున లేచి కూర్చుంది. పాపకి ఏమయింది? అందరూ అంత గంభీరంగా ఎందుకున్నారు? వర్ధని భయం భయంగా అందరివంకా చూసింది.

జయమ్మ వర్ధని దగ్గరికి వచ్చింది. ఓ చేత్తో నెమ్మదిగా వీపు నిమురుతూ మరో చేత్తో జుట్టు సవరించింది. వర్ధనికి అయోమయంగానూ, ఏదో అనుమానంగానూ వుంది. వర్ధని ఆలోచనలు సాగడంలేదు.

జయమ్మ వర్ధనిని బుజ్జగిస్తూ మెల్లిగా అడిగింది, "ఏమ్మా... రాత్రెందుకు అట్టా చేసా?"

వర్ధని గుండుదెబ్బ తగిలినట్లు విలవిలలాడిపోయింది. అయిపోయింది. అంతా అయిపోయింది! పెద్దమ్మా పెదనాన్నలమీద ఏ మూలో వున్న ఆశక్కూడా అవకాశం లేకుండా పోయింది! పాపకి ఏదో ప్రమాదం జరగకపోతే అందరూ ఎందుకిలా వుంటారు? వర్ధని కళ్ళముందు తల పగిలి రక్తపుమడుగులో గిలగిలలాడుతోన్న పాప కదిలింది. పాప తనను ఈ విధంగా సాధిస్తోందా? ఎప్పుడైనా అందరూ ఇలా కూర్చున్నారంటే ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోవడానికే కదా? అంటే... ఇప్పుడు తనను మేడం గౌతంని పంపినట్లుగా ఎన్నటికీ తిరిగిరాని చోటుకి పంపేస్తారా? పాప తిక్కయితే కుదిరింది! కానీ... పాప లేకపోయినా వీళ్లెవరూ మామూలుగా... తను ఇంతకుముందు సంతోషంగా వున్నపుడు ఎలా వుండేవారో అలా... మారిపోలేదా? మారిపోరా? ఆ పిల్లపిశాచి ఇంకా తనను పట్టిపీడిస్తుందా? ఎప్పటికీ?

వేణు లేచి వచ్చి వర్ధని ఎదురుగా నిల్చున్నాడు. వర్ధని నిలువుగుడ్లేసుకొని వేణు మొహంలోకి విచిత్రంగా చూసింది. వర్ధని భుజాలమీద చేతులేసి, సౌమ్యంగా మళ్ళీ జయమ్మ అడిగినట్లే అడిగాడు వేణు. వర్ధని బిక్కమొహం పెట్టింది. ఆ తరువాత కోటయ్య వచ్చి బతిమిలాడాడు.

వర్ధనికి ఒక్కొక్క విషయమే గుర్తొచ్చి అలజడి రేపుతున్నాయి. వర్ధని తల పేలిపోతున్నట్లుగా వుంది. అందరి కళ్ళల్లోని ఆందోళన వర్ధనిని కలవరపెడుతోంది.

కోటయ్య వర్ధనిని వళ్ళోకి తీసుకొని, నెమ్మదిగా అన్నాడు, "వర్ధనమ్మా... నా బంగారు తల్లివి కదూ! ఎందుకమ్మా అలా చేశావ్? వీళ్ళెవరికీ చెప్పమాక! నాకే చెప్పు... సరేనా? నిన్ను వీళ్ళెవరైనా ఏమైనా అని




వుంటే వాళ్ళ సంగతి నేను చూసుకుంటాగా! నిన్ను వీళ్ళెవరూ కోప్పడరు! సరేనా? నా చెవిలో మెల్లిగా చెప్పు! నా బుజ్జితల్లివి కదూ?" కోటయ్య బతిమిలాడుతూనే వున్నాడు.

ఆ తరువాత జయమ్మ... వేణు కూడా బతిమిలాడారు.

వర్ధనికి మెల్లిమెల్లిగా నమ్మకం కుదిరింది. తలెత్తకుండానే మిగిలినవారి మొహాలు ఎలా వుంటాయో వూహించుకుంటోంది. ముకుందం మొహంలో ముడిపడ్డ నొసలు, లలిత మొహంలో కోపం, మురళి మొహానవిసుగు, సరోజ మొహంలో వెక్కిరింపూ... ద్వేషం...

వర్ధనికి తనవారనుకున్న వారి స్పర్శ ఎంతో స్వాంతన చేకూరుస్తోంది. ఆ సాన్నిహిత్యం నెమ్మదిగా తనలో ధైర్యాన్ని నింపుతోంది. నిజంగానే వీళ్ళు తనను ఏమీ అనరా? నూటికి నూరుపాళ్ళు అనకపోవచ్చు ఎందుకంటే వీళ్ళకి ఇపుడు పాప లేదుగా? తనే గతి! తప్పక తనేం చెప్పినా వింటారు! లేకపోతే తను వీళ్ళందర్నీ వదిలేసి వెళ్ళిపోతుందంతే! వదిలేయడం అంటే వదిలేయడం కాదు. వుత్తుత్తినే! అలా అని బెదిరిస్తుంది. అపుడు ఈ వంకాయ్ వదిన్ని, మురళన్నాయినీ, లలితనీ, వాణినీ... అహా... వాణి వద్దులే... అదొక పిచ్చి మొద్దు! మిగిలిన వాళ్ళందర్నీ ఓ ఆట ఆడించాలి! వర్ధని మనసులో విజయోత్సాహం చిందులు తొక్కుతోంది. వర్ధని తన మనసులోని భావాలను బయటపడనీయకుండా-గర్వంగా కనుబొమలెత్తి సరోజవైపు నిర్లక్ష్యంగా చూసింది.

సరిగ్గా అప్పుడే సరోజ తన వళ్ళోని పాప నిద్రలో కదలడంతో జోకొట్టి పడుకోబెడుతోంది!

వర్ధని విజయసౌధం రూపుదిద్దుకోక ముందే కుప్పకూలిపోయింది.

పాపకేం కాలేదా? నిక్షేపంగా వుందా? మరి... మరి... వీళ్ళంతా ఎందుకిలా వున్నారు? ఇపుడు ఏం చేయబోతున్నారు? తనను కూడా గౌతం లాగే...?

అంతే- వర్ధని ఒక్కసారిగా అందర్నీ విదిల్చుకొని లేచి నుల్చుంది. కోపంతో పూనకం వచ్చిన దానిలా ఊగిపోతూ బిగ్గరగా అరిచింది.

"నాకు ఆ పిల్ల రాక్షసంటేనే ఇష్టం లేదు! అందుకే దాన్ని చంపేద్దామనే మంచంమీద నుంచి తోసేసాను!

మరి ఇది చావలేదేం? చస్తే పీడాపోయేది! నాకు అదంటేనే అసహ్యం అసహ్యం!!

అందరూ దిమ్మెరపోయి, ఎక్కడివాళ్ళక్కడ లేచి నిల్చున్నారు.

సరోజ గబుక్కున పాపను గుండెలకు హత్తుకుంది. వర్ధనివైపు భయంభయంగా చూసింది.

వర్ధని పిచ్చిపట్టినట్లుగా అరుస్తూనే వుంది.

"అనండి! అందరూ నన్నే చెడ్డపిల్ల అని అనండి! గౌతంలా దూరంగా పంపేయండి నేనంటే మీకెవరికీ ఇష్టంలేదు! అందరికీ కోపమే! ఆఖరికి... ఆఖరికి... పెద్దమ్మకూ... పెదనాన్నకు కూడా ఆ భూతమే కావాలి! నేనెవరికీ అక్కర్లేదు! మీరంతా అబద్ధాలకోరులు! అందరూ... అందరూ... అబద్ధాలే చెపుతారు! మీరెవ్వరితో నేనిక మాట్లాడను పోండి! మాట్లాడనంటే మాట్లాడను! అందరూ ఆ భూతంతోనే హాయిగా వుండండి! నాతో మాట్లాడమాకండి! నాకు మీరెవ్వరంటేనూ ఇష్టం లేదు! లేనేలేదు! నేనేకాదు... మీరంతా చెడ్డవాళ్ళే" వర్ధని గిర్రున వెనక్కు తిరిగి బయటకు పరిగెత్తింది.

ముందు ముకుందమే తేరుకొని- వేణుని వర్ధని వెనకే వెళ్ళమని సైగచేశాడు. వేణు వేగంగా బయటకు వెళ్ళాడు.

లలిత మొహంలోనూ, కోటయ్య, జయ

మ్మల మొహాలలోనూ రక్తమంతా ఒక్కసారిగా ఇంకిపోయినట్లుగా తెల్లగా పాలిపోయి వున్నాయి.

సరోజ తేరుకొని, గుండెలమీద అరచేత్తో కొట్టుకొంటూ కళ్ళు పెద్దవి చేసి అంది.

"హమ్మో! ఎంత నంగనాచి! రాత్రి పాప నిద్రలో మంచంమీదనుంచి దొర్లిందనుకొన్నానే కానీ... హమ్మో! వర్ధని అమాయకంగా కనిపిస్తుంది కానీ ఎంత కుళ్ళు పెట్టుకునుందీమనసులో!" పాపను భుజాన వేసుకొని గబగబ లోపలికి వెళ్ళింది.

మురళికూడా తప్పంతా మీదేనన్నట్లు కోటయ్యవంకా జయమ్మ వంకా మిర్రిమిర్రి చూసి విసురుగా బయటకు వెళ్ళాడు.

లలిత తలను పాతాళంలో పాతేసినట్లుగా వంచేసింది.

ఎవరిమట్టుకు వాళ్ళ దోషమంతా తమదేనన్నట్లుగా వున్నారు. ముకుందం ఏదో నిర్ణయానికి వచ్చినట్లుగా ఆలోచనలను ఆపి, కోటయ్య దగ్గరకి వచ్చాడు. కోటయ్య చేతిమీద చేయివేసి గంభీరంగా అన్నాడు.

"అన్నయ్యా... ఇప్పుడు మనలో దోషమెవరిదని వెతకడం కన్నా... వర్ధనిలో హింసాయుత ధోరణికి మూలమేమిటో ఆలోచిస్తే మంచిదేమో? వర్ధనిలో విపరీత ధోరణికి అందరం... అందరం బాధ్యులమే! వర్ధని మీమీద తన మమకారాన్ని అధికారంగా మలచుకొంది. దాంట్లో మీ తప్పేమీ లేదు. తన స్థానంలో ఇంకొకరిని ఊహించడమే ఆ పసిమనసుకు అసాధ్యమైనపుడు, పాప ఆ స్థానాన్ని సునాయాసంగా ఆక్రమించడంతో తట్టుకోలేక పోయినట్లుగా వుంది. ఇది సహజమేనేమో! కానీ ఆ అసూయ ద్వేషంగా మారి... వర్ధని బాల్యాన్నే దహించివేస్తోంది! అదే నా బాధ!"

కోటయ్య గంభీరంగా తలాడించి, ముకుందం భుజాన నెమ్మదిగా తట్టాడు.

ముకుందం జయమ్మ వైపు తిరిగి అన్నాడు, "వదినా... ఇప్పుడు వర్ధనికి మనందరి ఆప్యాయతా, ఆదరణలతోపాటు వివేచన, సానుభూతి కూడా కావాలి. మీ అభిమానాన్ని వేలెత్తి చూపడం లేదు కానీ... పెద్దవాళ్ళుగా మనం వర్ధనిని గాడి తప్పకుండా చూడొద్దా? "

వేణు, వర్ధని పందిట్లోకి వచ్చిన సవ్వడి అవడంతో జయమ్మ కళ్ళు తుడుచుకొని గబగబ బయటకు వెళ్ళింది. కోటయ్య ముకుందం చేతిని నొక్కి, మౌనంగా బయటకు వెళ్ళాడు.

లలిత తనలోని శక్తి అంతా తోడేసినట్లుగా గోడకు చేరగిలబడి వుంది. పాతాళంలోంచి మాట్లాడుతున్నట్లుగా అంది.

"వాణి వున్నట్టుగా ఎందుకు వుండదిదీ? ఎందుకిలా చిత్రహింస పెడుతోంది? "

"అందరూ ఒకేలా వుంటే ఇక అనుకునేదేం వుందీ? " అంటూనే ముకుందం ఆలోచనలో పడ్డాడు. లలిత కూడా మౌనంగా వుండిపోయింది.

"వర్ధనిని ఇక్కడినుంచి దూరంగా తీసుకెళ్ళడానికి ముందే మానసికంగా సిద్ధం చేయకపోవడం మన మొదటి పొరపాటు. తన మొట్టమొదటి విధ్వంసక చర్యను ఖండించి, దండించి వదిలేసామే అది రెండవ పొరపాటు. మనం అలా తేలికగా తీసిపారేయకుండా ఆ విషయాన్ని అప్పుడే సానుభూతిగా పరిశీలించి వుంటే ఇంతదాకా వచ్చేదే కాదేమో! మననుంచి పూర్వపు అభిమానాన్ని పొందడానికి అనుక్షణం తల్లడిల్లుతోన్న వర్ధని మానసికక్షోభను ఏ కొంచమైనా అర్థంచేసుకొని వుండేవాళ్లం. మానసిక సంఘర్షణతో కొట్టుమిట్టాడుతూ తీవ్ర అసంతృప్తికిలోను కాకుండా చేసేవాళ్ళం. పరాధీనతలో తన అస్తిత్వం నిరూపించుకోవడానికి వర్ధని అనుక్షణం అనుభవించిన అలజడికి ప్రతీక ఆ విధ్వంసం! దాన్ని గుర్తించడంలో మనం చాలా ఆలస్యం చేసాం! చాలా ఆలస్యం!! " ముకుందం




తనలో తను గొణుక్కున్నట్టుగా అన్నాడు.

"కన్నవాళ్ళం మనం పరాయివాళ్లం ఏంటండీ?" లలిత బాధగా అంది.

ముకుందం మేడం మాటలు మననం చేసుకొంటూ అన్నాడు, "పిల్లలు అర్థంచేసుకోవాలని ప్రయత్నించేకొద్దీ అర్థంకాని విషయాలు! అంతే! ఆ... అంతే!!" ముకుందం గంభీరంగా తలాడించాడు.

లలిత ముకుందం వైపు ఆశ్చర్యంగా చూసింది.

"అవసరమైతే మహబూబ్‌నగర్ వెళ్ళాక డాక్టర్‌ని కలుద్దాం!"

"డా... డాక్టర్? వర్ధనికి ఏమైందని మీ అనుమానం?" లలిత భయం భయంగా అడిగింది.

కాళ్ళూ చేతులు బంధించబడి, తలకు కరెంటుషాక్‌లు ఇప్పించబడుతోన్న వర్ధని లలితకళ్ళముందు కదలాడింది. వర్ధని లేత కంఠంలోంచి ఆపకుండా వస్తోన్న పిచ్చికేకలు సూటిగా లలిత హృదయాన్ని తాకుతున్నాయి. లలిత తల పగిలి పోతున్నట్టుగా వుంది. భరించలేనట్టుగా కణతలు వత్తుకుంది.

"ఇంకా ఏమీ అవలేదు. అవకముందే మనం జాగ్రత్తగా వ్యవహరించాలని హెచ్చరిస్తోంది! పువ్వులాంటి పసిమనసు సున్నితత్వాన్ని కరడుగట్టనీయవద్దంటోంది! అందుకు ముందు మనం సిద్ధం కావద్దూ... మానసికంగా...!"

లలిత ముకుందం మొహంలోకి అయోమయంగా చూసింది.

"అయినా పసి మనసును గెలవడం ఎంత సేపు? మనలో స్నేహభావం, సహనం వుండాలే కానీ!"

తనవంకే అపనమ్మకంగా చూస్తోన్న లలితను పందిట్లోంచి వినబడుతోన్న మాటల వైపు చెవి ఒగ్గమని సైగచేశాడు ముకుందం.

"వేణన్నాయ్... నేను ఎవ్వరితో మాట్లాడను. నీ ఒక్కడితోనే మాట్లాడతాను! ఇక నుంచి మనిద్దరం ఒక జట్టు! సరేనా?" అమాయకంగా అంటోంది వర్ధని.



# చతుర కతలు

## పందెం

భాస్కర్రావుకి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. డెప్యుటేషన్‌మీద మరో కీలకమైన పదవిలోకి వెడుతున్నాడు. ఆ సందర్భంగా నగర ప్రముఖులు కొందరు ఘనంగా వీడ్కోలు పార్టీ, అభినందన సభ ఏర్పాటు చేశారు.

భాస్కర్రావుకి పెద్ద వయసేం ఉండదు. ఆయన భార్య చాలా అందంగా ఉంటుంది. ఆయనకి ఐదేళ్ల కూతురు, ఎనిమిదేళ్ల కొడుకు.

ఆయనకి ఏర్పాటు చేసిన అభినందన సభకి నగరంలోని వాణిజ్య వేత్తలు ఎక్కువ ఉత్సాహం చూపిస్తున్నారు. దానికి కారణం ముందు ముందు ఆయనతో వాళ్లకి పని ఉంటుంది.

"రేపు పార్టీకి నువ్వు వస్తున్నావా పవన్?" అన్నాడు హరీష్.

"నేను రాకపోవటం ఏమిటి? భాస్కర్రావుగారు మాకు ఫ్యామిలీ ఫ్రెండ్ కదా?" అన్నాడు పవన్.

పవన్ తండ్రి పెద్ద బిజినెస్ మాగ్నెట్. కోట్లకి పడగలెత్తాడు.

"మరి నువ్వురా రవీందర్?"

"నేనూ వస్తున్నాను. మా ఫాదర్ కూడా వాళ్ల క్లబ్ తరపున భాస్కర్రావుగారి శ్రీమతికి ఘనంగా సన్మానం ఏర్పాటు చేస్తున్నారు'' అన్నాడు షాంపైన్ చప్పరిస్తూ.

"మరి నువ్వురా రాజేష్''

"నాకంతగా ఇంట్రస్టులేదు! మీరంతా వస్తున్నారు గనక వస్తాను'' అన్నాడు.

వాళ్లు నల్గురూ మంచి ఫ్రెండ్స్. బిజినెస్ మాగ్నెట్ పిల్లలు.

తరచూ ఆ స్టార్ హెూటల్లో సాయంత్రాలు ఎంజాయ్ చేస్తుంటారు.

"నాకు ఇలాంటి సభలంటే బోర్. అయినా భాస్కర్రావ్‌గారి శ్రీమతి చాలా అందంగా ఉంటుందిగదరా. ఆమెని చూడ్డానికి వస్తున్నాను'' అన్నాడు శ్రీకాంత్.

"అవును... అనకూడదుగాని లవ్లీలేడి'' అన్నాడు రవీందర్ ఆరాధనగా. పవన్ చిన్నగా నవ్వాడు.

"అద్సరే... రేపు సాయంత్రం నేను ఒక అడ్వంచర్ చెయ్యబోతున్నాను. సరిగ్గా పార్టీ



స్టార్ట్ అయ్యే సమయానికి నేను భాస్కర్రావు గారి శ్రీమతిని కౌగలించుకుని ముద్దు పెట్టు కుంటాను''

"వ్వాట్...?" తక్కిన నల్గురూ ఒకేసారి గట్టిగా అరిచారు.

"ఎస్..." అదే నవ్వుతో చెప్పాడు పవన్.

"కాలేజీలో అమ్మాయిని టీజింగ్ చేసినట్టు, లెక్చరిస్తున్న మేడమ్‌ను అల్లరి పట్టించినట్లు అనుకుంటున్నావా? భాస్కరరావుగారి శ్రీమతిని ముద్దుపెట్టుకోవటం అంటే నిప్పుతో చెలగాటం"

"తెల్సు''

పైగా పబ్లిగ్గా అంతమంది నగర ప్రముఖులమధ్యనా... అడ్రస్ గల్లంతు అయిపోతుంది. నీది కాదు మీ నాన్న వ్యాపారాలు''

"అన్నీ తెలుసు''

"తెలిసే..."

"అవును... రేపు సాయంత్రం సరిగ్గా భాస్కర్రావుగారి అభినందన సభ ప్రారంభం అయ్యే సమయానికి నేను వెళ్లి ఆయనగారి శ్రీమతిని కౌగలించుకుని ముద్దు పెట్టుకొంటాను. నో కామెంట్స్. నేను మాటంటే ఇంతవరకు వెనక్కి తీసుకోలేదు. పందెం" అన్నాడు.

పవన్ గొంతు నిక్కచ్చిగా ఉంది.

"పందెమా?"

"అవును... ఎంత?"

"మీ ఇష్టం"

"సరే అయితే నా పందెం రెండు వేలు'' అప్పటికప్పుడు పర్సు తీసి ఐదొందల నోట్లు నాలుగు బల్లమీద పెట్టాడు శ్రీకాంత్. అంతే!

తక్కిన ముగ్గురూ కూడా తలా రెండు వేలు పందెం కాశారు.

"సరే... నువ్వు గెలిస్తే మేం నల్గురం రెండేసి వేలు చొప్పున ఎనిమిది వేలు నీకిస్తాం... మరి నువ్వు ఓడిపోతే?"... సందేహంగా చూశాడు రవీందర్.

పవన్ నవ్వాడు.

"నేను ఓడిపోవటం అన్నది జరగదు. ఒకవేళ అదే జరిగితే ఇంకో రెండు వేలు నా వాటా వేసి మొత్తం పదివేలతో మీకు మంచి పార్టీ ఇస్తాను'' అన్నాడు.

"అయితే రేపు సాయంత్రం పార్టీ ప్రారంభం అయ్యే సమయానికే నువ్వు భాస్కర్రావుగారి శ్రీమతిని కౌగలించి ముద్దు పెట్టుకోవటం ఖాయం అంటావ్''

"సెంట్‌పర్సంట్ ఖాయం"

కొద్దిక్షణాలు సూది కిందపడితే వినిపించే నిశ్శబ్దం. మిత్రులు తనకేసి విభ్రాంతిగా చూస్తుంటే తనలో తనే నవ్వుకున్నాడు పవన్.

★ ★ ★

ఆ మర్నాడు సాయంత్రం ఆరవుతుంటే రంగరంగ వైభవంగా అభినందన సభ ప్రారంభం అయ్యింది.

భాస్కర్రావు, వారి శ్రీమతి, ఆయన పిల్లలిద్దరూ వచ్చారు. భాస్కరరావుగారి శ్రీమతి ఆలైట్ల వెలుగులో అప్సరసలా మెరిసిపోతోంది. కెమేరాలు క్లిక్ మంటున్నాయి.

"ఏమిరా పవన్? సభ ప్రారంభం కాబోతోంది'' హెచ్చరించారు మిత్రబృందం.

"ఓకే..." పవన్ చిరునవ్వుతో కాలర్ పైకెత్తి చేతికున్న ఖరీదైన గోల్డ్ చెయిన్ స్టయిల్‌గా సవరించుకుంటూ వేదిక దగ్గరకి వచ్చాడు.

మిత్రబృందం ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

పవన్ చకచకా సభావేదిక ఎక్కాడు.

పవన్ తండ్రి అక్కడక్కడ హడావుడిగా తిరుగుతున్నాడు. ఈ అభినందన సభకి ఆయనదే పైచెయ్యి.

పవన్ భాస్కరరావుగారి దగ్గరకి వెళ్లి చిరునవ్వుతో కరచాలనం చేశాడు. వారి శ్రీమతితో నవ్వుతూ మాట్లాడాడు. ఆవిణ్ణి

అనుకుని కూర్చున్న వాళ్ల ఐదేళ్ల పాపని గభాల్న ఎత్తుకొని గుండెకి హత్తుకొని పాప చెక్కిళ్ల మీద ముద్దులు కురిపించాడు.

మైకు దగ్గరకి వచ్చి గొంతు సవరించుకుంటూ, "నేను మా నాన్నకి ఒక్కణ్ణే కొడుకుని. నాకు తోబుట్టువులు ఉంటే ఎంత బాగుంటుందో అనుకునేవాణ్ణి. కాని భాస్కర్రావుగారి కుటుంబంతో పరిచయం అయి వాళ్ల పాప నాకు పరిచమయ్యాక నాకు తోబుట్టువులు లేని కొరత తీరిందనిపించింది. ముఖ్యంగా ఈ పాప పేరు నన్ను ఆకర్షించింది. ఈ చిన్నారి ఐదేళ్ల పాప పేరు శ్రీమతి. మనం పెళ్లి అయిన వాళ్లని శ్రీమతి అని పెళ్లికాని వాళ్లని కుమారి అని అంటాం కానీ భాస్కరరావుగారి పూర్వీకుల కాలంలో వాళ్ల కులదైవం శ్రీమతి జగన్నాయకి ఆలయం ప్రసిద్ధి గాంచిందిట. అందుకని వాళ్ల ఇంట పిల్లలకి శ్రీమతి అని, జగన్నాయకి అని పేరు పెడతాం అని నాకు వివరించారు. అప్పట్నించి ఈ చిన్నారి శ్రీమతి జగన్నాయకి నా ప్రియసోదరి అయిపోయింది. ఈ అభినందన సందర్భంగా నా చిన్నారి చెల్లి శ్రీమతికి నా ఈ చిన్న కానుక" అంటూ జేబులోంచి చిన్న ఎర్ర కాగితం పొట్లం తీసి బంగారు చెయిన్ పాప మెళ్లో వేశాడు.

మళ్లీ ఒకసారి శ్రీమతి జగన్నాయకిని గట్టిగా కౌగలించుకుని పాప చెక్కిళ్ల మీద ముద్దుల వర్షం కురిపించాడు పవన్.

దూరం నుంచి అదంతా చూస్తున్న మిత్ర బృందం బిత్తరపోయారు. పెద్ద విస్ఫోటం ప్రేలుతుందని ఊపిరి బిగపట్టిన వాళ్లకి బాంబు తుస్సుమన్నట్లు అయ్యింది.

"నిజమేరా! కొంతమంది ఆడవాళ్ల పేర్లు శ్రీమతి అని కుమారి అని ఉంటాయి. మా వీధిలోనే ఓ లేడి డాక్టరుంది. డాక్టరు శ్రీమతి, గైనకాలజిస్ట్ అని బోర్డు కూడా వుంది. ఏమిటో నేను అంతదూరం ఆలోచించలేదు'' అన్నాడు రవీందర్.

"అవున్రా! మా అక్కయ్య ఫ్రెండ్ ఒకామె పేరు కుమారి. ఆమెకి పెళ్లయింది. మిసెస్ కుమారి అని రాసుకుంటుంది' అన్నాడు శ్రీకాంత్.

అప్పటికే వాళ్ల జేబుల్లోంచి పర్సులు బయటికి తియ్యసాగారు.

-కాకాని కమల

## పెద్ద కాకి...

"పెద్దమ్మగారూ!"

"ఓ... ఎవరూ? పక్కింటి కొత్తకోడలా! రామ్మారా నీ పేరు సుధకదూ''

"అవునండి'' అంది సుధ.

"అవునూ మీ ఆయన డ్యూటీకి వెళ్ళిపోయాడా? ఆ వెళ్లకేం చేస్తాడులే. కొత్త కాపురం ఎలా వుంది? మీ అత్తగారు నిన్ను బాగా చూస్తుందా?"

"మరేం... మా అత్తగారు..."

"ఇంత చల్లని వేళలో ఆమె గురించి ఎందుకులేమ్మా. మీ అత్తగారు పిసినారిది. దేనికయినా పెట్టిపుట్టాలి. నిన్ను ఏమైనా తినమని పెడుతుందా?"

"అది కాదండి.... మా అత్తగారు..."

"నీలాంటి అందమయిన కోడల్ని తెచ్చుకున్న ఆవిడకి సిగ్గు రాలేదా, నిన్ను పొందడానికి పూర్వజన్మలో ఎలాంటి నోము నోచిందో గాని, ఈ జన్మలో నీకు శనిలా దాపురించింది. ఆమె తేనెపూసిన కత్తి... జాగ్రత్తమ్మా''

"అది కాదండి. మరేమో మా అత్తగారు, మిమ్మల్ని..."

"తిడుతుందా, ఎందుకు తిట్టదు. నేనంటే అసలే ఒళ్లుమంట. అయినా నేనేం చేశాను ఆవిడ్ని. చీటికిమాటికి నామీద ఈ వీధిలో అందరికీ చాడీలు చెబుతుంది. ఇదేమన్నా బాగుందా సుధా''







"అది కాదు పెద్దమ్మగారూ! నేచెప్పేది పూర్తిగా వినండి. మా అత్తగారు జ్వరంతో పడిపోయారు. ఆయనేమో డ్యూటీకి వెళ్లిపోయారు. మొన్న మీరు నా దగ్గర చేబదులుగా తీసుకున్న వంద రూపాయలు ఇచ్చేస్తారేమోనని... మరేం అనుకోకండి''

"అనుకోవడమేంటే సుప్పనాతి! చేబదులు నువ్వొచ్చి అడిగేవరకూ నేనివ్వననుకున్నావా? ఎంత నంగనాచివే! నీకన్నా మీ అత్తయ్యే నయం. నీలాంటి పాపిష్టికోడలు ఎక్కడ దాపరించిందే! అలాంటి మహాలక్ష్మికి. నీ ముష్టి వందరూపాయలు నీ మొహాన పారేస్తాలే. వెళ్లెళ్లు. ఇచ్చి పదిరోజులవ్వలేదు గాని. ఈ వీధిలో నన్ను అడిగేవారే ఇంతవరకూ లేరు. అలాంటిది పిల్లకాకివి''

-యం. కాళీ వెంకటసీతారామ్

## టిఫిన్ ఖర్చు

రమణారావు డిగ్రీ అయింతర్వాత ఉద్యోగాలవేట మొదలుపెట్టాడు. పట్టువదలని విక్రమార్కుడిలా అప్లికేషన్‌లు పంపుతున్నా ఒక్కదానికీ రిప్లై రావడంలేదు. ఎట్టకేలకు భాగ్యనగరంలో ఓ ఆఫీసులో ఉద్యోగం వచ్చింది. నగరం నడిబొడ్డులో వున్న ఆ ఆఫీసుకి దగ్గరలోనే ఓ చిన్న గది కూడా దొరికింది. అద్దె ఎక్కువే అయినా సిటీ బస్సుల బాధ తప్పినందుకు సంతోషం వేసింది. అప్పటిదాకా మరీ పల్లెటూళ్లో బతికాడేమో నగరజీవితానికి అడ్జస్టవడం కష్టంగానే ఉంది. అందులోనూ పొద్దుటే లేచి తినే చద్దిబువ్వ లేకపోవడం మరీ ఇబ్బందిగా ఉంది. అసలే ఆకలికి ఆగలేని ప్రాణం. హోటల్ టిఫిన్స్ బాగానే ఉన్నాయనిపించినా కనీసం పది కాగితం ఖర్చయిపోతోంది. రోజుకి పది చొప్పున నెలకి మూడొందలు, అదీ అర్ధాకలిగా తింటేనే. "ఇలాగయితే చాలా కష్టం. ఎలాగయినా టిఫిన్ ఖర్చు తగ్గించా"లనుకున్నాడు.

తన రూంకి, ఆఫీసుకి చుట్టుపక్కల ఉన్న కేంటీన్స్ అన్నీ మార్చి చూశాడు. రేట్లు తక్కువయితే దానికి తగ్గట్టుగానే పదార్థాలుంటున్నాయి. పదార్థాలు పద్ధతిగా వుంటే ధరలు ఎక్కువగా వుంటున్నాయి. ఎంత ఆలోచించినా, బుర్ర బద్దలు కొట్టుకున్నా టిఫిన్ ఖర్చు ఎలా తగ్గించాలో మాత్రం రమణారావ్‌కి అర్థంకావడంలేదు. వచ్చే జీతంలో ఓ వంద రూపాయలైనా మిగిల్చి యింటికి పంపాలనే కోరిక తీరడంలేదు. ఖర్చులన్నీ జీతానికి సరిగ్గా సరిపోతు

న్నాయి.

చివరికి తన బాధంతా తోటి ఉద్యోగి భీమారావ్‌తో చెప్పుకున్నాడు. రమణారావ్ గోడంతా విన్న భీమారావ్ చిద్విలాసంగా నవ్వాడు. నవ్వి, "ఇదో పెద్ద సమస్యా" అన్నట్టు రమణారావ్‌వంక చూశాడు. "చూడు ఫ్రెండూ... మా యింట్లో యింత మందిమి ఉన్నామా. టిఫిన్‌కోసమని పట్టుమని పది పైసలు ఖర్చుపెట్టమనుకో" అన్నాడు.

ఆశ్చర్యపోయాడు రమణారావ్ "అబ్బ...



అయితే ఏదో మంచి ఉపాయం ఉందన్న మాట. అదేమిటో నాకూ కాస్త చెప్పి పుణ్యం కట్టుకో ఫ్రెండూ" ప్లీజింగ్‌గా అడిగాడు రమణారావ్.

ఏదో చెప్పబోయాడు భీమారావ్. అంతలో ఆఫీసర్‌నుంచి పిలుపు రావడంతో రమణారావునలా వదిలేసి ఆఫీసర్ గదిలోకి వెళ్ళిపోయాడు భీమారావ్. ఆ తర్వాత ఆఫీసర్‌తో కల్సి బయటకు వెళ్ళిపోయాడు.

రమణారావ్‌కి ఆరోజుకి ఇహ భీమారావ్‌ని కల్సే అవకాశం కలగలేదు. ఆ రాత్రంతా నిద్రేపట్టలేదు రమణారావ్‌కి. తన ఒక్కడికే యింత ఖర్చవుతుంటే, కుటుంబానికంతకీ కల్పినా పదిపైసలు ఖర్చుపెట్టని భీమారావ్ తెలివితేటలు అమోఘం అనుకున్నాడు. ఏంచేసి టిఫిన్ ఖర్చులు తగ్గిస్తున్నాడో రాత్రంతా నిద్రమాని మేలుకొని ఆలోచించనా రమణారావ్ బుర్రకి తట్టలేదు. మర్నాడు ఆదివారం. ఆఫీసు సెలవు. సోమవారందాకా ఆగే ఓపిక లేక పొద్దుటే లేచి గబగబా తయారై భీమారావ్ ఇంటికి బయల్దేరాడు.

ఆవులిస్తూ బయటకొచ్చిన భీమారావ్‌కి ఎదురుగా కన్పించిన రమణారావ్‌ని చూసే సరికి ఆశ్చర్యం వేసింది. "ఏంటోయ్ ఇంత ప్రొద్దుటే యిలా వచ్చావ్" అని అడిగాడు.

"అబ్బె... అదే... టిఫిన్ గురించి డబ్బులు ఖర్చుపెట్టనన్నారు కదా. ఆ విషయం తెల్సుకుందామని" సిగ్గుసిగ్గుగా నవ్వుతూ అన్నాడు రమణారావు. తర్వాత తన ఆర్థిక సమస్యలన్నీ వివరించేడు.

ఒక్కసారిగా బిగ్గరగా నవ్వాడు భీమారావ్. "దీనికోసమా యింత పని గట్టుకు వచ్చావ్. టిఫిన్‌కోసం ఖర్చుపెట్టనన్నా నంటే..."

కాస్త దీర్ఘం తీసినా సహించలేనట్టు ఆత్రతగా చెవులు రిక్కించి మరీ ముందుకు వంగాడు రమణారావు.

"... మేము పొద్దుటే లేవం లేచినా టిఫిన్స్ తినమోయ్" అన్నాడు నవ్వును కంటిన్యూ చేస్తూ.

నోరు తేలేసాడు రమణారావ్.

– సూరిపండు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad. Tel: 229428. Office Address: VIPULA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 470434; Vijayawada 476685; Visakhapatnam 52211; Tirupati 5291; Anantapur 22977; Rajahmundry 71390; Karimnagar 83216.

CHATURA Telugu Monthly Hyderabad–500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక
# ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మడ్డి నీలి మరకలు పడుతాయి.

వైజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రోడిస్పెర్షన్ ఫార్ములేషన్ కలిగిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మచ్చులేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన చారల ఘరకల మచ్చల అవశేషాల్ని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం – కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా – బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. దాన్లోగల పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

<u>వి+ గల వైట్‌నర్ ఉజాలా</u>

అసలు వి+ ఎందుకని? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది? మరి గమనించారా యిది – బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కళని పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టలలోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కాని ఆ ప్రక్రియతో బట్టలు పాడైపోయినట్లు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మడ్డి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన చారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగల 'మైక్రో డిస్పర్షన్ కేటలిస్ట్ వి+' నీటిలో సరిసమానంగా కరిగిపోయే, బట్టల పోగుపోగులోకీ తక్షణమే చొచ్చుకు పోయే, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదీ వి+ ప్రత్యేకత.

<u>మిరుమిట్లుగొలిపే తెల్లదనం – చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే</u>

మరొక పనికొచ్చే కిటుకు – ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాలకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుందీ మీకే.

ఇక చారల మచ్చలువడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చో వాలిగనక? ఉందిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుందిగదా అందుబాటులో?

## నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు

**ఉజాలాని సరిగా వాడటానికి అంచెలు అంచెలుగాగల పదతి**



1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.



2. మీకు కావలసిందల్లా ఒక లీటరు నీటికి 4–5 చుక్కలు.



3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.



4. బట్టల్ని మెల్లిగా జాడించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.

కేవలం 4 చుక్కలు చాలిక !




UJALA

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22/